*Issued on 21—11—1956*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY
## DEBATES
# OFFICIAL REPORT

*TUESDAY, 6th DECEMBER, 1955.*

VOLUME XII — No. 5.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1956

*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Tuesday, the 6th December* 1955.

The House met in the Assembly Hall, Kurnool at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## 1. QUESTIONS AND ANSWERS.

### Starred Questions.

### *Short Notice Questions.*

MR. SPEAKER : Qs. 159-A and 159-B may be taken up together.

*Works under "Local Development Scheme"*

159—A.

* 364—D. Q.—SRI Y. ADINARAYANA REDDY :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether the Government have issued orders to the District Collectors not to take up any work under 'Local Development Scheme' until the prior sanction of the Government is obtained ;

(b) whether the Government consider that this order will not hamper the progress of the implementation of the Local Development Scheme ?

THE HON. SRI Kala Venkata Rao :—

(a) No.

(b) Does not arise.

(a) లేదు.

(b) అందుచేత, దీనికి జవాబు అవసరంలేదు.

*Execution of the Local Development Works*

159—B.

*364—E. Q.—SRI Y. ADINARAYANA REDDI.—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state:

(a) whether the Government consider the desirability of giving certain discretionary powers to the District Collectors in the matter of executing the Local Development Works subject to the overall rules of policy of the Government?

THE HON. SRI K. VENKATA RAO:—Collectors have already been authorised (1) to take up works even outside the approved and reserve lists (2) to aanction the revised estimates. As proposals covering the entire grants allotted to the districts have already been sanctioned, no further delegation of powers will be necessary at this stage.

ఇదవరకు ప్రభుత్వం వారు ఆమోదించినటువంటివిన్నీ ఆ తరువాత అవసరమైనప్పుడు ఉపయోగించడానికి తయారుగా list లో ఉండేటటువంటి వాటికి revised estimates sanction చేసి పనిచేసేటటువంటి హక్కు కలెక్టరులకు ఇవ్వబడింది. ఇటువంటి అధికారము వారికి ఇదివరకే ఇచ్చివేయడంవల్ల, ఇకపైన కొత్తగా delegation చేయవలసిన అవసరం ఏర్పడదని ప్రభుత్వం అనుకొంటున్నది.

SRI P. RANGA REDDI:—ఈ ప్రశ్ననుబట్టి స్థానిక అభివృద్ధి కార్యక్రమం క్రింద sanction చేయబడేటటువంటి పనులు ప్రభుత్వంవరకు రానక్కరలేదని అర్థంచేసుకోవాలసియుంటుంది. అందుచేత ఈ పనులకు ప్రభుత్వము యొక్క మంజూరు అక్కరలేదా మంత్రిగారిభావము.

THE HON. SRI K. VENKATA RAO:—ప్రశ్న ఏమివేశారో చదువుకొండి, అర్థమవుతుంది.

SRI P. RANGA REDDI:—"Whether the orders to the District Collectors not to take up any work under Local Development Scheme until the prior sanction of the Government is obtained" అనే ప్రశ్నకు "No" అన్నారు. అంటే "even

without the prior sanction of the Government the works can be taken up" అనే కదా అర్థము. అది సరేనా అని మంత్రిగారిని అడుగుతున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :—అది సరి కాదు.

SRI P. RANGA REDDI :—అయితే, ఈ పనులు ఎవరు మంజూరు చేయాలి? కలెక్టర్లకు ఎంతవరకు మంజూరు చేయడానికి అధికారం ఉన్నది? అటు వంటి నియమము ఏమైనా ప్రభుత్వము పెట్టిందా ?

THE HON. SRI K. VENKATA RAO :—Local Development Works కు సంబంధించినంతవరకు, ఇదివరకే తయారుచేసి sanction అయి reserve list లో అట్టిపెట్టినటువంటి schemes కు revised estimates చేసి ఖర్చుపెట్టుకోనేందుకు కలెక్టర్లకు పూర్తిగా అధికారము ఇదివరకే ఇచ్చారు. అయితే ఈవేళ ఉన్న పరిస్థితి ఏమిటంటే, గత రెండు సంవత్సరముల నుండి ఇచ్చినటువంటి సొమ్ముకు సంబంధించినంతవరకు చాలా జిల్లాలలో పూర్తిగా కార్యక్రమాలన్నీ ఆమోదింపబడడంవల్ల ఇకపైన ఇటువంటి అధికారము వారికి ఇవ్వవలసిందిగాని, వారు పుచ్చుకోవలసిందిగాని, అటువంటి delegation అవసరంలేదు.

SRI B. RATHNASABHAPATHI :—కొన్ని గ్రామములలో Local Development Schemes క్రింద నే బావులు త్రవ్వమని ఉత్తరువు ఇచ్చారు. కొంత త్రవ్విన తరువాత stop చేయమని ఉత్తరువులు జారీచేశారు. ఇక ఈ సగంకూడా ప్రభుత్వము యొక్క prior sanction తీసుకొని చేయాలని ఉద్దేశము లేకపోతే అసలు ఇవి execute చేయవలసిన అవసరం లేదు అనే ఉద్దేశమా ?

THE HON. SRI K. VENKATA RAO :—వారు దేనికి చెప్పారో నాకు తెలియదుగాని, ఇదివరకు ప్రభుత్వము approve చేసి, నుయ్యి కొంత త్రవ్వి stop చేసి ఉంటే దానికి మరల ప్రభుత్వముయొక్క permission లేకనే దానిని పూర్తిచేయవచ్చును.

SRI L. LAKSHMANA DAS :—ఈ local works విషయంలో, మరల Government sanction అయ్యేవరకు ఆగడంవల్ల, కొన్ని కొన్ని పనులలో ఆటంకాలు,ఆలస్యము జరుగుతుంది. అందుచేత, అక్కడ local contribution వచ్చేటపుడు ఈ works ను take up చేయడానికి కలెక్టర్లకు discretion ఇవ్వడం వల్ల ఏమి ప్రమాదంలేదని భావిస్తున్నాను. కాబట్టి ఈ విషయము ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—లక్ష్మణదాసు గారు నేను చెప్పింది వినలేదనుకొంటాను. గత రెండు సంవత్సరాలలో వచ్చినటువంటి 66 లక్షల రూపాయిలకు సంబంధించినంతవరకు, ప్రతి జిల్లాలోను అక్కడి పనులకు కావలసినటువంటి ఆమోదము ప్రభుత్వము దగ్గరనుండి కలెక్టర్లు తీసుకొన్నారు. 31-3-1956 తోటి ఈ works ఆఖరు అయిపోతున్నాయి.— Second Five-Year Plan కు వీటికి సంబంధంలేదు. అందుచేత కలెక్టర్లకు discretion ఎక్కడ కావలెనో నాకు అర్థంకావడంలేదు.

SRI L. LAKSHMANA DAS :— ఇప్పుడు sanction చేసినవి కొన్ని ఉన్నవి. కాని అక్కడ ఏకారణంచేతనో పనులు పూర్తి చేయకుండా ఉండిపోయినవికూడ కొన్ని ఉన్నాయి. అలాంటప్పుడు కొత్త works ఏవైనా పెట్టేటపుడు వాటికి Sanction ఇవ్వడానికి కలెక్టర్లకు అధికారమిస్తే ఆ డబ్బు ఖర్చుపెట్టుకోడానికి అవకాశముంటుంది. అందుచేత అటువంటి విషయాలలో కలెక్టర్లకు అధికారంఇవ్వాలని కోరుతున్నాను.

THE HON. SRI K. VENKATA RAO:—అటువంటి విషయాలలో నే ఇవ్వకూడదు, ఎందుచేతనంటే, ఒక ఊరివారేమో మేము ఇస్తామంటేకూడా కలెక్టరు ఇంకొక ఊరికిమార్చివేశారు అని చెప్పే అవకాశము ఏర్పడుతుంది. M.L.A. లలో తగాదాలు వస్తాయి. అందుచేత అటువంటి విషయాలలో గవర్నమెంటు ఆమోదము పుచ్చుకోవలసిందే.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, 66 లక్షలకు సంబంధించిన works అన్నిటికికూడ sanction ఇదివరకే చేశాము, అని మంత్రిగారు చెప్పుతున్నారు. కాని revised estimates ప్రకారము కొంతడబ్బు మిగిలిపోవడం జరుగుతుంది. 31-3-1956 నాటికి local development works పూర్తిఅయిపోతున్నాయని చెప్పుతున్నారు. ఆ విధంగా మిగిలిపోయిన డబ్బును ఖర్చుపెట్టి ఇతర కొత్త works తీసుకోడానికి కలెక్టర్లకు అధికారము యిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—కొత్త works పెట్టడానికి ఏ విధమైన అభ్యంతరంలేదు. కాని కలెక్టర్లకు మాత్రము ఆ అధికారము యివ్వము.

SRI P. SREERAMULU :—Current year లో sanction అయిన schemes 31-3-56 నాటికి విధిగా పూర్తిచేయాలని sponsors దగ్గర హామీ తీసుకొనికూడ, నవంబరు, డిశెంబరువరకుకూడ, work orders యివ్వకుండా కలె

6th December 1955]

కృర్లు జాగుచేస్తున్నారు. అటువంటి కేసులలో సకాలములో పనిపూర్తిచేసేటట్లుగా కలెక్టర్లకు ఉత్తరువులు వెంటనే జారీచేస్తారాఅని Planning మంత్రిగారిని అడుగుతున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :—దీనికి ప్రత్యేకమైనటువంటి శ్రద్ధతో చేః ప్రభుత్వంవారు కృషిచేస్తున్నారు. ఒక్కరూపాయకూడ తిరిగి Government of India కు పంపించకూడదనే ఉద్దేశంతోనే జిల్లాలకు కొత్త supervisors ను వేయడము కొత్తసిబ్బందినియిచ్చి ఈపనిని ఏవిధంగానైనాసరే పూర్తి చేయాలనే యత్నంతోనే ప్రభుత్వము ఉన్నది.

SRI M. NAGESWARA RAO :—అధ్యక్షా, second five year plan లో local development works అసలు ఉండనేఉండవని అంటున్నారు. అంటే ఈ first five year plan లో local development కార్యక్రమము పూర్తిఅయిందనా లేకపోతే finance లేకనా, యెందుకో సెలవిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—నాగేశ్వరరావుగారు రెండవ పంచవర్ష ప్రణాళికపై discussion అయినరోజు ఇక్కడనే ఉండినారనుకొంటాను. ఈకొత్త ప్రణాళికలో ఇకపైన national extension service blocks, community development blocks ద్వారానే ఈపని పూర్తిచేయాలనే నిర్ణయంఉన్నది గనుక, local development అనేది వేరుగాఉండడం తటస్థించదు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, యిదివరకు డబ్బు one-fourth deposit చేయవలెననేది ఉన్నది. అది యిప్పుడు అక్కరలేదు. వాళ్లుగనుక కొంత పెట్టుబడిపెట్టి పనిచేసినట్లయితే, ఆ పనినిచూసి మేము డబ్బుయివ్వడానికి వీలుఅవుతుందని యిదివరలో మంత్రిగారు సెలవిచ్చారు. కాని యిప్పుడు one-fourth deposit చేస్తేనేగాని ప్రారంభించము అని అంటున్నారు. కనుక యిప్పుడు అటువంటి deposit చేయవలెనా, అక్కరలేదా? పనిచేసిన తరువాత డబ్బు యిస్తారా ? అది కొంచ్చ వివరించవలసిందిగా కోరుతున్నాను.

THE. HON Sri K. VENKATA RAO .—ఈతొందరలో రెండు రకాలుగా చేసుకోవచ్చు, ఆ పనినిబట్టి. అదిఎగగొట్టకుండా మార్గమేమైనాఉంటే, దానికి తగినఏర్పాటుచేయడానికి వీలుంటుంది.

[6th December 1955

*Inclusion of Rayachoti Taluk in the Development Block (N.E.S.)*

159—C

* 364—H. Q.—SRI Y. ADINARAYANA REDDI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether Rayachoti Taluk will be included in the next list of Development Blocks (N.E.S.) in Cuddapah District ; and

(b) If not, when the Rayachoti Taluk will be taken up under National Extension Schemes according to present programme ?

THE HON. SRI K. VENKATA RAO —

(a) The question of selection of areas for locating the next allotment of N.E.S. Blocks is under consideration of the Government.

(b) As per the tentative programme, Rayachoti Taluk in Cuddapah District will be taken up in 1957—1958.

ప్రతిజిల్లాలోనూ, తాలూకాలోనూ national extension service blocks ఉండాలని ప్రభుత్వంయొక్క ఆలోచనలో ఉన్నది. ప్రస్తుతము ప్రభుత్వానికివున్న తాత్కాలిక ప్రోగ్రాముప్రకారము కడపజిల్లా రాయచోటిలో 1957-58 సంవత్సరమునుంచి national extension service block ఒకటి ఏర్పాటుకావాలని వున్నది.

SRI B. RATNASABAPATHY :—కడప జిల్లాలో మిగతా తాలూకాలోగూడా యీ blocks ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రస్తుతము ఈబ్లాకుకు సంబంధించిన జాబితా నావద్దలేదుకాని, యీ సంవత్సరము blocks ను అన్ని ఏర్పాటు చేయలేకపోయినాము. దీనికి కారణము తరిఫీదుఅయిన విలేజివర్కర్సు లేని కారణముచేతనే పెట్టలేకపోయినాము. రాబోయే జనవరినెలలో సుమారు రెండువందలమంది training అయిన village level workers దొరుకుతారు గనుక, జనవరినెల ఆఖరులోగా 22 blocks ఏర్పాటుచేయటానికి, కొత్తప్లానింగుకు సంబంధములేకుండా, యిప్పటికి ఉన్నడబ్బు ఖర్చుచేయటానికి, సరిపోతుంది.

ఇప్పటివరకూ తాత్కాలికంగా select చేయబడి orders final గా తయారైనవి చెబుతున్నాను.

శ్రీకాకుళంజిల్లా — సోంపేట, పాలకొండ.

విశాఖపట్టణంజిల్లా — శృంగవరపుకోట, భీమునిపట్టణం, గూడెం.

తూర్పు గోదావరిజిల్లా — అమలాపురం, కొత్తపేట.

పశ్చిమ గోదావరిజిల్లా — కొవ్వూరు, తాడేపల్లిగూడెం.

కృష్ణాజిల్లా — నూజివీడు, తిరువూరు.

గుంటూరుజిల్లా — బాపట్ల, వినుకొండ.

నెల్లూరుజిల్లా — నెల్లూరు, ఆత్మకూరు.

కర్నూలుజిల్లా — కర్నూలు, పత్తికొండ.

అనంతపురంజిల్లా — అనంతపురం, ధర్మవరం.

కడపజిల్లా — ప్రొద్దుటూరు, బద్వేల్.

చిత్తూరుజిల్లా — కాళహస్తి.

ఇవన్నీ తాలూకాలుగాని, బ్లాకులు కేవ్లు కావు. ఈ తాలూకాలలో మరల బ్లాకులు తయారు చేయవలసి వున్నది. Fresh blocks విషయము ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, మంత్రిగారు చదివిన జాబితాలో కృష్ణాజిల్లాలో నూజివీడు, తిరువూరు అని ఉన్నది. అక్కడ యిదివరకే బ్లాకులువున్నవే. అందువల్ల మంత్రిగారు పాతలిస్టును చూచి చదివినారా ? కొత్తబ్లాకులు పెట్టటానికి ప్రభుత్వము నిర్ణయించారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు నేను చదివిన తాలూకాలలో, తాలూకాఅంతటా యీబ్లాకులు ఏర్పాటుచేయలేదు. మిగిలిపోయిన బ్లాకులకు యీ తాలూకాలు వర్తిస్తాయి.

SRI N. VENKAIAH :—గుంటూరుజిల్లాలో ముందుపెట్టబోయే బ్లాకులు బాపట్లతాలూకాలోనని మంత్రిగారు చెబుతున్నారు. ఆ జిల్లాలో ఒంగోలుతాలూకాలో అద్దంకి ఫిర్కా మిగిలిపోయి యున్నది. అదిగూడా యీసారి చేర్చబడుతుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—దానిసంగతి తరువాత ఆలోచిస్తాము.

## STARRED QUESTIONS.

*Purchase of "Visalandhra" Telugu Daily by the Panchayat Board Libraries.*

*121—

* 37 Q.—SRI M. NAGI REDDI .—Will the Hon. the Chief Minister be pleased to state ·

(a) whether the Government have issued any orders not to purchase "Visalandhra" Telugu Daily to the Panchayat Board Libraries and Reading Rooms ; and

(b) If so, the reasons therefor ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

SRI P. SUNDARAYYA :—లిఖిత పూర్వకముగా ఆర్డరు పంపక పోయినా నోటిమాటలలోనైనా ఆర్డరు యిచ్చారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—నోటిమాటద్వారాగాని ఆకాశవాణిద్వారాగాని ఏలాంటి మాట పంపలేదు.

SRI V. VISWESWARA RAO :—ఏ విధమైన ఆర్డరు పంపలేదని మంత్రిగారు చెబుతున్నారు. ఎక్కడైనా సర్చార్జీ చేసివుంటే వాటినన్నిటిని యీ సర్చార్జీనుంచి మినహాయిస్తారా ? నడికూడి పంచాయితీ బోర్డును సర్చార్జీ చేసి వున్నారు. దాన్ని మినహాయిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :— Local Library Authorities యొక్క అనుమతితో, ఆయా పంచాయతీ బోర్డులు యీ పత్రికను కొనుక్కోవచ్చు. మదనపల్లిలో వారు విశాలాంధ్ర తెప్పించుకుంటున్నారు. ఇక్కడ Legislature వారుగూడా తెప్పించుకుంటున్నారు. ఎవరిమీదను surcharge చేయలేదే ! అది ఏదైనా వుంటే విచారిస్తాము.

SRI P. SUNDARAYYA :—Legislature ప్రభుత్వం అధీనం క్రింద లేదు. అది Speaker అధీనంలో వుందిగదా !

THE HON. SRI B. GOPALA REDDI :—ఎక్కడగూడ విశాలాంధ్ర కొనవద్దని అభ్యంతరము పెటలేదు.

6th December 1955]

SRI N. P. CHENGALRAYA NAIDU :—"విశాలాంధ్ర" పేపరు కొనవద్దని ఆర్డరు యివ్వలేదని అంటే, అది పార్టీ పేపరు కాబట్టి, దాన్ని కొన వద్దని ఆర్డరు ఎందుకు యివ్వకూడదా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ప్రభుత్వానికి వ్యతిరేక ముగా ఏదైనా treason మొదలైనవి వుంటే, అప్పుడు ప్రభుత్వం ఆలోచిస్తుంది.

*Retaining of police forces in Hebbatam village of Kurnool district.*

161—

* 86 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether it is a fact that the inhabitants of Hebbatam village of Kurnool district were asked to bear half the cost of the expenditure of the police forces retained in their village ; and

(b) if so, the reasons therefor ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—(a) and (b) Evidently the member is referring to the recovery of cost of the punitive police force stationed at Hebbatam. The recurring cost of the additional police force is recovered from 39 persons who are the active factionists in the village as provided in section 15 of the Police Act, 1861.

*Cost of additional police force in Julakallu village of Guntur district.*

162—

* 87 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) the circumstances under which the Government have kept additional police force in Julakallu village of Guntur district now ;

(b) whether the villagers require the police force now ; and

(c) who bears the cost of such additional forces ?

2

THE HON. SRI N. SANJEEVA REDDI .—

(a) The village Julakallu was in a continuously unsettled condition due to factious crime. Since this could not be checked by normal processes of law it has become necessary to station a small police force in the village.

(b) The conditions in the village require the continuance of the police force.

(c) The recurring cost of the punitive police is borne by 93 villagers who are active factionists while the non-recurring expenditure is met by the State.

*Deputation of technical persons to foreign countries*

116—

*112 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether there are proposals with the Government to depute technical persons to foreign countries now to study the Woollen Industry ;

(b) if so, the number of such persons ,

(c) the period of deputation ; and

(d) whether the technical persons are available now departmentally ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) No, Sir. లేదు.

(b) and (c) Does not arise. ఉత్పన్నించదు.

(d) No, Sir. లేదు.

*Introduction of Crop and cattle Insurance Scheme.*

*125—

* 57 Q.—SRI. S. VEMAYYA .—Will the Hon. the Chief Minister be pleased to state whether there is a proposal to start crop and cattle insurance scheme in the State ?

THE HON. SRI B. GOPALA REDDI :—A scheme on crop insurance for Virginia tobacco forwarded by the Indian Council of Agricultural Research is under examination. No other proposals for crop or cattle insurance are under consideration.

SRI B. SANKARAIAH :—ఈ Insure చేయడము అవసరముకాదా? ప్రభుత్వం యికముందు అయినా Insurance యొక్క అవసరమును గురించి ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Insure చేయడమనేది అవసరమే. అందుకుగాను ప్రభుత్వానికి ఆర్థిక వ్యవస్థలేదనే ఆలోచిస్తున్నాము.

SRI L. LAKSHMANA DAS :—Crops విషయములోనూ, cattle విషయములోను insure చేయడమనేది విదేశాలలో వున్నది. అందువల్ల, యీస్కీమును గురించి ఏదైనా Literature తెప్పించి సభ్యుల దృష్టికి ప్రభుత్వం తీసుకొని రావటానికి ఏర్పాటు చేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI:—ఇతర దేశాలలో ఎక్కడెక్కడవున్నదో, అదిగూడ చూస్తున్నాము. I.C.A.R. వారుకూడ దీన్నిగురించి examine చేస్తున్నారు. ఈ విషయములో ప్రభుత్వముకూడ 50% భరిస్తేనే తప్ప, యిక్కడ దాన్ని అమలులో పెట్టటానికి వీలులేదు. ఒకవేళ I. C. R. వారు ఒప్పుకున్నప్పటికినీ, ప్రభుత్వంగూడ 50% భరించవలసివుంటుంది.

*Road bridge over Tungabhadra naer Kurnool.*

165—

* 287 Q.—SRI P. RANGA REDDI :—Will the Hon the Deputy Chief Minister be pleased to state :

(a) whether plans and estimates for the construction of a road bridge near Kurnool over the Tungabhadra river have been submitted to the Union Government and whether the Central Government have given sanction ; and

(b) the estimated cost of this bridge ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(a) and (b) : A recast estimate for Rs. 26·35 lakhs for the work of constructing a road bridge over the Tungabhadra

river near Kurnool together with plans was sent to the Government of India in October, 1955 for their technical approval and financial sanction. The sanction of the Government of India is awaited.

SRI K. VIJAYABHASKARA REDDI:—కేంద్ర ప్రభుత్వంనుంచి approval orders ఎంతకాలములోగా రాగలవు ? అవి ఇచ్చిన తరువాత, యీపని ఎప్పుడు ప్రారంభిస్తారు ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Central Government వారి sanction కోసము చాలాముందుగానే పంపించాము. కాని, అక్కడ వున్న Technical Advisor దీన్ని కొంచెము మార్పుచేసి పంపమని చెప్పితే, అవి తిరిగి recast చేసి గడచిన October 17 వ తేదినాడే మరల పంపించాము. అందులో యిబ్బంది యేమీ వుండదు. త్వరలోనే sanction అయివస్తుందనుకుంటాను.

SRI P. SUNDARAYYA :—బ్రిడ్జికి సరాసరి ఒకసారి construction ప్రారంభిస్తారా ? లేకపోతే diversion కు ఏర్పాటుచేసి, తరువాత కొంతకాలము జరిగిన తరువాత బ్రిడ్జి construction ప్రారంభిస్తారా ? ముందు బైటనుంచి ఆరంభించాలని ప్లానులోవుందిగదా ? ఏవిధంగా పని ప్రారంభిస్తారు ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—దానికి ప్లాను వున్నది. ముందు హంద్రీ నదిమీదగూడ బ్రిడ్జి కట్టవలసివున్నది. అది అప్పుడు ఆలస్యం అవుతుంది. అటువంటప్పుడు అవతల కట్టేదానికి, అది తరువాత కట్టుకోవచ్చు. ముందు తుంగభద్ర బ్రిడ్జి కట్టినట్లయితే, అదిముందు వుపయోగిస్తుంది.

SRI P. SUNDARAYYA :—అట్లా అయితే యీ division సంగతి ముందు చూడకుండా, తుంగభద్ర బ్రిడ్జినే ముందు వెంటనే ప్రారంభించటానికి ప్రయత్నిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈ రెండింటిలోనూ తుంగభద్ర బ్రిడ్జే పెద్దది. This diversion wont take more than a fewdays. హంద్రీ బ్రిడ్జి చాలా చిన్నది. అది ఒక్క season లో కట్టివేయవచ్చు. అందువల్ల ముందు తుంగభద్ర బ్రిడ్జి ప్రారంభించడమే మంచిది. Diversion తరువాత ఎప్పుడైనా చేసుకోవచ్చు. Diversion ఆలస్యముగా చేసినప్పటికినీ, యీ తుంగభద్ర బ్రిడ్జి పూర్తికాకముందే, యీ diversion పని పూర్తి చేసుకోవచ్చు. ఈ పని అంతా హంద్రీ బ్రిడ్జిమీద base కాలేదు. అసలు తుంగభద్ర బ్రిడ్జే

main work. దాన్ని మొదట ప్రారంభించి పూర్తిచేయాలి. శాంక్షను వచ్చిన వెంటనే పని ప్రారంభించాలని ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యము.

*Standing Committee of the National Development Council.*

118—

*170 Q.—Sri M. NAGI REDDI:—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether there are any representatives of the Andhra State in the Standing Committee of the National Development Council ; and

(b) if so, who they are ?

The Hon. Sri K. VENKATA RAO —

(a) No, Sir. లేదు.

(b) Does not arise. ఉద్భవించదు.

*Extension of electricity to all over Kavali taluk.*

167—

* 326 Q —Sri B. RAMAKRISHNA REDDI :—Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether any representation was received recently from the public of Kavali taluk, Nellore district to extend electricity to all over the Kavali taluk ; and

(b) if so, the action taken thereon ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) Yes ; Only one representation from the Member of the Legislative Assembly himself.

(b) The matter is under consideration.

30—4—1955 తేదీన గౌరవ సభ్యులనుంచి representation వచ్చినది. దానిమీద ఎంతవరకు చర్య తీసుకోబడిందో ఆ విషయము ప్రభుత్వమువారికి తెలియజేయడమైనది. తెలియపరచిన దానిలో ప్రధాన విషయము ఏమిటంటే, నెల్లూరు జిల్లాలో కావలి తాలూకాలో తొమ్మిది గ్రామాలకున్నూ, ఆత్మకూరు తాలూకాలో అయిదు గ్రామాలకున్నూ, ఉదయగిరి తాలూకాలో పదుమూడు గ్రామాలకున్నూ, సప్లయి చేయాటానికి 35 లక్షలు విలువగల ఒక స్కీము యిప్పుడు చీఫ్ యింజనీరు పరిశీలనలో వున్నదని, అది ప్రభుత్వానికి అందినవెంటనే, ప్రభుత్వానికి అది remunerative గా వుంటే అది అమలు పరచటానికి ప్రభుత్వము చర్యతీసుకుంటుందని 20—7—55 తేదిన తెలియపరచడమైంది.

SRI P. SUNDARAYYA :—శాంక్షను అయిన స్కీమునుగూడా ప్రారంభంచేయాలని యిదివరకు అనేకసార్లు ప్రభుత్వాన్ని కోరడమయింది. కాబట్టి అది వెంటనే ప్రారంభించటానికి, ప్రభుత్వం చర్య తీసుకుంటుందా ?

THE HON. SRI G. LATCHANNA :—ప్రస్తుతము 1955-56 వ సంవత్సరములో అమలుపరచవలసిన స్కీముల జాబితా ఒకటి వున్నది. అందులో శాంక్షను అయినది ప్రారంభించటానికి వీలుఅవుతుంది. వీలయినంతవరకు remunerative గా వుండేవి అన్ని ప్రభుత్వం శాంక్షను చేస్తున్నది. సుమారు ఆరు కోట్లకుపైగా విలువగల స్కీములు అన్నీ శాంక్షను చేయబడ్డవి. అందులో కొన్ని యీ సంవత్సరమే తీసుకోబడతాయి. వచ్చే సంవత్సరము యింకా కొన్ని తీసుకోబడుతాయి.

*Teaching of all subjects in English from III Form to VI Form for all Non-Telugu Students.*

* 131—

* 79 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state whether there are proposals with the Government to introduce the teaching of all subjects in English from III Form to VI Form in the State to the students whose mother-tongue is not Telugu ?

THE HON. SRI B. GOPALA REDDI :—

The answer is in the negative.

*United Nations Day Committee.*

136—

* 136 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state the personnel of the State United Nations Day Committee and the District Committees and their functions and the resources of their funds and their activities ?

THE HON. SRI B. GOPALA REDDI :—

The personnel of the State United Nations Day Committee are ,—

(1) Secretary to Government, Health & Local Administration Department ;

(2) Secretary to Government, Planning & Development Department ,

(3) Secretary to Government, Education & Endowments Department.

(4) Deputy Secretary, Home Department.

(5) Director of Information and Public Relations ;

(6) Srimathi K. Lakshmanan, Kurnool

No District Committees have been formed for United Nations Day Celebrations :

The State United Nations Day Committee formulates and recommends to the State Government measures for the celebration of the United Nations Day in the State. No separate funds have been allocated to this Committee. The State Government will bear the expenditure incurred for the celebration of United Nations Day in the State.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇప్పుడు United nations సంస్థను మనము అందరము చాలా Popular చేయాలనే అభిప్రాయముతో ఉన్నాము. దేశంఅంతా, ప్రపంచము అంతాకూడా దానిమీద ప్రత్యేకంగా చాలా కమిటీలనువేసి United nations యొక్క ధర్మాలను ప్రజలలో ప్రచారం చేయడానికి ప్రయత్నించేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— మేము ఇటీవల జిల్లా విద్యాశాఖాధికారులకు, కలెక్టర్లకు, స్కూళ్ళలో, కాలేజీలలో, దానిని Celebrate చేయవలసిందని వ్రాశాము, చిట్టచివరకు అక్టోబరు 24 అయినా Celebrate చేయాలని చెప్పినాము. ఒక్కొక్కసారి ఏప్రియల్ 25 న, జూన్ 25 న, అక్టోబరు 24 న ఇది వస్తుంది. అక్టోబరు 24 అయినా తప్పకుండా స్కూల్సులో Celebrate చేయాలని తాఖీదులు ఇచ్చాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Officials తో కాకుండా Non officials సంఘాలను ఏర్పాటుచేసి దేశం మొత్తమువిూద ప్రచారం బాగా జరిపితే బాగుంటుంది. ఆ విషయంలో ప్రభుత్వంవారు కృషి చేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—తప్పకుండా అందరూ ప్రపంచంలో శాంతికోసము ప్రయత్నము చేయడను చాలమంచిదే. ఇది రాజకీయ పార్టీలు అన్నికూడా జరుపవచ్చును. గవర్నమెంటే చేయవలసిన అవసరము లేదు. స్కూల్సులోనూ, కాలేజీలలోను చేయుటకు మేము ప్రయత్నంచేస్తాము.

SRI P. VENKATASUBBAYYA .—ఈ కమిటెలయొక్క కాలపరిమితి ఎంత ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఒక సంవత్సరమో, 3 సంవత్సరములో ఉంటుంది.

*Improvement to Kurnool—Cuddapah canal*

170—

* 288 Q.—SRI P. RANGA REDDI :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) the total amount proposed to be spent for improving the Kurnool—Cuddapah canal ;

(b) the number of acres that can be irrigated under this canal after completing the improvements , and

(c) the amount spent so far on its improvements and the nature of improvements carried on so far ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) Rs. 390 lakhs.

(b) 2,00,000 acres.

(c) An amount of Rs. 105·23 lakhs has so far been spent on the scheme. The improvements to the canal from M/0/0 to 42/0 were taken up for this Year's work. The canal was cleared and widened at all narrow points. Silt in bed removed and bed lining with cement concrete was laid. Concrete slabs laid over bed strips. In all 56 per cent of the bed length in the 42 miles could be completed to the end of 15th June, 1955

SRI K. VIJAYABHASKARA REDDI :—అధ్యక్షా, ఈ K. C. Canal improvement ఈ సంవత్సరములో అయిపోతుంది. ఆయకట్టు Improvement మాత్రం కొంచెము ఆలస్యము అవుతుంది. అందువల్ల K. C. Canal Improvement అయ్యేలోపల ఆయకట్టు Improvement అయ్యేట్లు Localisation, Reelama తొందరగా అయ్యేట్లు మంత్రిగారు శ్రద్ధతీసుకుంటారా ;

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈ K. C. Canal పని ఈ సంవత్సరము పూర్తికాదు. అన్నీ Simultaneous గా, ఈ Localisation కూడా చూచుకోవడానికి ఇంజనీర్లను, రెవెన్యూ ఉద్యోగస్థులను వేస్తున్నాము. వారు ఆ పని చూచుకుంటారు.

Sri Ch. SUBBARAYUDU :—ఇప్పుడు ఇది అంతా Wet ఆయకట్టా లేక Wet cue dry కూడా ఉన్నదా ? ఉంటే Commandable areas లో ఎంత Percent ఆయకట్టుగా చేస్తారో చెప్పగలరా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—సాధారణంగా ఇక్కడ ఉన్న ప్రాజెక్టులన్నీ Wet come dry ఉంటాయి. 75 వేల ఎకరాలు Wet అని అనుకొంటున్నాము. మిగిలినది Dry గా ఉంటుంది అనుకొంటాము. అయినా ఇప్పుడు Localise చేస్తేతప్ప ఈ విషయం నిర్ధారణచేసి చెప్పడానికి వీలులేదు.

Sri S. NARAYANAPPA :—ఈ K. C. Canal విషయంలో సిమెంటు Bedding చేసినపని విషయంలో పని సక్రమముగ జరగలేదని ఆరోపణలు ప్రభుత్వానికి వచ్చినట్లు వింటున్నాము. వాటిమీద ప్రభుత్వము ఏమైన చర్య తీసుకుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—సాధారణంగా ఏదో ఆరోపణలువస్తూనే ఉంటాయి. ఆ రకమైన ఆరోపణలుఉంటే మా దృష్టికి తీసుకువస్తే వాటి విషయము ఆలోచిస్తాము.

*Remodelling of Kurnool-Cuddapah canal.*

171—

*297 Q.—Sri B. SANKARAIAH :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether the Kurnool-Cuddapah canal is being remodelled according to the suggestions made by the Technical Committee to allow 6,000 cusecs of water ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—At present the Canal is being remodelled to carry a discharge of 3,0 0 cusees only and the suggestion of the Technical Committe *is also being examined.*

Sri K. VIJAYABHASKARA REDDI:—ఈ 6 వేల క్యూసెక్కులు తీసుకోనేదానికి ప్రభుత్వము నిర్ణయించినట్లయితే ఈ K. C. Canal ఆయకట్టు అంతా Wet ఆయకట్టుగా చేయడానికి వీలవుతుందా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—ఇప్పుడు Technical committee వారి Report క్రింద మాత్రమే ఈ 6 వేల క్యూసెక్కులు అంతా సరిగా చేయమనికోరాము. దీనిని తీసుకపోయి నెల్లూరుజిల్లాలోఉన్న భూమిని సాగుచేయడానికి వీలవుతుందేమో అని వారు చెప్పారు. కాని ఇక్కడ అంతా మార్చాలనే ఉద్దేశ్యంకాదు.

*Opening of a Caustic soda Factory in Palnad taluk.*

120—

*171 Q.—Sri M. NAGI REDDI .—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state whether there is any proposal for opening a Caustic Soda Factory in Palnad taluk ; and if so, when ?

The Hon. Sri K. VENKATA RAO :—No, Sir.

Sri V. VISWESWARA RAO:—అధ్యక్షా, పల్నాడు తాలూకాలో సోడాఆష్ ఫ్యాక్టరీకి కావలసినటువంటి Raw material చాలా దొరుకుతుందని తెలుస్తున్నది. అది మంత్రిగారి దృష్టికివచ్చిందా ? వస్తే వెంటనే చర్య తీసుకుంటారా ?

The Hon. Sri K. VENKATA RAO :—అంతకంటే బాగా ఎక్కువగా దొరికే నవపాడ ప్రాంతములో పెట్టడానికి ఆస్కారములేదనుకుం

టుంటే, పల్నాడులో వీరులు దొరకవచ్చును, రాళ్లు దొరకవచ్చునుకాని కాస్టిక్ సోడా దొరికేట్లులేదు.

SRI B. G. M. A. NARASINGA RAO:—అధ్యక్షా, ఈ కాస్టిక్ సోడా ముఖ్యమైన రసాయినిక పరిశ్రమ కొబట్టి ఈ పరిశ్రమమీద సబ్బులు ఉత్పత్తి, వస్త్రాలఉత్పత్తి పేపర్ల ఉత్పత్తి ఆధారపడిఉన్నవి. కాబట్టి ప్రభుత్వమే ఈ కాస్టిక్ సోడా పరిశ్రమను నెలకొల్పగలదా ?

THE HON. SRI K. VENKATA RAO:—ఇప్పటికి భారత దేశములో లైసెన్సుచేసినటువంటి కాస్టిక్ సోడా ఫ్యాక్టరీల్లో ఉత్పన్నము అయ్యేటటువంటి పదార్థమువారుచెప్పిన అన్ని పరిశ్రమలకుకూడా సరిపోయేట్టుఉన్నది. ప్రభుత్వము వారు అనవసరం కొబట్టి డబ్బుఖర్చు పెట్టుకొని వేరే ఇంకో ఫ్యాక్టరీ కట్టవలసిన అవసరం లేదనుకొంటాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా, ప్రవీణులు ఎవరో మా పల్నాడు తాలూకాకు వచ్చారని, కేంద్రప్రభుత్వము తరఫున వారుచూచి సోడాయాష్ ఫ్యాక్టరీ పెట్టడానికి చాలాఅవకాశాలు ఉన్నాయని పత్రికల ప్రతినిధులతో చెప్పారని పత్రికలలోపడ్డది. అందువల్ల అదికూడా ఆలోచించే, ఉపయోగము లేదు అనుకొన్నారా ? లేకపోతే తెలియకముందే అనుకొన్నారా ?

THE HON. SRI K. VENKATA RAO:—నాకు అటువంటిరిపోర్టులు రాలేదు. పత్రికలలో చదువుకొంటే పత్రికలవారిని అడిగితే వివరాలు తెలుస్తాయి.

SRI B. G. N. A. NARASINGA RAO:—అధ్యక్షా, మంత్రిగారు దేశంలో జరుగుతున్నఉత్పత్తి దేశీయ అవసరాలకు చాలు అంటున్నారు. అయితే విదేశాలనుంచి యింకా తెప్పించుకునే అవసరం ఎందుకు కలిగిందో సెలవిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO:—దానికి కారణము నరసింగరావుగారికి తెలిసిఉంటుంది అనుకొంటున్నాను. దేశంలో కొత్తపరిశ్రమలను స్థాపిస్తున్నారు అని చెప్పాను. అవి ఇప్పుడు అమల్లోఉన్నాయి. కొత్తఫ్యాక్టరీలను కడుతున్నారు. అదికనుక పూర్తిఅయితే విదేశాలనుంచి తెచ్చుకోవలసిన అవసరంఉండదని నేను చెప్పాను. ఈమధ్య నరసింగరావుగారు ఏమి labour troubles లేకుండావుంటే తప్పకుండా ఫ్యాక్టరీలు త్వరగా పనిచేస్తాయి.

*Higher Grade training school for Girijans.*

173—

*329 Q.—Sri B. RAJAYYA :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state whether there is any proposal to start a separate Higher Grade Training School for Girijans, and if so, when and where ?

The Hon. Sri G. LATCHANNA :— The Government have sanctioned opening of two Elementary Grade Training Sections one at Srungavarapukota in Visakhapatnam District and another at Bhadrachalam in East Godavari District during the current year. They will be started shortly.

విశాఖపట్టణము జిల్లాలో శృంగవరపుకోటవద్ద తూర్పు గోదావరిజిల్లాలో భద్రాచలమువద్ద, 2 ట్రెయినింగు తరగతులు స్థాపించుటకు ప్రభుత్వం తీర్మానించింది. అవి త్వరలోనే ప్రారంభించబడుతాయి.

Sri B. RAJAYYA :—ఈ schools లో admission applications తీసుకొనేవాళ్లు ఎవరు. ఇందులో ఆడపిల్లలనుకూడా తీసుకోడానికి అవకాశము వున్నదా ?

The Hon. Sri G. LATCHANNA :—D. P. I. గారియొక్క అజ్మాయిషీక్రింద ఈ training schools నడుస్తాయి. head masters admission applications దాఖలు చేసుకొంటారు. ఆడపిల్లలనుకూడా వీటిల్లో అవకాశము ఉంటుంది.

Sri T. JIYYAR DAS :—ఈలాంటి schools కు అనుబంధముగా ఒక గురుకులముఅంటూ ఒకహాస్టలును attach చేయకపోయేటట్లయితే ఇవి సరిగా పనిచేయవని ఇదివరకే మనప్రభుత్వము అంగీకరించినదికదా? అటువంటిసదుపాయము ఏమైనా యీ ప్రభుత్వము చేయదలచుకున్నదా ?

The Hon. Sri G. LATCHANNA :—అది అవసరమైతే ఆలోచిస్తుంది.

Sri G. YELLAMANDA REDDI :—2, 3 సంవత్సరాలుగా యీ higher grade training schools అన్ని ఆపివేయాలని ప్రభుత్వముఆలోచిస్తుంది కదండి. అలాంటప్పుడు ఇక్కడ స్థాపించడములో ఉద్దేశమేమో సెలవిస్తారా ?

THE HON. DR B. GOPALA REDDI :—Agency ప్రాంతాలలో కొంతకాలము ఉండాలనే అనుకుంటున్నాను. higher grade training schools agency ప్రాంతాలలో కొంతకాలము వుండాలి.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, శ్రీకాకుళం జిల్లాలో చాలామంది గిరిజనులున్నారు. అక్కడ చాలాప్రాంతాలున్నాయి. అక్కడ ఒక school పెట్టడానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI G. LATCHANNA:—ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రథమసంవత్సరములోనే 4 schools ఏర్పాటుచేయడానికి మనప్రభుత్వము ఒక ప్రతిపాదన చేసివున్నది. దానికి సుమారుగా ఒకకోటి 50 లక్షలరూపాయలు ఖర్చు అయ్యే scheme వున్నది. అది కేంద్రప్రభుత్వము వారియొక్క ఆమోదముకొరకు ప్రత్యేకంగా వ్రాయడముకూడా జరిగింది. వారి ఆమోదమువస్తే దానినిగురించి ఆలోచిస్తాము.

SRI P. ANTHONY REDDI :—యీ గిరిజనులకు higher grade training schools అన్నారు. అవి basic schools ? లేకసాధారణ training schools ?

THE HON. SRI G. LATCHANNA :—ఇప్పుడు మామూలు training schools గనే వున్నవి ప్రస్తుతము ప్రారంభింపబడుతూ వున్నవి

SRI N. K. LINGAM :— యీ training schools కంటే basic schools ఎక్కువగా ఉపయోగకరముగా వుంటాయని విజ్ఞావేత్తల అభిప్రాయాలు. అందుచేత అక్కడ basic schools startచేస్తే బాగుంటుందని ప్రభుత్వము ఆలోచిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—అవి ఉపయోగముగావుంటే తప్పకుండా ఆలోచిస్తాము.

SRI N. K. LINGAM :—అధ్యక్షా, agency ప్రాంతము వెనుకబడిన ప్రాంతమని higher grade schools పెట్టుతున్నామని ప్రధానామాత్యులు సెలవు యిచ్చారు. అటులనే మనరాష్ట్రములో వెనుకబడిన జిల్లాలున్నాయి. అక్కడ అటువంటి అవకాశమిస్తారా? higher grade training schools పెట్టడానికి ప్రభుత్వము ఏమైనా ఆలోచిస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—లేదు.

[6th December 1955

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, agency ప్రాంతాలలో కొండ జాతులకు ప్రత్యేకించి training schools పెట్టుతున్నామని అంటున్నారు. ఆ ప్రాంతాలలోవున్న హరిజనులను అందులో చేర్చడానికి అవకాశము ప్రభుత్వము కల్పిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—కొండ ప్రాంతాలలో హరిజనులుఉంటే వారిని గురించి ఆలోచిస్తాము.

*Artificial Insemination Centres.*

141--

* 23 Q.—SRI N. C. SESHADRI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) the number of Artificial Insemination Centres in the State now ; and

(b) the number of them in Anantapur district ?

THE HON. SRI B. GOPALA REDDI :

(a) 8 Artificial Insemination Centres sanctioned by the Government are functioning in the State now.

(b) Nil.

SRI N. P. CHENGALRAYA NAIDU :—అధ్యక్షా, Artificial insemination centres ఏర్పాటు చేస్తున్నారు. దానివల్ల ఏమైనా లాభముందా? అదికాక మనకు ఎన్నో కోడెలువున్నాయి. కోడెలు వుండేటపుడు అదిచేసేదితప్పని నాఅభిప్రాయము. మీరు దీనితో ఏకీభవిస్తారా ? బయటదేశాలలో కోడెలులేవు కాబట్టి ఇలాచెస్తున్నారు. మనదేశములో కోడెలుఉండేటపుడు యీ పని ఎందుకు చేయాలి ?

THE HON. SPEAKER :—Too many supplementaries.

SRI SESHADRI :—యీ artificial insemination centresలో చేసినటువంటి experiments ఎంతవరకు successful అయినాయి. దీనిని జాతీయ విస్తరణప్రణాళిక ఎక్కడైతేపెట్టినామో అక్కడంతా ప్రవేశపెట్టడానికి ప్రభుత్వమేమైనా ఆలోచిస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇప్పుడు 8 కేంద్రాలలో జరుగుతున్నది. ఇది కొంతవరకు తృప్తికరముగనే వున్నది అని డిపార్టుమెంటు

ఉద్దేశము. ఇంకా దీనిని 2nd five year plan లో విస్తరింపజేయ పూను కుంటాము. ఇటీవల మరిరెండు centers లో కూడా sanction చేసినారు. ఒకటి చిలకలూరుపేటలోను ఇంకొకటి కర్నూల్ జిల్లాలోని పాణ్యములో.

SRI N. RAMULU :—అధ్యక్షా, artificial insemination centres ఎక్కడెక్కడ open చేస్తున్నారో అక్కడ buildings కట్టడానికి non-recurring expenditure మొత్తమంతా భరించాలని అన్నారు. అలా దానిని భరించుతామని గ్రామస్థులు అంగీకరించినప్పటికీ recurring expenditure లోకూడా 50% భరించాలని నియమము విధించడము అక్రమమనిచెప్పి ప్రభుత్వము భావించడములేదా ? అలాంటి rule ఉంటే దానిని సడలించడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—అక్రమమని అనుకోను కాని యీ విషయములో ఆయా స్థలాల పరిస్థితులనుబట్టి గమనిస్తాము.

SRI V. VISWESWARA RAO:—అధ్యక్షా, 8 centres ఈ State లో వున్నాయి అన్నారు. వాటిపేర్లేమో చెప్పలేదు. ఆ ప్రాంతాలలో వాటివల్ల మంచిఫలితము వుందనిచెప్పి ప్రభుత్వము గుర్తించినదికదా. ప్రచారములో తీసుకు రావడానికి ఇంకా ఎక్కువగా యీ extension blocks లో వ్యాపింప చేయడానికి వెంటనే పూనుకుంటారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇప్పుడు యీ 8 పేర్లు కావాలన్నారు. (1) నిడుబ్రోలు (2) అమ్మనబ్రోలు (3) రాయవరం (4) మండపేట (5) నంద్యాల (6) లామ్ (7) రాజమండ్రి (8) ఇచ్ఛాపురం. ఇప్పుడు క్రొత్తగా sanction చేసింది పాణ్యంలోను చిలకలేలూరుపేటలోను ఖర్చు అయ్యేవిషయము కాబట్టి తర్వాత దానినిగురించి ఆలోచిస్తాము.

SRI B. RAMA REDDI :—అధ్యక్షా, యీ artificial insemination పశువులకు వినియోగించినందువల్ల చాలా సత్ఫలితాలు కలిగినాయని మంత్రిగారు సెలవిచ్చినారు. బిడ్డలులేక చాలమంది బాధపడుతున్నారు. కాబట్టి యీ విషయములో ఏమైనా చేయడానికి సాధ్యమౌతుందా ?

No Answer.

SRI RAJARAM :—అధ్యక్షా, మంత్రిగారు అన్నిజిల్లాలలోను centres వున్నాయి అన్నారు. అనంతపురం జిల్లాలో మాత్రము లేదన్నారు. ఎందుకు మినహాయించినారో సెలవిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—అనంతపురంలో కడప, నెల్లూరు జిల్లాలలో లేవు. ఇంకా కొన్ని జిల్లాలలో లేవు. చిత్తూరు జిల్లాలలో కూడా లేదనుకుంటాను. క్రిష్ణా జిల్లాలోనూ లేదు. యీ జిల్లాలో కూడా క్రమేణా విస్తరణ చేయడానికి ప్రయత్నిస్తున్నాము.

*Representation from the Andhra Film Chamber of Commerce.*

175—

* 316 Q.—SRI K. RAMACHANDRA RAJU.—Will the Hon. the Deputy Chief Minister be pleased to state the action taken by the Government on the representation of the Andhra Film Chamber of Commerce made to the Hon. the Chief Minister on 14th April 1955, and on the various other memoranda presented to the Hon. the Chief Minister by the said Film Chamber ?

THE HON. SRI N. SANJEEVA REDDI.—All the representations of the Film Chamber of Commerce, Vijayawada made from time to time since the formation of the Andhra State have been duly considered by the Government and orders have been passed thereon wherever necessary.

SRI N. P. CHENGALRAYA NAIDU :—మన ఆంధ్ర రాష్ట్రానికి Film Censor Board లేదు. అది. ఒకటి పెట్టేందుకు మంత్రిగారు ప్రయత్నిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు మద్రాసులో వుంది. రాష్ట్రానికంతా ఒకటి వుండినది. అక్కడనే కొందరు ఆంధ్రులుకూడా అందులో సభ్యులుగా వున్నారు. ప్రత్యేకంగా మన రాష్ట్రానికి లేదు. ఐనా ఇది మన చేతులలో లేదు. అధికారము ఢిల్లీ ప్రభుత్వం చేతిలోవుంది. మన రాష్ట్రానికి ప్రత్యేకంగా కావాలంటే వారికి వ్రాసి వారి అనుమతిపై దానిని ఏర్పాటు చేసుకోడానికి ప్రయత్నించాలి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Orders pass అయినవా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అప్పుడప్పుడు వచ్చే వాటిపైన అవునో కాదో అని orders pass చేస్తూవుంటాము. అందు కోసము ప్రతిదానిపైన ఏమి orders pass చేసినామంటే అదిచెప్పడానికి సాధ్యపడదు. ప్రశ్న ఏమిటో దానినిగురించి అడిగితే దానిపైన pass చేసిన orders కూడా చెప్పతాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—మీరేమో orders pass చేశాము, paper dispose of చేశామని చెప్పినట్లువుందిగాని ఏ రకమైన representation వచ్చాయి ? దాని స్వభావమేమిటి ? మీరు pass చేసిన orders స్వభావమేమిటి ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఎన్నో representation వస్తూవుంటాయి. వాటినన్నిటిని బుర్రలో పెట్టుకోవలంటే చాల కష్టము. ప్రతి నెలకు ఏదో ఒకటి అప్పుడప్పుడు representation వస్తూనేవుంటుంది. దానినిగురించి చర్యతీసుకుంటూనే వున్నాము. మీరు ఫలానా విషయము కావాలంటే తప్పకుండా దానినిగురించి చెప్తాను.

*Central Oil Seeds Research Institute.*

124—

*25 Q.—SRI N. C. SESHADRI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether there is any proposal to recommend to the Government of India to locate The Central Oil Seeds Research Institute, in Rayalaseema ; and

(b) if not, why ?

The Hon. SRI K. VENKATA RAO :—

(a) Yes.

(b) Does not arise.

(A) అవునండి.

(B) ఉత్పన్నముకాదండి.

SRI N. C. SESHADRI :—ఈ Central Oil Research Institute అనంతపురములో పెట్టినట్లు తెలుస్తుంది. ఐతే ఇదివరలో అక్కడ Oil Technology Institute గావున్న దానిని ఇప్పుడు మార్చినారు. ఇదివరలో మన రాష్ట్రప్రభుత్వము ఖర్చుపెట్టిన డబ్బు మనకేమైనా కేంద్ర ప్రభుత్వము తిరిగి యిస్తుందా ? అంతేకాక ఆంధ్రరాష్ట్రములోవుండే students కేమైనా special facilities provide చేస్తున్నారా ?

THE HON. SRI K. VENKATA RAO :—మనకు 3 లక్షల 25 వేల రూపాయలు వారు యివ్వబోతున్నారు — మొత్తము ఖర్చులన్నింటికి కలిపి.

మిగిలిన విషయాలు అసలు—మా యింటికి ఆవు వస్తే చల్ల ఎవరికి పోస్తామని దెబ్బలాడుకొన్నట్లున్నది. అసలు Institute పెట్టితే తర్వాత ఆంధ్రులకు ఎంత యివ్వాలో ఇంకొకరికి ఎంత యివ్వాలో చూచుకోవచ్చును.

*Grades among the Executive Officers of Panchayats.*

177—

*291 Q.—SRI P. RANGA REDDI :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) what are the grades among the Executive Officers of Panchayats in this State and the number in each grade ;

(b) the minimum qualifications required for the respective grades of Executive Officers ; and

(c) whether there are promotions for these various grades of Executive Officers and if so, the posts to which they are promoted ?

The Hon. SRI A. B. NAGESWARA RAO :—

(a) There are four grades of Executive Officers of Panchayats consisting of 33 Executive Officers in the Selection Grade, 61 in the I Grade, 61 in the II Grade and 59 in III Grade respectively.

(b) The minimum educational qualification prescribed for appointment of Executive Officers is, that a person not being a member of Schedued Castes and Backward Classes, should have completed S.S.L.C. and been declared eligible for College Courses of Study. If he is a number of a Scheduled Castes and Backward Classes he need hold completed S.S.L.C. only. He should not be more than 30 years old, if outsider, nor more than 35 years if in service under Government, Municipal Council District Board, or Panchayat. To improve tone of the service in 1952 the recruitment of Graduates to some of the posts of I Grade Executive Officers was made under the orders issued in composite Madras State Government. Following the same principle, this Government have ordered recruitment of graduates to 50 per cent of posts of Executive Offfcers of II Grade.

(c) Promotions are made from one Grade to the next higher Grade. The Executive Officers of I Grade are eligible for promotion to the posts of Deputy Panchayat Officers.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఈ Executive Officer ఉద్యోగాలు యిచ్చే సందర్భంలో Training అయినటువంటి వాళ్లకు priority list లేకుండా యిష్టంవచ్చినట్లు యిస్తున్న complaint ప్రభుత్వానికి వచ్చిందా ? వస్తే వాటిని లేకుండా చూస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Complaints యింతవరకు ఏమీరాలేదు. వస్తే తప్పకుండా ఆలోచిస్తాం.

SRI D. KANDAIAH CHOWDARY :—గుమాస్తాగా work చేసి చాలా service వున్న వాళ్లందరిని Executive Officers గా promotion చేయడానికి ప్రయత్నంచేస్తారా ? రెండోది Executive Officer కు కావలసినటువంటి applications call for చేస్తూ ఆ పద్ధతిప్రకారం పెడితే బాగుంటుంది. ఆలోచిస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Executive Officer లు కావలసినప్పుడు తప్పకుండా advertise చేస్తారు. తరువాత senior గుమాస్తాల విషయంలో reports వచ్చాయి. అదికూడా ప్రభుత్వం ఆలోచిస్తుంది.

SRI P. SUNDARAYYA :—ఈ నాలుగు grade ల Executive Officer అన్నారు. అందరికీ ఒకేరకమైన qualifications చదివారు. చదివింది ఒకేరకమైన చదువులు qualifications వున్నప్పుడు grading లో grades ఎందుకు రావలసిన అవసరంవచ్చింది

THE HON. Sri A. B. NAGESWARA RAO :—నాలుగు grade లు కూడా ఆ పంచాయతీయొక్క ఆదాయాన్నిబట్టి, క్రమేపీ promotions వస్తున్నాయి.

SRI. P. NARASIMHAPPA RAO :—ఈ appointment advertise చేస్తాంఅని చెప్పారు. అది ముందు వారి తాలూకు మనుష్యులను ఆలోచనలో పెట్టుకొని advertise చేస్తారా ? లేదా public రావాలని ఉద్దేశం మీద advertise చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—తప్పకుండా advertise చేయడం ప్రజలలోనుంచి రావాలనే. Direct recruitment

[6th December 1955

అంతే ప్రజలలోంచికాకుండా Municipal Council, Regional Inspector of Local Boards offices, Inspector of Local Boards offices యితర Government services లో వున్నటువంటివారుకూడా applications పెట్టుకోటానికి సావకాశంవున్నది.

SRI P. SUNDARAYYA :—ఒకే qualifications వాళ్ళను డబ్బునుబట్టి వేరువేరు grades లో వాళ్లను పంచాయతీలలో వేసేబదులు ఈ పంచాయతీ అధ్యక్షులకే యీ అధికారాలుయిచ్చి Executive Officer గా పని యివ్వడం మరింత ప్రజాస్వామికంగా ఉంటుందికదా ?

The Hon. SRI A. B. NAGESWARA RAO :—ప్రస్తుతంవున్న చట్టాన్నిబట్టి రెండు తరగతులున్నాయి. Class 1, Class 2, అని ఆ పంచాయతీయొక్క ఆదాయమునుబట్టి వున్నాయి. Class 1 కే Executive Officers ఉంటారు. Class 2 లో అధ్యక్షులకే సర్వాధికారాలున్నాయి.

SRI S. NARAYANAPPA :—ఈ Executive Officer గా రాష్ట్రం మొత్తంపైన కొంతమందిని select చేశారు. ఆ list కూడా వున్నది. వారిలో ఎంతమందికి appointments యిచ్చినారు ? ఎంతమంది యింకా List లో వున్నారు ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఇదివరకు ఇదే ప్రశ్న వేశారు. ఆరోజున వారులేరు. ఆ రోజునే సమాధానం చెప్పాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అసలు కొత్తగా recruitment కాకుండా seniority list ఏదన్నావుంచి దానిప్రకారం గా వరుసగా ఎప్పుడవసరమవుతుందో ఆవిధంగా వేస్తారా ? లేకపోతే ఎప్పుడు ఏ ఊరికి కావాలో ఆ ఊరికి సంబంధించినచోట మనుష్యులను వేస్తారా ? Seniority list ప్రకారంగా వేయడానికి ప్రయత్నంచేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఇదివరకు training యిచ్చినవారు సుమారు 30 మందిదాకా వున్నారు అని మనవిచేస్తున్నాను. వారు absorb అయిన తరువాతగాని మళ్లా తిరిగి advertise చేయడం జరుగదు.

SRI D. KONDAIAH CHOWDARY :—Class 1 పంచాయతీ Officers వున్నారు. Class 2 వేరు అన్నారు. కాని కొన్ని class 2 పంచాయతీలను కలిపి club చేసి వాళ్ళకుకూడా Executive Officer లను appoint చేయాలని ఒక scheme వున్నది. త్వరగా అమలు పెట్టేలాగ చూస్తారా ?

6th December 1955]

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అదికూడా ప్రభుత్వం వారి ఆలోచనలో ఉన్నది.

SRI N. K. LINGAM :—అధ్యక్షా, 4 grade లు Executive Officer లను చెప్పారు. ఆరకంగా డబ్బు తక్కువ వున్నది కనుక grade లు తక్కువ వేశామని చెప్పారు. అట్లాకాకుండా firka వారిగా ఒక firka ఒక unit గా తీసుకొని రెండు grade లే పెట్టి ఆరకంగా Executive Officer లను ఏమయినా ఏర్పాటు చేయడానికి ఆలోచిస్తుందా ?

(No answer)

*Introduction of the pension system for Elementary School Teachers*

146—

*45 Q.—SRI P. SUNDARAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state whether the Government propose to introduce the pension system for Elementary School Teachers ?

The Hon. DR. B. GOPALA REDDI :—The Government have a proposal under consideration.

SRI P. SUNDARAYYA :—ఎన్నిరోజులనుంచి consideration లో వుంది ? వివరాలు తెలియజేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఇటీవలనే consideration లో వున్నది. Madras Government చేసినారని తెలుసును. వారి దగ్గరనుంచి వివరాలు తెప్పించి పరీక్షచేయాలని ఉద్దేశము.

SRI P. SUNDARAYYA :—వచ్చే academic year నుంచి అయినా financial year నుంచి అయినా ఆరంభించేదానికి ప్రభుత్వం పూర్తి చేస్తుందా ?

THE HON. Dr. B. GOPAL REDDI :—Provided finances permit.

SRI P. SUNDARAYYA :—అంటే అర్థంఏమిటంటే యీ ఆలోచనకు అర్థం లేదనేకదా ? ఏ విషయంమీదకూడా finance లేదని ఒక ప్రక్క చెబుతూ యీ pension scheme కూడా డబ్బుంటేనే చేస్తాం అంటే అమలుపరచనే కదా దాని అర్థం.

THE HON. DR. B. GOPAL REDDI :—ఆలోచిస్తాం అన్నప్పుడు అన్నీ ఆలోచిస్తున్నాం. Financial గా ఎంత ఖర్చవుతుందో లెఖ్ఖలు తీసుకు చేసుకోవాలి. అవసరమైతే యీ సంవత్సరం పెట్టలేక పోవచ్చు, లేకుంటే పెట్టవచ్చు. ఆర్థిక పరిస్థితినిబట్టి వుంటుంది. ఆనాటి ఆర్థిక వ్యవస్థనుబట్టి వుంటుంది.

SRI P. SUNDARAYYA :—గవర్నమెంటు స్కూల్సులో వున్నటువంటి Elementary Schools మాత్రమేనా లేక aided teachers కు కూడా వర్తింప జేస్తారా ?

THE HON. DR. B. GOPAL REDDI :—Aided Schools కు కూడా.

*Power-loom Factories.*

130—

* 27 Q.—SRI N. C. SESHADRI : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether any representations were made recently to this Government by owners of power-loom factories, regarding the removal of cess levied on cloth ; and

(b) if so, the action taken thereon ?

The Hon. SRI K. VENKATA RAO :—

(a) A representation has been received from Sri Jayaramachandrappa Setty Mills, Raydrug (Anantapur District).

(b) The matter is under consideration.

రాయదుర్గం కాపరస్తులు శ్రీ జయరామచంద్రప్ప సెట్టి అనేవారు ఒక ధరఖాస్తు పంపించారు.

(b) దీని క్రింద విచారణ జరిగింది.

SRI N. C. SESHADRI :—వారిచ్చిన representation పై మీరు కేంద్ర ప్రభుత్వానికి ఏ సిఫార్సులు చేసినారో శలవిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—కేంద్ర ప్రభుత్వానికి ఉత్తరం వ్రాశాంగాని అవన్నీ ప్రస్తుతం చెప్పడానికి వీలులేదు.

6th December 1955]

*Prohibition of Slaughter of cows.*

151—

* 49 Q.—SRI P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state whether the Government have taken any steps to implement the provisions of Article 48 of the Constitution of India for prohibiting slaughter of cows, calves and draught cattle ?

THE HON. SRI B. GOPALA REDDI :—The question of enacting legislation for prohibition of slaughter of cows and she-buffaloes (including female calves) has been examined by Government and it has been deferred for the present.

SRI P. SREERAMULU :—అసలు ఆవునే కాదండీ దీనిచే, ఏ జనాన్నికూడా హింసచేయరాదని ప్రభుత్వం ఉత్తరువు యివ్వడానికి సాధ్యమవుతుందేమో ఆలోచిస్తారా ?

Mr. SPEAKER :—Impossible.

THE HON. Dr. B. GOPALA REDDI :—అంటే మేకను, పొట్టేలును, కోళ్లను, అవన్నినా ? చేయడానికి వీలులేదు.

SRI T. G. THIMMAIAH SETTY :—U. P. Government cow slaughter ban చేసిన విషయం ప్రభుత్వానికి తెలుసునా ? తెలిస్తే మన ప్రభుత్వం ఏల చేయరాదు ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఏ గవర్నమెంటులో ఎక్కడెక్కడే మేమి చేస్తారో మాకు తెలుసును. అవన్నికూడా ఆలోచించి ప్రస్తుతం కాదని చెప్పి అనుకున్నాం.

SRI D. RAMABRAHMAM :—మన సరిహద్దులో వున్నటువంటి మైసూరు రాష్ట్రంలో cow slaughter ban చేసినారు. మన సరిహద్దులనుంచి విశేషంగా cow ను slaughter చేసి అక్కడనుంచి beafను export చేస్తున్నారు. దానిని ban చేయడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఇది కొంచెం పరిశీలన చేయవలసిన విషయంగా వున్నది. ఎంతమంది దీంట్లో పశువులను చంపుతున్నారో కొంత గమనించవలసిన విషయంగా వున్నది. గమనిస్తాం.

[6th December 1955

*Development of Industries*

127—

*108 Q.—Sri S. VEMAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state·

(a) whether there are proposals for the development of the following industries (1) Rajahmundry Paper Mills (2) Ceramic Factory at Gudur and (3) Card Board Factory at Tirupati ; and

(b) if so, what is the amount allotted to each ?

The Hon. Sri K. VENKATA RAO :

(a) Yes, Sir.

(b) The following are the amounts proposed to be allotted under the Second Five Year Plan for each of the three schemes.

1. The Andhra Paper Mills, Rajahmundry Rs. 175 lakhs
2. The Government Ceramic Factory Gudur. Rs. 18·96 lakhs.
3. Sri Venkateswara Paper and Straw Board Mills Tirupati Rs. 44 55 lakhs

(a) అవునండి.

(b) ఈ దిగువ మొత్తాలు రెండోవ పంచవర్ష ప్రణాళికలో వినియోగించడానికి నిర్ణయించబడినది.

(1) Andhra Paper Mills, Rajahmundry—175 లక్షలు.

(2) Government Ceramic Factory, Gudur:—18 లక్షలు 96 వేలు.

(3) Venkateswara Paper & Straw Board Mills, Tirupathi—4 లక్షల 55 వేలు.

Sri B. APPA RAO :—అధ్యక్షా, ఈ Paper Mills లో ఉద్యోగుల యొక్క services regularise చేయలేదు. 8 సంవత్సరాలనుంచి increments లేవు. అటువంటప్పుడు యీ development ఎలా జరుగుతుందో ప్రభుత్వం తెలవిస్తారా ?

6th December 1955]

THE HON. SRI K. VENKATA RAO :—నాకు తెలియదుగాని యిదివరకు నష్టంగా వున్నటువంటి యీ Paper Mill ప్రస్తుతం లాభంలోకి దిగింది. ఇక ముందు ఖర్చుపెట్టబోయే రూపాయలవలన యింకా ఎక్కువ లాభం కలుగుతుందని అనుకుంటున్నాను.

*Funds allotted to small-scale industries.*

138—

* 131 Q.—SRI A. SATYANARAYANA MOORTHY : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether it is a fact that the Government have decided to open several industries including small-scale industries in many districts and that funds were also allotted for those industries ; and

(b) if so, the centre selected in the West Godavari district and the industries proposed ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Yes Sir.

(b) :—

| *Centre.* | | *Industry proposed.* |
|---|---|---|
| Eluru | ... | Production-cum-training Centre in Blacksmith. |
| Eluru | ... | Production-cum-training Centre in Carpentary. |
| Tadepalligudem | | General purpose work-shop. |

(a) అవునండి.

(b) ఏలూరులో Production-cum-Training Centre—Black smithy (కమ్మరి)

ఏలూరులో production-cum-centre—Carpentry (వడ్రంగం)

తాడేపల్లి గూడెంలో General purposes work shop.

SRI T. JIYYAR DAS:—అధ్యక్షా, చర్మ కారకం ఈ small scale industries క్రింద వస్తుందండీ?

THE HON. SRI KALA VENKATA RAO :—ఉన్నటువంటి పెట్టుబడిని బట్టి ఉంటుంది, Small scale Industries లో రావచ్చును. Cottege Industries లో కూడ రావచ్చును.

Sri M. NAGESWARA RAO :—అధ్యక్షా, మన ఆంధ్రసముద్ర ప్రాంతంలో Shark చేప విరివిగా దొరుకుతుంది. ఈ Shark liver oil industry ని మచిలీపట్టణంలో ఏర్పాటుచేయడానికి ప్రభుత్వానికి ఏమైనా ఉద్దేశం ఉందా ?

THE HON. SRI K. VENKATA RAO :—అలాంటి Proposal ఏమీలేదు.

SRI N. SREENIVASA RAO :—West Godavariలో cement works industries ని గురించి Loans అడుగుతూ తమకు Applications పెట్టారు. ఏమైనా సహాయంచేస్తారా ?

MR. SPEAKER :—రెండవ question అడగండి. ఇది opening of industries.

*Loans under State-aid to Industries Act from 1st April 1953 to 31st March 1955.*

139—

* 152 Q.—SRI M. RAJESWARA RAO :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) the amount of the loans granted to industries under the State-aid to Industries Act by the Government during the period from 1st April 1953 to 31st March 1955 ; and

(b) The names of these industries and the amount granted to each of them ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The amount of loans granted to Industries under the State Aid to Industries Act by the Government during the period from 1—4—1953 to 30—3—1955 is Rs. 1,20,500.

(b) The following are the Industrial undertakings and the amount granted :—

| Name of the Industry. | Amount of loan granted in Rs. |
|---|---|
| 1. Sri V. Thimmaiah Clay works Agraharam Madanapalle Taluk, Chittoor District. | 4,000 |
| 2. Sri The Bezwada Metal and Steel Industries Ltd., Vijayawada. | 37,500 |
| 3. Sri Choday Apparao Engineering Works Kakinada. | 48,000 |
| 4. Sri V. Ramakrishnamurthy, Proprietor Sri Gouri Automobile and Engineering works Anantapur. | 31,000 |

(a) ఇంతవరకు State aid to industries act క్రింద గవర్నమెంటువారు 120500 రూపాయలు అప్పుక్రింద ఇచ్చారు.

(b) అప్పులు ఇవ్వబడినటువంటి సంస్థలు ఇవి.

| | Rs. |
|---|---|
| (1) Thimmayya clay works agraharam Madanapalle taluk, Chittoor district ... | 4,000 |
| (2) Bezwada metal and steel Industries Ltd., Bezwada ... | 37,500 |
| (3) Chode Appa Rao Engineering Works Kakinada ... | 48,000 |
| (4) V. Ramakrishna Murthi, Proprietor Sri Gowri Auto Mobile Engineering Works, Anantapur ... | 31,000 |

SRI N. SREENVASA RAO :—West godavari జిల్లానుంచి Cement industries నుంచి, Penukonda నుంచి, తర్వాత ఏలూరులో క్రిష్ణా Pipeinstitute నుండి తమకు Applications పెట్టారు వాటికి ఏమైనా సహాయం చేస్తారా?

6th December 1955]

*State-aid to Industries Act.*

140—

*303 Q.—Sri S. R. Y. SIVARAMA PRASAD : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state ·

(a) the total amount of loans granted to industries under the State-aid to Industries Act which are outstanding on 31st March 1955 ; and

(b) the names of the Industries from which the loans are due and the amounts due ?

THE HON. SRI K. VENKATA RAO .—

(a) Rs. 36,16,103-2-0.

(b) A statement * furnishing the information is placed on the table of the House.

అవి రెండూ పరిశ్రమలు అనిపించుకోవు.

(a) Rs 36, 16102-2-0.

(b) మిగిలిన విషయాలన్ని టేబిలుమీద పెట్టబడినవి.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, 36 లక్షలకుపైగా మార్చి 30 వ తేదినాటికి రావలెనని మంత్రిగారు చెప్పారు. వసూలు చేయడానికి చర్యలు ఏమైనా తీసుకొన్నారా ?

THE HON. SRI K. VENKATA RAO :—చర్య తీసుకొంటూ ఉన్నారు.

SRI P. SUNDARAYYA :—ఈ కంపెనీలు అన్ని పనిచేస్తున్నాయా ? లేకుంటే కొన్ని మూసివేసిన కంపెనీలు ఉన్నాయా ?

THE HON. SRI VENKATA RAO :—మూసివేసిన కంపెనీలు కొన్ని ఉన్నాయండీ.

SRI P. SUNDARAYYA :—అవి ఏవో చెప్పుతారా ?

THE HON. Sri K. VENKATA RAO :—Time ఇస్తే చెప్పుతాను. నాకేమి అభ్యంతరం లేదు.

---

*Vide Appendix at page 634-635 infra.

6th December 1955]

MR. SPEAKER :—There is no time.

THE HON. SRI K. VENKATA RAO :—వసూలుచేస్తున్నామని చెప్పాను. ఇప్పుడు తిరుపతిలో వెంకటేశ్వర Paper and straw board mills Ltd కి రెండులక్షల 50 వేల రూపాయలు ఇచ్చారు. ఆ మిల్లు మూసివేశారు. 2,50,000 రూపాయలకి High Court decree ఉంది. సామానుఅంతా వశపరచుకొన్నాం. మనం ఇప్పుడు వేరే Straw board factory పెట్టేటటువంటి ఏర్పాటులో ఉన్నాము.

Mohan industries Ltd. Tenali విషయం కోర్టులో వ్యవహారం జరుగుతుంది.

Radhakrishna vegetable oil factory Ltd,. Pamidi. Anantapur district, సమంగా డబ్బుఇస్తున్నారు.

Vegetols Ltd,. Chittoor, వారికి extension ఇవ్వబడింది. మిగిలినటువంటి Loan recover చేయడానికి కలెక్టరు చర్యతీసుకొంటూ ఉన్నాడు.

K. V. Brahmam and sons, Fountain pen manufacturers, Bhimavaram వారేమో 5th ఇచ్చారు. అది 1-7-55 న మాత్రం ఇవ్వవలసియున్నది.

Sri P. SUNDARAYYA :—ఆ వివరాన్ని చెప్పమంటున్నాను.

Mr. SPEAKER :—Refer to the institutions.

THE HON. SRI K. VENKATA RAO :—లిస్టులు విడదీసి ఎక్కడ చెప్పేను నేను ? మీరు లిస్టు అయినా వినాలి. లేకపోయినట్లయితే నాకు time అన్నా ఇవ్వాలి. ఏదైనా ఫలానా firm అని. వారి దగ్గర లిస్టు ఉందండీ, వారు అడిగితే దానినిగురించి చెపుతానండి. అలా ప్రశ్నిస్తే ఇచ్చే ఉందును.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, అందులో Bezwada Metal and steel industries Limited, వాండ్లకు 37,500 ఇచ్చామని ఉంది. ఈ సంవత్సరముకూడా మళ్లావారికే ఇచ్చినట్లుగా మంత్రిగారు చదివారు వారి దగ్గరనుంచి రావలసింది ఉండగా ఎందుకు మళ్లా ఇచ్చారు ?

THE HON. SRI K. VENKATA RAO:—నేను వెళ్ళి చూచానుకూడా. ఈ industries ఆంధ్ర దేశంలో బాగా పనిచేసే సంస్థలలో ఒకటి. దానిని అభివృద్ధి చేయమనికూడా అంటున్నాము. మొన్న ఇచ్చిన loan 29—3—55 న

ఇవ్వడం జరిగింది. కొత్త కొత్త machinery పెట్టుతున్నారు అక్కడ. ఇంకా కొత్తవి పెట్టవలసిన అవసరంకూడా ఉంది. కొంచెం విశ్వేశ్వరరావుగారు తోడ్పడితే ఇంకా దానికి అసలు ప్రసాదికరమైనటువంటి విషయాలు అక్కడ పెట్టడానికి వీలు కలుగుతుంది.

*Reserved Forest Area in Nellore district.*

155—

* 50 Q.—Sri P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. Chief Minister be pleased to state :

(a) the area of land in the reserved forest in Nellore district ;

(b) the area of land of unreserved forest under the control of Revenue Department ; and

(c) whether the Government have spent any amount in improving the unreserved forest in 1954—55 ?

The Hon. Sri B. GOPALA REDDI :—

(a) The total extent of Reserved Forests in Nellore District is 4,66,111·74 acres. Besides this, an extent of 4,08,100·41 acres of Estate Forests in Nellore North and South Divisions has been taken over by the Forest Department under the Estates (abolition and Conversion in Ryotwari) Act 1948.

(b) 4,07,536 acres.

(c) No, Sir.

Sri N. C. SESHADRI :—అధ్యక్షా, ఈ రివిన్యూ డిపార్టుమెంటు క్రింద ఉన్న unreserved forests లు ఏ పరిస్థితులలో ఇపుడు forests department కు transfer చేసుకుంటారు ?

The Hon. Dr. B. GOPALA REDDI :—బాగా అక్కడ చెట్లు, సమృద్ధిగా వేయడానికి వీలుగ ఉండే పరిస్థితులలో.

*Water scarcity in Kurnool town.*

144–

* 44 Q.—SRI M. MAHABOOB ALI KHAN :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether the Government are aware of the water scarcity in Kurnool City, though sufficient water sources are available ; and

(b) if so, whether the Government propose to sanction 500 public taps and 500 taps to houses ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) and (b) Three hundred and fifty House service connection have been sanctioned. The Question of sanctioning public fountains is under consideration.

(a) 350

(b) House service connections ఇదివరకే sanction చేశారు. ఇంకా ఎక్కువగ ఇచ్చేది, public fountains కు ఇచ్చేది గవర్నమెంటు ఆలోచిస్తుంది.

SRI P. SUNDARAYYA :—350 ఇచ్చినదానికోసం ప్రత్యేకంగా contribution ప్రభుత్వం ఏమైనా తీసుకొన్నదా ?

THE HON. SRI K. VENKATA RAO :—అదివేరు. ప్రభుత్వానికి ఏమీ సంబంధం లేదు. ప్రభుత్వానికేమో ఎవరు చందా ఇవ్వరు. మునిసిపల్ కౌన్సిలుకు ఏమన్నా ఇచ్చారో లేదో ? ప్రత్యేకంగా ప్రశ్నవేస్తే చెప్పుతాను.

*Medical College, Visakhapatnam.*

166—

* 320 Q.—SRI P. GUNNAYYA :—Will the Hon. Minister for Planning and Industries be pleased to state :

(a) the number of students in the Medical College. Visakhapatnam ; and

(b) the number of students belonging to Scheduled Tribes and Harijans ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) 589.

(b) Harijans Scheduled Tribes.
43 7

(a) 539

(b) అందులో హరిజనులు 43.
Scheduled tribes 7.

SRI P. GUNNAYYA :—ఇంకా చాలామంది హరిజనులు డాక్టర్లుగ చేరడానికి ప్రభుత్వంవారు అవకాశం కల్పిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పటికే పనులు ఇవ్వ లేకుండా ఉన్నాం. ఇంతమందికి, 100 కి 20, 25 మంది హరిజనులను పెట్టుకోవలె నసేటటువంటి నిర్ణయం ఉంది. ఇంతకంటే ఎక్కువ చదువుకొనే వాండ్లు దొరకరు.

*Insufficiency of beds in the King George Hospital Visakhapatnam.*

179—

* Q 323 P. GUNNAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether the Government are aware of the insufficiency of beds in King George Hospital, Visakhapatnam ;

(b) if so, whether the Government proposed to increase the bed strength ; and

(c) the amount spent on patients in that hospital from March 1953 to March 1954 and the income from them ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The number of in-patients treated in the K.G. Hospital, Visakhapatnam is not doubt, in excess of the sanctioned bed strength of the Hospital.

(b) During 1955—56, the bed strength of the Hospital has been increased from 776 to 876 i.e. by 80 beds.

(c) The expenditure incurred on the maintenance of the patients is Rs. 13,84,251 while the income derived from them is Rs. 82,824.

(a) విశాఖపట్టణంలో K. G. Hospital లో ఉన్నటువంటి రోగులు, వాండ్లకు sanction అయిన మొత్తంకంటె ఎక్కువమంది.

(b) Hospital లో 55-56 లో ఉన్న మంచాల సంఖ్య, 796 నుంచి 876 కు అనగా 80 ఎక్కువగా పెంచబడింది. ఇంకా ఎక్కువగా పెంచబడింది. ఇంకా ఎక్కువచేసే విషయం ప్రభుత్వంయొక్క విచారణలో ఉంది. గత సంవత్సరంలో 13,84,250 రూపాయలు ఖర్చు పెట్టబడింది. 82,324 రూపాయలు ఆదాయం వచ్చింది.

SRI P. GUNNAYYA :—Bed strength హెచ్చు చేస్తామని మంత్రి గారు సెలవు ఇచ్చారు. ప్రతిరోజు వంద 2 వందల మంది patients K. G. Hospital లో చేరడానికి వెళ్లుతూ ఉన్నారు. హెచ్చు చేయడం అనేది ఎన్ని రోజులకుచేస్తారని మంత్రిగారిని అడుగుతూ ఉన్నాను.

MR. SPEAKER :—హెచ్చు చేశారండి 80 చిల్లర.

THE HON SRI K. VENKATA RAO :—హెచ్చు చేయడానికి నేను ఆలోచిస్తున్నానని చెప్పాను. ఒక్కొక్క మంచం పెట్టడానికి కొన్ని వేల రూపాయలు కావాలి. అందుచేత నిమ్మళంగా చేయవలసిన పనిగాని తొందరపడే విషయంకాదు.

II. Point of information re —

Re-organisation of new Mysore State.

SRI N. C. SESHADRI :—30వ తారీఖు పేపర్లలో మైసూరు ముఖ్య మంత్రి, హనుమంతయ్యగారు, మైసూరు assembly లో ఒక ప్రకటన చేసినట్లు చూచాము. దానిని మన ముఖ్య మంత్రిగారి benefit కు గాను చదివి వినిపిస్తున్నాను. అందులో

"MR. K. HANUMANTHAYYA, Chief Minister of Mysore told the Legislative Assembly today that no district in the present Mysore State would be broken while forming a new Mysore State. He came to this conclusion following a clarification he had received from a important member of Congress High Power Committee."

అని ఉంది. ఈ సందర్భంలో బళ్ళారి విషయంగురించి శాసనసభలో చర్చించాము. ప్రభుత్వం తరఫున ఒక resolution pass చేశాం. ఈ సందర్భంలో 25 26 తేదీలలో మన చర్చ ముగియలేదు, అంతలోపలనే ఈ clarification రావలెనంటే ఈ సభలో ఉండేటటువంటి సభ్యుల అభిప్రాయానికే ఒక భంగం ఏర్పడుతుందని

నేను భావిస్తున్నాను. ఈ విషయంలో ముఖ్య మంత్రిగారు కొంత clarify చేయా లని కోరుతున్నాను కోరేదికాకుండా కేంద్ర ప్రభుత్వానికి

MR. SPEAKER :—You are making a speech.

SRI N. C. SESHADRI :—కాబట్టి ఈ statement మాకు ఇక్కడ ఉండే ఆంధ్రులందరికీకూడ ఆందోళన కలుగచేస్తోంది. కాబట్టి ఈ ఆందోళనకు ఏమి కారణంలేదు అనేట్టు ముఖ్యమంత్రిగారు కేంద్ర ప్రభుత్వాన్ని contact చేస్తామని ఒక హామీ ఇవ్వవలసినదిగ కోరుతున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI:—మాకింతవరకు అటువంటి communication ఎవరిదగ్గరనుంచి ఏమీ రాలేదు బహుశా మనం చేసినటువంటి తీర్మానానికి గౌరవం ఢిల్లీలోకూడ ఇస్తారని ఆశిస్తున్నాం. తరువాత ఈ సందర్భంలో బళ్ళారి విషయమై S. R. C. Report కు వ్యతిరేకంగా చేయరనికూడా మేము ఆశిస్తున్నాం. ఏమైనా ఉంటే తప్పకుండా ప్రభుత్వంవారు ప్రధాన మంత్రి వచ్చినపుడుగాని తరువాతగాని ముందుగాని ఏదైనా చెయ్యాల్సి ఉంటే చేయడానికి ప్రయత్నం చేస్తాను.

## III. ADJOURNMENT MOTION Re :—

Damage to paddy crop due to heavy rains, floods of Collair lake and overflow of Upputeru.

MR. SPEAKER :—I have received an adjournment motion from Sri K. Appa Rao to the following effect :—

"This House stands adjourned to discuss a matter of grave importance arising out of the submersion in thigh deep and now in knee deep water, of Akkullu and other varieties of paddy crop, ripe for harvest on 15th November and consequent damage and serious and heavy loss being incurred by thousands of ryots in several low-lying lands of Collair lake region, and Kaikalur Taluk due to recent heavy rains, floods of Collair lake and overflow of Upputeru river and its drains."

I do not think that this is a new situation for people living in the Kollair region. I do not think it is so important and so urgent for discussion. I rule it out.

6th December 1955]

## IV. ANNOUNCEMENT Re:

1. Election of a Member to the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway.

MR. SPEAKER :—I have to announce to the House that Sri P. Thimma Reddy is the only candidate validly nominated to fill a seat in the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway. As the number of candidates validly nominated is equal to the number of vacancies to be filled, namely, one, I hereby declare him to have been duly elected to be a Member of the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway.

2. Election of a Member to the Zonal Railway Users' Consultative Committee of the South Eastern Railway.

Mr. SPEAKER .—I have to announce to the House that Sri K. Punniah is the only candidate validly nominated to fill a seat in the Zonal Railway Users' Consultative Committee of the South Eastern Railway. As the number of candidates validly nominated is equal to the number of vacancies to be filled, namely, one, I hereby declare him to have been duly elected to be a Member of the Zonal Railway Users' Consultative Committee of the South Eastern Railway.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, Andhra Public Service Commission వారి రిపోర్టుపై చర్చవచ్చే సమావేశంలోనైనా ఏర్పాటు చేయడానికి అవకాశం కల్గిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI:—ఆ విషయమై ఆలోచిస్తాను.

## V. *MASSAGE FROM THE GOVERNOR.*

MR. SPEAKER :—I have to announce to the House that the following message dated the 1st December, 1955 has been received from the Governor of Andhra :

"In pursuance of Article 207 clause (1) of the Constitution of India, I, C. M. Trivedi, Governor of Andhra, hereby recommend to the Andhra Legislative Assembly, the introduction of the Madras Village Panchayats (Andhra Second Amendment) Bill, 1955."

ఇటువంటి ప్రధానసమస్య ఉన్నది. ఇంకొక ప్రక్క ఉన్నటువంటి శివారు కలిసి ఉన్నది.

స్పష్టంగా చూస్తే ఈ ఊరిలో కూడ అటువంటి ప్రధానసమస్య ఉన్నది. ఈ ఊరు ఇంకొక ప్రక్క ఊరు సివారుఅనేది కలిసిఉంది. ఒక రోడ్డుప్రక్కన ఆ ఊరు ఉన్నది. ఇంకొక రోడ్డుప్రక్కన ఈ ఊరుఉన్నది. ఆ ఊర్లో 13, 14 సంవత్సరముల క్రింద పంచాయితీబోర్డు ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలు జరిగినప్పుడు గాని, అంతకు క్రితము అనేక సంవత్సరములనుంచిగాని ఈ సివారుకు ఆ గ్రామానికి కలిసి ఒకేపంచాయితీబోర్డు ప్రభుత్వము గుర్తించి, సివారుగ్రామ రైతులకు ఉన్నటువంటి పొలాలమీద వచ్చేటటువంటి Revenue cess కూడ వేరుచేసి ఈ గ్రామంలో కలపడంఅనేది జరిగింది. ఒక పెద్ద చర్య తీసుకొన్నారు. అదిద్వారా ఆ గ్రామంలో ఉన్నటువంటి ప్రజలు వాళ్ళకు వచ్చేటటువంటి ఆదాయము దాని మీద వచ్చేటటువంటి Cess లు అవన్నీకూడ ఈ తలప్రోలుగ్రామ పంచాయితీబోర్డుతో కలపడం జరిగింది. కాని ఈనాడు ఒక చిన్న అభ్యంతరంద్వారా అది Revenue village కాదనిచెప్పి వొల్లారుకు వచ్చేటప్పటికి దాన్ని వేరుచేయాలని తీర్పు చెప్పుతున్నారు. దాన్ని వేరుచేసి దానికి వేరేపంచాయితీబోర్డు ఏర్పాటు చేయవలెనని చెబుతున్నారు. అంటే, ఈ exclude అని చెప్పేది, include అని చెప్పేది, తమకొరకు తమకు అవసరంవచ్చినచోట ఒక గ్రామాన్ని రెండుగా చేయడానికి ఇంక, అంతకన్న ఎక్కువ చేయడానికి చేసినటువంటి ప్రయత్నము తప్ప అంతకన్న వేరు ఏమికాదు. ఒకప్రక్కన ప్రజలు తమయొక్క పరిపాలన తామే సాగించుకోవాలి. పరిపాలనఅంతా వికేంద్రమంచేసి ప్రజలకు ఎక్కువ స్వాతంత్ర్యం ఇవ్వాలి అంటూ గ్రామపరిపాలన స్వాష్టంగా నిలబడాలిఅని చెప్పుతూ Welfare State అనే పదాలు వినియోగించుకొంటూఉంటే, మనం వీటన్నింటిని కూడ మరచిపోయి ప్రజలయొక్క ఇష్టానికి వ్యతిరేకంగా వాటిని majority అని, minority అని, majority ని minority చేయాలని, minority ని majority చేయాలని, గ్రామ గ్రామాలను include చేయడానికో లేక exclude చేయడానికో ప్రయత్నచేయడం అనేదిచూస్తే ఈ బిల్లులో, ఏ మాత్రము ఈనాడు ఉన్నటువంటి పరిస్థితులకు అనుగుణంగా, ఆ చరణలో కాకపోయినా, కనీసం మనం చెప్పుకొనేటటువంటి మాటలకైనా అనుగుణంగా లేకుండా. ఏదో పాతకాలము నాటి పద్ధతిని పట్టుకొని పరిపాలన అంతాకూడ పూర్తిగా స్తంభింపచేసేటటువంటి స్థితికి ఈ బిల్లు తీసుకురావడంతప్ప అంతకన్నా వేరే ప్రయోజనమేమి కనపడలేదు. అదేవిధంగా ప్రశిడెంటు విషయం చూచుకోండి. ఇదివరకు గ్రామ జనాభాఅంతా కూడ, గ్రామాలలో ఉన్నటువంటి వోటర్లు అందరుకూడ ఎన్నుకోవాలి, అదే సరై

నటువంటిదని చెప్పడం జరిగింది. కాని ఈనాడు ఎందుకో అది చేయకుండా Members మాత్రము ఎన్నుకోవాలి అనేది ప్రవేశపెడుతున్నారు. ఆనాడు కూడ ఈ బిల్లు ప్రవేశపెట్టినటువంటి చంద్రమౌళిగారుకూడ ఉన్నారు. వారు ఆనాడు ప్రెశిడెంటును గ్రామస్థులంతా ఎన్నుకోవాలి, గ్రామస్థులంతా తమయొక్క విశ్వాసాన్ని ప్రెశిడెంటుమీద చూపించాలి, అతనే ప్రజలయొక్క విశ్వాసానికి అనుగుణంగా పనిచేయడానికి వీలుంటుంది. కాని పంచాయతీబోర్డు మెంబరు ఎన్నుకోవడంఅంటే, ఈ మెంబర్లు అయిదారుమందిఉంటే, అందులో ముగ్గురినో నలుగురినో ఏదో విధంగాతిప్పేస్తే, ప్రెశిడెంటును ఎవరుపడితే వాళ్లు ఎన్నుకోవచ్చును. కాబట్టి ప్రెశిడెంటును పంచాయితీబోర్డులు కాదు, గ్రామస్థులే ఎన్నుకోవాలి. అతను బోర్డుకు బాధ్యత వహించవలసినటువంటి అవసరమున్నది అని చెప్పారు. వారే ఈనాడుకూడ మంత్రి మండలిలో ఒక సభ్యులుగా ఉన్నారు. అటువంటప్పుడు, ఎందుకని వారు తమ మాటలమీద తమకే విశ్వాసంలేకుండా తిరిగి ఆ బిల్లును ఈ వేళ మార్చాలని తీసుకువస్తున్నారో అర్థం కావడంలేదు. ఈ మధ్యన అనేక గ్రామాలలో పంచాయితీబోర్డులు ఏర్పాటుచేస్తామని Blocks అనేవి ఏర్పాటు చేశారు. ముందున్న Wards పోయి, ఇప్పుడు Blocks అనేవి వచ్చాయి. నేను ఈ మధ్యన Gazette తిరుగవేస్తూ ఈ Blocks ఏవిధంగా ఏర్పాటుచేశారో కొన్ని చూశాను. ఒకచోట వ్యవసాయికూలీపల్లిని, సగము గ్రామంతోకలిపి ఒకే Ward గా చేసిపారేశారు. దానిఫలితంగా, ఆ వ్యవసాయకూలిపల్లిలో ఉన్న వారికి తమ అభ్యర్థిని పంచాయితీబోర్డుకు పంపుకోనేటటువంటి హక్కు తీసిపారేశారన్నమాట. ఆ వ్యవసాయకూలి పల్లెకు సంబంధించినటువంటి వారిని ఒకరిని ఎన్నుకోనేందుకు వారికి అవకాశమున్నప్పటికిని, అటువంటిది కలుగడానికి వీలు లేకుండా, దానిని తీసుకువచ్చి గ్రామంలో కలిపివేసి ఒకే Block అనడం, ఆ Block లో ఏ ముగ్గురు సభ్యులు ఎన్నుకోవడంఅంటే, ఆ గ్రామంలోని పెత్తనం దారులు పై కులస్థులు ఎవరు కావలెనని నిర్ణయిస్తేవాళ్ళనే ఎన్నుకోడానికి అవకాశం కలుగజేయడంతప్ప అంతకన్నా ఏమికాదు. అదేవిధంగా గ్రామాన్ని రెండు, మూడు భాగాలుచేయడం జరుగుచున్నది. ఇదివరకు Majority గా ఉండి, వెనుకబడినటువంటి ప్రజలు తమ ప్రతినిధిని పంపుకోడానికి అవకాశం లేకుండా, వాళ్ళను పై కులస్థులందరితోకలపి, చివరకు అక్కడ ఎన్నికలు సక్రమంగా, న్యాయంగా జరుగనీయకుండా చేయడం జరుగుతుంది. ఈ విధంగా, పై కులస్థులవారికి, పెత్తనందార్లకు అవకాశమిచ్చే రీతిగా ఈ Blocks ను విభజించారు. ఈ విధంగా ఎన్నికలుజరిగి, ఎన్నుకోబడినటువంటి పంచాతీబోర్డు మెంబర్లు అంతాకలసి ప్రెశిడెంటును ఎన్నుకోవడం జరుగుతుంది, ఈ Blocks

Sri V. Visweswara Rao] [6th December 1955

యొక్క విభజన మొదలైన విధానాలుచూస్తే దీనివల్ల, majority గా ఉన్న ప్రజలను Minority గా చేయడానికి చాలా అవకాశాలున్నాయని స్పష్టంగా బోధపడుతుంది. అందువల్ల, ఈ విధంగా గ్రామాలలో Blocks divide చేయడమూ, majority ని minority గా చేయడము ప్రెశిడెంటును తీసుకువచ్చి మెంబర్లు ఎన్నుకోవాలి అనడం, ఇదంతాచూస్తే దీనివల్ల గ్రామంలో ఉన్నటువంటి పరిపాలన అంతా పూర్తిగా స్తంభింపచేయడమే అవుతుందిగాని మరేమికాదు అని చెప్పవలసియున్నది. ఈ పరిస్థితులలో, ప్రజాస్వామికం అనేది ఎక్కడేనా మిగిలివున్నదా అంటే, ఆరు అడుగులు లోతు తీసినా లేదు అని చెప్పవలసియుంటుంది.

తరవాత కొత్తగా పంచాయితీబోర్డులను ఏర్పాటుచేసేటటువంటి సందర్భంలో ఈ పంచాయితీబోర్డులను స్థాపించి, వాటికి ఎన్నికలు జరిపేంతవరకు ఒక Special Officer ను ఏర్పాటుచేస్తామని చెప్పారు. ఆయనకు ప్రెశిడెంటు powers executive powers అన్నీ ఉంటాయి. అవసరంవస్తే ఈ పంచాయితీయొక్క ఎన్నికల కాలపరిమితిని postpone చేస్తూ ఉండవచ్చునని దాంట్లోఉన్నది. Inspector of Local Boards ద్వారా, ఈ ఎన్నికలను వాయిదావేయడానికి అవకాశమున్నదని చెప్పారు. ఈ బిల్లురాక పూర్వము ఒక పంచాయితీ Act ఉండేది. ఆ పంచాయితీచట్టములో ఇటువంటిది ఒక క్లాజుఉండేదని నాకు జ్ఞాపకము. దానిప్రకారం, కొన్ని గ్రామాలలో పంచాయితీలు ఏర్పాటుచేయవలెనని ఒక Special Officer ను ఏర్పాటుచేయడము, ఆయన ఒక నియమం లేకుండా, ఈ ఎన్నికలు వాయిదాలు వేయడం జరిగింది. పంచాయితీబోర్డులు ఏర్పడకముందు ఈ Special Officer, అనే ఇతనికి ప్రెశిడెంటు powers, executive powers అన్నీ ఉంటాయి. అన్నిపనులు ఈయన చూసేందుకు అవకాశమున్నది. రేపు రాబోయేటటువంటు ప్రెశిడెంటుయొక్క భవిష్యత్తును స్థితిని, నిర్ణయించేటటువంటి అవకాశము ఇతనికి ఉన్నది. ఈయన ప్రెశిడెంటు అనేపేరుతో, పంచాయితీబోర్డు డబ్బుఅంతా, కూడ, ఒక అజ్మాయిష్ కూడ లేకుండా మెంబర్లు తీర్మానంచేయడమనేదికూడ లేకుండా తనయిష్టము వచ్చినట్లు వినియోగించి ఇష్టంవచ్చినట్లు పరిపాలన చేయడానికి అధికారము ఉన్నదంటే గ్రామంయొక్క భవిష్యత్తును ఏరీతిగా తీర్చబోతున్నదో ఆలోచించుకోండి. ఒకవ్యక్తి మొత్తం గ్రామంయొక్క స్థితిఅంతాకూడ మార్చివేసేటటువంటి పరిస్థితి యీనాడు కన్పిస్తున్నది. అందువల్ల పంచాయతీబోర్డులు ప్రజాస్వామికము అని చెప్పుకోడానికి వీలులేకుండా దానిని పూర్తిగా భూస్థాపితం చేయడానికి యీ బిల్లు ఉపయోగపడుతుంది గాని మరెందుకు కాదు.

ఇక, గ్రామాలలో బళ్ళపన్ను అనేది వేస్తున్నామని అన్నారు. ఇప్పటికే majority గ్రామాలలో బళ్లపన్ను వేస్తున్నారు. మంత్రిగారు ఇది majority మాత్రమేగాని, నిర్బంధంకాదని చెప్పుతున్నారు. కాని యీ optional, నిర్బంధం అనేది, మాటలలో తేడామాత్రమే అని అనుకోవలసియుంటుంది. ఎందుచేతనంటే practical పంచాయతీబోర్డు పరిపాలనలో, optional అనేవి నిర్బంధంగా అవుతాయి, నిర్బంధంగా ఉండేవి, optional అవుతాయి. సాధారణంగా నిర్బంధంగా అమలు జరుపవలసినటువంటి వాటి విషయములోకూడ, అనగా ఈ house tax వేసేటప్పుడుగాని మరి ఇతరసందర్భములలోగాని, ఏదైనా సౌకర్యములు కలుగజేసేందుకు మార్గంఉన్నదా, ఏవైనా లోసుగులు ఉన్నాయాఅని ఆలోచించడం జరుగుతుంది. కనుక ఈ optional అనేది తీరావచ్చేటప్పటికి పంచాయతీబోర్డుకు డబ్బులేదని నిర్బంధం అయిపోతుంది. ఇటు ప్రభుత్వము ఇదివరకు ఇస్తామని చెప్పిన 12½ percent వెనుకకు తీసుకొంటూన్నది. ఏదైనా కొత్త మొత్తాలు వస్తే, దాంట్లోనుంచి audit ఖర్చులు అని చెప్పి కొత్తగా ప్రభుత్వము పంచాయతీ బోర్డులనుంచి డబ్బు తీసుకుపోతున్నది. ఇక రెండవది 1956 మార్చి 31 వ తారీఖునుంచి local development works అనేవికూడ లేవు. పంచాయతీ బోర్డులే అవన్నీ నిర్వహించే పరిస్థితులు ఏర్పడుతున్నాయి. National Extension Service వాళ్ల దగ్గరకు వెళ్ళి ఏమైనా చేయండి అంటె, మీ గ్రామస్థులు సగము ఇస్తేగాని, ఏమి చేయడానికి వీలులేదు అని చెప్పుతున్నారు. ఈనాడు ప్రభుత్వము ఎన్నిరకాల పన్నులు వేయడానికి వీలుఉన్నదో అన్నిరకాలుగా పన్ను వేస్తున్నది. ఇక్కడే మనము కూర్చొని 3, 4 చట్టాలు ఇటువంటివి pass చేశాము. కనుక ఈ పరిస్థితులలో బళ్ల పన్ను అనేది optional అని చెప్పినా గూడ అది optional కాదు. అది పూర్తిగా వేయడమే అవుతుంది. పంచాయతీ బోర్డుకు డబ్బులేదు కొబట్టి అదికూడ వేయండి అంటారు. ఇదంతా చూస్తే ప్రజలకు పన్ను వేయకుండా మిగిలించింది ఏదిలేదు. ఆయన భూమిమీద పన్ను వేస్తున్నారు. ఇంటిమీద పన్ను వేస్తున్నారు, బండిమీద పన్ను వేస్తున్నారు, ఆయన పశువులు. జుట్టుమీద తప్పితే కదమా అన్నిటిమీద పన్నువేసే రూపములో బిల్లును తీసుకురావడానికి మనము పూనుకొంటున్నామని అర్థమవుతుంది. అంటే గ్రామ జీవితంలో మనం ఏలాంటి సౌకర్యాలు కలుగజేసినా, కలుగజేయకపోయినా ఆ నాటికి ఆనాడు పన్నులు వేయడానికి మాత్రము పూనుకొంటున్నాము, అనేది మన చట్టాల ద్వారా పూర్తిగా బోధపడుతుంది.

ఈ taxations అన్ని చూస్తే అసలు మనకు యీనాడువున్నటువంటి ప్రజా జీవితములో పన్నుల రూపములో పరిపాలన అంతా జరుపుతున్నారుకాని, ప్రజల

Sri V. Visweswara Rao] [6th December 1955

యొక్క సౌకర్యాలు, వారియొక్క మంచి చెడ్డలు ఏమీగూడ ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు కనబడదు. ఇందాక మంత్రిగారు ఒక విషయము చెప్పారు. కాని యీ నిర్ణయం దేనిమీద ఆధారపడియున్నది అంటే ప్రభుత్వానికి వచ్చే డబ్బును ఆదాయముగా దృష్టిలో పెట్టుకుని యీ పరిపాలనా విధానమంతయు నిర్ణయిస్తున్నామని చెప్పారు. ఆలోచన అంటే డబ్బును గురించి ఆలోచిస్తున్నారని, దాన్నిబట్టి అర్థముచేసుకొవలసిందే కాని, ఈ నాడు ఉపాధ్యాయులు అరవై సంవత్సరాలు, అరవై అయిదు సంవత్సరాలవరకు వుద్యోగము చేసిన తరువాత, వారికి యీ వుద్యోగముల ద్వారా ఏమాత్రము మిగలకపోయినను, చివరకువారు వుద్యోగమునుండి విరమించుకునే సమయములో pension అనేది యేమీలేకుండా వుంటున్నది. పంచాయితీ బోర్డులకు డబ్బువుంటే యిస్తారు, లేకపోతే వారికి యిచ్చేది యేమీలేదనిఅర్థము కనబడుతున్నది.

The Hon. Sri B. GOPALA REDDI :—Provident fund వున్నదిగదా!

Sri V. VISWESWARA RAO :—Provident fund యిప్పటికే వున్నది. కాని, ప్రభుత్వం కొత్తది యేమీఆలోచించలేదు, కాబట్టి వారికి యీనాడు వున్న గ్రామజీవితములో ఏవిధంగానూ కొన్నిఅయినా సౌకర్యాలు వున్నవా అని అంటే, అవిఏమీ కనబడవు. అటువంటి సౌకర్యాలు పూర్తిగా రద్దు చేయటానికి పంచాయితీబోర్డులు తలపెట్టడము జరుగుతున్నది. అంతకన్న వేరు యేమీకనబడదు. ఇందులో యింకొక విషయము వున్నది. ప్రభుత్వము పంచాయితీబోర్డులకు 12½% కేటాయిస్తామని అన్నారు. గ్రామాలు అన్నీ అభివృద్ధిచేయాలనే విషయములో, గ్రామాలు వాటి అంతట అవి స్థానిక చొరవుతో అభివృద్ధికావాలని గ్రామ పంచాయితీలకు 12½% కేటా యించి యిస్తామని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నట్లు యిదివరకు చెప్పారు. అటువంటిదానికి ఒక ఆర్డరు అనేదికాకుండా చట్టములోనే ఒక క్లాజును ప్రవేశపెట్టారు. చివరకు యిది యివ్వవచ్చేటప్పటికి, యీ 12½%ను పూర్తిగాక్షౌరము చేయాలనే వుద్దేశముతో ప్రభుత్వము, యీ సొమ్మును యివ్వవలసిన అవసరముకాదు, ప్రస్తుతము ప్రభుత్వానికి డబ్బులేదుకాబట్టి, ఆ కేటాయింపు తీసివేయాలని ప్రభుత్వం చెబుతున్నది. ప్రభుత్వానికి డబ్బులేదు అని చెప్పటానికి ప్రభుత్వము అనేక రూపాలలో పన్నులువేసి వసూలు చేయదలచున్నారుగదా! కొత్త కొత్త విధానాలలో పన్నులు వసూలు చేయటానికి పూనుకున్నదిగదా! ఇప్పుడు యీ 12½% తీసివేయవలసిన అవసరము ఏమి వచ్చింది? ఈ 12½% ద్వారా గ్రామాలలో కొంతవరకు డబ్బు accumulate అయితే గ్రామాలను అభివృద్ధి పరచుకోటానికి వీలవుతుంది.

గ్రామాలు అభివృద్ధిపరచడములో గ్రామస్థులుకూడా ప్రయత్నము చేస్తున్నారు. ఈ 12½% ఈనాటినుంచి కాకుండా retrospective effect తో, అంటే యీ పంచాయితీల బిల్లు వచ్చినప్పటినుంచీ, గత మూడు నాలుగు సంవత్సరాలనుంచికూడా, పంచాయితీబోర్డుల క్రింద ఖర్చుకాకుండా నిలవవుంటే, అదికూడా తీసుకోవాలని ప్రభుత్వము అభిప్రాయపడుతున్నది. అంటే దీని అర్థము ఏదో సామెత చెప్పినట్లు "అమ్మ పెట్టదు అడుక్కొని తిననివ్వదు" అనే మాదిరిగా వున్నది. దీన్నిబట్టి ప్రభుత్వము యిస్తానన్న 12½% యివ్వకపోగా, పంచాయితీబోర్డులలో నిలవ వున్న సొమ్ముకూడా ప్రభుత్వము తీసుకోటానికి తలపెట్టటము న్యాయముకాదు. నిజానికి పంచాయితీబోర్డులలో ఈనాడు డబ్బు లేనేలేదు. ప్రభుత్వం డబ్బు యివ్వక, పంచాయితీ బోర్డులకు డబ్బులేకుండా వుండే పరిస్థితులు ఏర్పడితే, యిక గ్రామాలను అభివృద్ధిపరచటానికి అవకాశము కనబడదు. ప్రజలు గ్రామాలకు రోడ్లు వేయించమని అడిగితే, అవి జిల్లాబోర్డువారు వేయించాలిగాని, ప్రభుత్వం యొక్క ప్రమేయముకాదంటున్నారు. జిల్లా బోర్డులు చూస్తే,అవిమూలపడివున్నవి. కాబట్టి ప్రస్తుతము జిల్లాబోర్డులు పనిచేయవు. రోడ్లువేసే అవకాశము లేదు. ప్రభుత్వమే వేయాలని అంటే National Extension Service ద్వారా వచ్చే అయిదు సంవత్సరాలలో జిల్లా అంతా blocks ఏర్పాటు చేయబోతున్నామని, అప్పుడు ఆ పని క్రమేపి జరుగుతుందని చెబుతున్నారు. తీరా, వారి దగ్గరకుపోయి అడిగితే గ్రామస్థులు యీ ఖర్చులో సగము భరిస్తే, రోడ్లు వేస్తామని చెప్పడము అవుతున్నది. దానికిముందు సగము డబ్బు కట్టండి అని అంటున్నారు. గ్రామముల అభివృద్ధికోసము గ్రామస్థులు సగము డబ్బుకట్టి వారి పనులు చేయించుకోవాలని చెప్పడము తప్ప మరేమికాదు. ఒక వైపున ప్రజల ఆర్థికజీవితమంతా వెనుకబడిన సమయములో, వ్యవసాయమే ప్రధానముగా వున్న మన రాష్ట్రములో యీ పనులన్ని సాధ్యపడుతాయా అని అంటే, అదిసాధ్యముకాదు. ఇది అసాధ్యమే అవుతుంది. చివరకు ప్రజల అభివృద్ధి అంతా, అన్నివిధాలా కుంటుపడిపోవటానికి దారి తీస్తున్నది. అంతేకాని వేరుకాదని నేను స్పష్టముగా చెప్పగలను. కాబట్టి ప్రస్తుత పరిస్థితులనుబట్టిప్రభుత్వం యిస్తామని చెప్పిన యీ 12½% పంచాయతీబోర్డులకు తప్పకుండా యివ్వవలసిన అవసరమువుందని అంటున్నాను. ఎక్కడైతే పంచాయితీబోర్డులు తమంతటతాము చొరవ చేసుకొని పనిచేయగలుగుతున్నవో, ఆ పంచాయితీ గ్రామాలు, కొన్ని కాకపోతే కొన్ని సౌకర్యాలయినా, అక్కడి ప్రజల యిబ్బందులు తీర్చటానికైనా అవసరము ఎక్కువగా కనబడుతున్నది. కొన్ని పంచాయితీ బోర్డులకు ఉన్న సొమ్ముకూడా లేకుండా చేస్తే, చివరకు వాటి పరిస్థితులు ఏ విధంగా తయారవుతాయని అంటే, ఆ గ్రామాలు అసలు పూర్తిగా వెనుకబడిపోయేస్థితి

Sri V. Visweswara Rao] [6th December 1955

పట్టుతుంది. కొన్ని కొన్ని గ్రామాలు ఎక్కువగా black cotton soil మధ్యన వున్నవి. అటువంటి గ్రామాలకు రోడ్లు లేవు. వానా కాలములో కార్లు పోవడము అనేది ఆలోచనచేయటానికే వీలుండదు సరికదా, బండ్లలో పోవటానికైన రోడ్లు లేవు. ఎంత సేపటికినీ కాలి నడక నే పోవలసి వుంటుంది. ఎవరైనా వెళ్లితే, కాళ్లకు అంటుకొన్న బురద కడుగుకోటానికైనా నీరు దొరకని గ్రామాలు వుంటున్నవి. ఇలాంటి పరిస్థితులు వున్న గ్రామాలు అభివృద్ధికావాలంటే. ఏవిధంగా బాగు పడతాయో, ప్రభుత్వము వాటిని ఎప్పుడు అభివృద్ధికితిసుకొని రాగలదో ఆలోచించాల్సి వుంటుంది. ఈ కారణము చేత నే, అటువంటి గ్రామాలకైనా, అక్కడి పంచాయితీబోర్డులకు యీ 12½% తప్పకుండా యివ్వవలసిందిగా కోరుతున్నాను. ఈ విషయాలన్నీ ప్రభుత్వముయొక్క దృష్టికి తెస్తే, " మేము ఏదోవిధంగా గ్రామ పంచాయితీబోర్డులను కేంద్రీకరణచేయబోతాము, అప్పుడు గ్రామపరిపాలన అభివృద్ధి అవుతుంది, అంతా సౌభాగ్యవంతము చేస్తామని ప్రభుత్వం ఆశలు చూపుతూన్నారు. ఇది ప్రజలను మభ్య పెట్టటము తప్ప మరేమి కాదు. ఈ 12½% ప్రభుత్వంతీసుకోవటం సబబుకాదు. ఇటువంటి పంచాయితీబోర్డుల విషయములో ప్రభుత్వం త్రీవంగా ఆలోచించవలసిన అవసరమువున్నది. ఇదే సందర్భములో యీ శాసనసభలో ఒక బిల్లుకూడా ప్యాసు చేశాము. పంచాయితీబోర్డులకు వచ్చే డబ్బులో stamp duty క్రింద registiation ద్వారా వచ్చేదానిలో ఒక్క రూపాయికూడా పంచాయితీ బోర్డులకు కాకుండా ప్రభుత్వం తీసుకోవడం జరుగుతున్నది. గత శాసనసభలో మనం చేసింది ఏమిటి ? ప్రభుత్వం యొక్క ఆదాయములోనుంచి, అంటే Revenue నుంచి 12½% కేటాయించి తీసుకోవటం జరుగుతున్నది. ప్రభుత్వమునకు deficit budget ఏర్పడినప్పుడు, దాన్ని సరిచేసుకోటానికి, క్రింద వున్న Local Developments ను అభివృద్ధి చేయడానికి కేటాయించిన సొమ్ములో ఏదైనా డబ్బు ఖర్చుపడక మిగిలి వుంటే, ఆ డబ్బు కూడా ప్రభుత్వమే తీసుకోవాలని చేసే ప్రయత్నము, గ్రామాలను అభివృద్ధి చేయటానికి వుపయోగించదు. ఈ విషయాలు మంత్రిగారి దృష్టికి తీసుకుని రాగా, District Municipalities Act సవరించే సందర్భములో మంత్రిగారు సమాధానము చెబుతూ Chamber of Municipal Chairmen చేసినతీర్మానాలనన్నీ దృష్టిలో పెట్టుకుని వ్యవహరిస్తామని చెప్పారు. ఆదేవిధంగా ఆంధ్రరాష్ట్ర పంచాయతీ మహాసభజరగడం, వారుకూడా అక్కడ కొన్నితీర్మానాలు చేయడం జరిగింది. ఆ తీర్మానాలుగూడ ప్రభుత్వం దృష్టిలో పెట్టుకున్నే యీబిల్లును తయారుచేసిందా అని అడుగుతున్నాను. గ్రామపంచాయతీలకు ప్రభుత్వం యీ 12½% యిస్తేతప్ప, అవి బాగుపడవు అని తీర్మానాల ద్వారా కోరారు.

పంచాయతీబోర్డు ప్రెసిడెంట్లను గ్రామంలోని ప్రజలందరు కలసి ఎన్నుకోవాలని ఒకతీర్మానముచేశారు. ఈ విధానము పూర్తిగా రద్దుచేయాలని, ప్రజలు మెంబర్లను మాత్రమే ఎన్నుకోవాలని ప్రభుత్వం సంకల్పించుచున్నట్లుగా మంత్రిగారు చెప్పారు. ఇంతవరకు జరిగిన విధముగా ప్రజలు మెంబర్లను, మెంబర్లు ప్రెసిడెంటును ఎన్నుకుంటే, పంచాయితీబోర్డు ప్రెసిడెంటు మెంబర్లకు తెలియకుండా గూడా తమ యిష్టప్రకారము చేసేతీర్మానాలు కొన్ని ఎదురుపార్టీలోవున్న మెంబర్లకు తెలియకుండాగూడ పోతున్నవి. మెజారిటీ మెంబర్లను చేతపట్టుకుని ప్రెసిడెంటు తన యిష్టప్రకారముగా తీర్మానాలుచేసి, డబ్బు అపహరించిన విషయములు ప్రభుత్వ దృష్టికి తీసుకొనిరాబడింది. ఈ విధంగా చేయడంవల్ల ప్రెసిడెంటులో ప్రజలకు విశ్వాసమువుండదు. ఇష్టమువచ్చిన తీర్మానాలు చేసుకోటానికి, డబ్బు అపహరించటానికి, తానే స్వపరిపాలన చేయటానికి, అన్నివిధాలా అవకాశమువుంటుంది గనుక యీ విధానము మంచిదికాదు. ఇటువంటి విధానము తీసివేసి, దామాషా విధానము ప్రవేశపెట్టండి. దామాషాపద్ధతిఅంటే ప్రజలలో ఏఏ పార్టీలువున్నవి, ఏఏ పార్టీలవారు ఎన్నుకోబడుతున్నారు, ఏఏ పార్టీలతో ఎంతెంతమంది ఎన్నికలలో పాల్గొంటున్నారు, ఎవరెవరికి ఎన్నెన్ని ఓట్లువచ్చినవి, యిలాంటివి అన్నీ లెక్కలోకి తీసుకొని పార్టీలప్రకారము మెంబర్లయొక్క సీట్లను పంచిపెట్టి, అప్పుడు ప్రెసిడెంటు మెంబర్లచేత ఎన్నుకోబడడము అంటే, అది ప్రజాస్వామ్య సిద్ధాంతమనిపించుకుంటుంది. ఈ విధంగా చేసినప్పుడే పంచాయితీబోర్డు పరిపాలన ప్రజలకు సమీపములో, అవినాభావసంబంధముతో జరగగలదు. కాబట్టి దామాషాపద్ధతే మంచిదని అంటున్నాను. ఈనాడు పంచాయితీబోర్డులలో తప్పులు ఎన్నో జరుగుచున్నవి అనేసాకుతో పంచాయితీబోర్డుల విషయములో ప్రజలకువున్న హక్కు నాశనము చేయటానికి ప్రభుత్వం తలపెట్టటముగా కన్పిస్తున్నది. ఇదివరకువున్న పద్ధతి సరియైనది కాదని చెప్పి ప్రభుత్వము యిటువంటి బిల్లునుతెచ్చి, శాసనసభలో దీన్ని ఆమోదించాలని చెప్పడము సరియైనదికాదు. ఈ విషయాలన్నీ సమగ్రంగా చర్చించటానికి Select Committee కి యీ బిల్లును పంపవలసిన అవసరమున్నది. select committee కి పంపితే, అక్కడ క్లాజువారీగా చర్చజరిపించవచ్చు. ఈ బిల్లులోని క్లాజులు ఒకదానికొకటి సంబంధములేకుండా వున్నవి. Select Committee లో యీ బిల్లును చర్చించే అవకాశము యివ్వకుండా దీన్ని యిక్కడే ఆమోదించాలనడం సబబుకాదు.

మరొక విషయము వున్నది. ఇంతవరకు పంచాయితీబోర్డులను పరిపాలన చేస్తున్న కొంతమంది పంచాయితీ ప్రెసిడెంట్లు అపహరించడము ప్రభుత్వము దృష్టికి తెచ్చినప్పుడు, అవి వెంటనే విచారణచేయకుండా ప్రభుత్వము తమ పార్టీకి

Sri V. Visweswara Rao] [6th December 1955

సంబంధించినవారనే ఉద్దేశ్యముతో, విచారించడము సంవత్సరాలకొలది ఆలస్యము చేసి, చివరకు ఏ విధమైన చర్యతీసుకోవడముకూడా జరగలేదు. ఈ విధంగా ఆలస్యము చేయడము, ఆ ప్రసిడెంటును విచారణచేసేలోగా, తానుచేసిన లోపాలు అన్నీ సర్దుబాటుచేసుకోమనేనా, అని అడుగుతున్నాను. వుదహరణకు కంకిపాడు పంచాయితీబోర్డు ప్రెసిడెంటు ప్రజలడబ్బు అపహరించాడని అక్కడవున్న జిల్లా పంచాయితీ ఆఫీసరు రిపోర్టుచేస్తే, ఆ రిపోర్టుసంగతి ఏమయిందో యింతవరకు ఏమి జరిగిందోకూడ ఎవరికీ, ఏమీ తెలియదు. ఈ విధంగా రిపోర్టుచేసినను, ప్రభుత్వం వెంటనే విచారణ జరిపించకపోవడమువల్లను, పంచాయితీ ప్రెసిడెంట్లమీద చర్య తీసుకోకపోవడమువల్లను, ప్రజలకు అనుమానాలు ఎక్కువతువున్నవి. ప్రభుత్వ పరిపాలనా విధానంలోగాని, పంచాయితీ ప్రెసిడెంట్లమీదగాని విశ్వాసమువుండకుండా ఉంది. ఈ విధమైన రిపోర్టులు, తప్పులు, రకరకాలవార్తలు యీ ప్రెసిడెంట్లమీద ప్రభుత్వానికిచేరడం, ఆ విషయాలలో పిటిషన్సు రావడంకూడ జరుగుతున్నది. ఎన్ని పిటిషనులు, రిపోర్టులువచ్చినా, ప్రభుత్వం మిన్నకుండా వుండడమనేది, ప్రభుత్వం యీ విధమైన అక్రమచర్యలకు దోహదమివ్వడము కాక మరేమిటి? ప్రజలలో పంచాయితీబోర్డు ప్రెసిడెంటు మంచివాడో, చెడ్డవాడో, ఆ సంగతి, ప్రజలకు తెలుస్తుంది. ఈ విషయము ప్రజలలోనే వుంటుంది. ప్రభుత్వము విచారణ జరిపితేగదా, వాస్తవపరిస్థితులు బైటకువచ్చేది? చేసిన రిపోర్టులుపెట్టిన పిటిషన్సు నిజమో అబద్ధమో విచారణ జరిపితేగదాతెలిసేది? ఎంతకాలము జరిగినను ప్రభుత్వము విచారణ జరపకపోవటానికి కారణమేమిటి? ఈ విధంగా చేయడమువల్లగదా, అనుమానాలకు ప్రధానకారణము? కొన్ని ఫస్టుక్లాసు పంచాయితీ బోర్డులకు Executive Officers ను ప్రభుత్వం ఏర్పాటుచెసి పరిపాలన నడిపిస్తున్నారు. ఈ ఆఫీసర్లు ఏ విధంగా పనిచేస్తున్నారో ఒక్కసారి అజమాయిషీ చేయించండి. వారిమీద ఎన్నో నిందారోపణలువున్నవి. ఈ మాదిరిగా వచ్చేవారు అందరూ, ఏదో ప్రభుత్వములో పలుకుబడిద్వారా వచ్చినవారే. పంచాయితీబోర్డు పరిపాలనఅంటే యేమీ తెలియదు. ఇక్కడ ఏదో పంచాయితీబోర్డులలో డబ్బు బాగావుంటుంది. అది అంతా అపహరించవచ్చుననే వుద్దేశ్యముతో చేస్తున్నారేగాని, పంచాయితీబోర్డుల పరిపాలన సక్రమంగా చేయాలన్న తలంపుతో చేస్తున్నట్లుగాలేదు. ఉదహరణకు కొటూరు పంచాయితీబోర్డుకు ఒక Executive Officers ను వేశారు. ఆ బోర్డుకువచ్చిన Executive Officers యింతవరకు ఒకరితరువాత ఒకరు, ముగ్గురు మారారు. ఒక్కొక్క Executive Officer రావడం, ప్రెసిడెంటును, మెంబర్లను కూడకట్టుకోవడం, ఏదో తీర్మానాలు చేయించడం, డబ్బు సంపాదించుకోవడం, యింతలో transfer చేయించుకోవడం జరుగు

తున్నది: ఇందులో ఒక Executive officer తనకు సైకిలుకోసం పంచాతీబోర్డుకు అని చెప్పి డబ్బుతీసుకోవడం జరిగింది. దానికి తీర్మానంలేదు, ఏమీలేదు. ఇంతలో ఆయనకు transfer ఆర్డరురావడం, ఆయన ఆ డబ్బును జేబులో పెట్టుకొని పోవడం కూడ జరిగింది. సైకిల్‌కు తీర్మానము పాసుచేయించకుండా ప్రెసిడెంటు, మెంబర్లు ఏ విధంగా డబ్బుయిచ్చారు? చివరకు సైకిల్ కొనడముకూడ జరగలేదు. డబ్బు మాత్రం జేబులోకి నడిచింది. ఈ విధంగావున్నది. ఈ Executive Officers యొక్క పరిపాలన, ఈ విషయము ప్రభుత్వదృష్టికి వచ్చిందా? వస్తే, ఏదైనా విచారణ జరుపుతారా అని అడుగుతున్నాను.

MR. DEPUTY SPEAKER :—బిల్లులో ఏమివున్నదో దానికి సంబంధించిన విషయాలు మాట్లాడండి.

SRI V. VISWESWARA RAO :—Executive officers పరిపాలన యీ విధంగా జరుగుతున్నప్పటికినీ, పంచాయితీ మహాసభ తీర్మానాలుచేసినప్పటికినీ, ప్రజలు తీర్మానాలుద్వారా పంచాయితీబోర్డు పరిపాలననుగురించి తెలియచేసినప్పటికినీ, ప్రభుత్వము యింకా పాతపద్ధతిలో, తమ యిష్టమువచ్చిన రీతిగా పరిపాలన నిర్వహించటానికి ప్రయత్నిస్తున్నది. ఎందుకంటే పంచాయితీబోర్డు చట్టములో ప్రత్యేకంగా పంచాయితీబోర్డు ప్రెసిడెంటుకు, Executive officers కు మధ్యవున్న పరిపాలనా సంబంధాల నిర్వహణలో తగిన amendments తీసుకొని రాబోతున్నామని మంత్రిగారు చెబుతూంటే, యిక ప్రజాస్వామ్యసూత్రమును పంచాయితీబోర్డులకు వర్తింపచేయకుండా, యిప్పటికి ప్రజలకువున్న హక్కులు పూర్తిగా రద్దు చేయటానికి, పంచాయితీబోర్డులకువున్న యీ కొద్దిపాటి ఆదాయము రాకుండా చేయటానికి ప్రభుత్వం పూనుకోవడము సరియైన పద్ధతికాదు. కాబట్టి ప్రస్తుతపరిస్థితులనుబట్టి, పంచాయితీబోర్డు పరిపాలనా నిర్వహణలో ఎంతోమార్పు జరగవలసివున్నది కాబట్టి, యీ బిల్లును యీ శాసనసభలో ఆమోదించటానికి పెట్టకుండా దీన్ని Select Committeeకి పంపి, అక్కడ దానిని క్షుణ్ణంగా చర్చించి, ఒక సమగ్రమైన బిల్లును తీసుకొనిరావటానికి, యీ బిల్లును select committee కి refer చేయాలని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

MR. DEPUTY SPEAKER :—ఈ బిల్లుపైన ఒక సవరణవున్నది.

SRI P. SUNDARAYYA :—Sir, I move "That the Bill be referred to a Select Committee of this House".

The amendment was duly seconded.

MR. DEPUTY SPEAKER :—ఈబిల్లును గురించి షుమారు 15 మం మాట్లాడుటకు పేర్లు పంపించారు. కాబట్టి ఒక్కొక్కరు 5 నిముషాలు మాట్లా వలసిందిగా కోరుతున్నాను.

SRI P. SUNDARAYYA :—5 నిముషములు చాలదు. కనీసం నిముషములు అయినా ఇవ్వండి. ఈబిల్లులో చాలా విషయాలనుచూస్తే అస దాదాపు పంచాయితీ బోర్డులులేని పరిస్థితి తీసుకువస్తున్నారు. అందువల్ల పంచా తీలలో జరిగే అనుభవాలు అయినా చెప్పేందుకు వీలుగా 10 నిమిషములు కాలవ ఇప్పించండి.

MR. DEPUTY SPEAKER :—10 నిముషములకు ఎక్కువ కాకుండా అవసరాన్నిబట్టి మాట్లాడండి.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, ఈ బిల్లునుగురిం నేను కొద్దిగా మాట్లాడదలచుకున్నాను. మాట్లాడడానికి నాకు చాలా కష్టంగా విచారంగా కన్పించుచున్నది. కారణం ఏమంటే, పాపం! మంత్రిగారు ఏబిల్లున తీసుకువచ్చినా ఇటువంటి బిల్లునే తీసుకువస్తున్నారు. అన్నింటిమీద వారికి వ్యతిరేకంగా మాట్లాడడము, మిగతా మంత్రులు అందరూ వెళ్ళిపోవడము, పాపము! ఆయన ఒక్కరూ కూర్చొనడము చూస్తే నాకు చాలా విచారంగా ఉన్నది.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—మీరు ఏమీ భాధ పడ నక్కరలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఎట్లా మాట్లాడినా వారు అనుకూలంగా వోటు చేస్తారు. అందువల్ల మీరు భాధపడ నవసరము లేదని చెబుతున్నారు.

SRI P. NARASIMHAPPA RAO :—ఆ సంగతి మీరు చెప్పనక్కర లేదు. ఈబిల్లులో శిస్తులు 2½% చొప్పున పంచాయితీ బోర్డుకు ఇవ్వాలని లోగడ నుంచి ఉన్నది. మాటలేకాకుండా వ్రాతమూలకంగా ఉన్నది కాని, ఇంతవరకు డబ్బు ఏమీ పంచాయతీ బోర్డులకు ఇవ్వడము జరుగడములేదు. ఏ పంచాయితీ బోర్డు అయినా ఈబిల్లు కొంతవరకైనా పుచ్చుకొని పని చేస్తున్నదా అంటే ఏదీకూడలేదు. పంచాయితీ బోర్డులకు ఇదివరకు stamp dutyల వల్ల ఆదాయము వచ్చేది ఇప్పుడు ఈ మదింపు, ఈ భూసంస్కరణలవల్ల, వచ్చేరాబడి కాస్తా పూర్తిగా తగ్గిపోయింది. ఆవతల భూమిమీద పన్ను ఇచ్చుకోవాలి. బండ్లమీద వాటిమీద పన్నులుకూడా బోర్డులకు ఇచ్చుకోవలసి ఉంటుంది, అంతేగాని పంచాయితీ బోర్డుకు ఇంకేవిధమైన

రాబడి లేదు. సాధారణంగా పెద్ద పట్టణాలలోను చిన్న పంచాయతీలలోను గ్రామ స్వరాజ్యము అన్నారు. చిన్న పంచాయితీ బోర్డుల వృద్ధికోసము village బోర్డ్ల అభివృద్ధికోసం ఇంతవరకు ఎన్నో చెప్పారేగాని, ఒక బిల్లుకూడా పెట్టలేదు. శిస్తు వల్ల వచ్చే 12½% రాబడికూడా తగ్గించేదానికి ఇప్పుడు మంత్రిగారు బిల్లు తీసుకు వచ్చారు. అది పెట్టడం అంత సమంజసముగాలేదు. ముందు విస్తరివేసి భోజనం లేకుండా తీసివేస్తాము అన్నట్లు పంచాయితీ బోర్డుకు కొంచెము హెచ్చురాబడి చూపించాలిగాని, ఉన్నది తీసివేయడము మంచిపనికాదని మనవిచేస్తున్నాను. మేము ఒక బిల్లును పెట్టామంటే దానిని సాధారణంగా మరల వెనుకకు తీయడములేదు అని మంత్రివర్గముయొక్క ఉద్దేశ్యం. ఆ ఉద్దేశముతోనే పనిచేస్తున్నారుగాని, ఎంతసేపు చెప్పినా, members ఎవరుచెప్పినా ఏదో సామెతచెప్పినట్లు "నాతరం కాదు నీతాత తరంకాదు" అన్నట్లుగా చెప్పుకు పోవడమే తప్ప పనిమటుకు ఏదో జరుగుతున్నది కాని, దాంట్లో ఇంతవరకు ఒకమార్పు అయినా తీసుకొనిరాలేదు. మీ ఉద్దేశం ప్రకారం బిల్లును నడిపించాలె తప్ప ఇంకేమీలేదని చెప్పి నేను మనవిచేస్తున్నాను.

ఇంకా పంచాయితీ బోర్డులకు Executive Officersను కొత్తగా వేస్తున్నారు. అసలు పంచాయితీ బోర్డు రాబడి ఎంత ? దానికోసం ఇంకొక ఆఫీసరును వేయడం కూడా అనవసరం అని నా ఉద్దేశ్యము. Stamp duty లు తగ్గడమే కాకుండా అఃలుధరలు తగ్గిపోయినాయి. 10,000 రూపాయిలు క్రయంతోటి తీసుకున్నవారు 1000కి, 500కి వ్రాసుకుంటున్నారు. అసలు క్రియలు తగ్గిపోయినాయి. ఉన్నవాడు అవతల ఏ గంటకు ఏబిల్లు వస్తుందో అని, ఏది పోతుందో అని అనుకోనడంలేదు. అసలు క్రియలు తగ్గిపోతున్నాయి. అందువల్ల అసలు పంచాయతీలకు రాబడి ఎక్కడ నుంచివస్తుంది ? అందులో ఒక Executive Officer ను వేస్తున్నారు. ఆయనవచ్చి తినకు యిష్టమువచ్చినట్లు పన్నువేస్తారు. ఆ పన్నును పేదవారు అయినాసరే కట్టు కుంటేగాని వాడు అప్పీలు చేసుకోవడానికి వీల్లేదు. అది కట్టుకోవడానికికూడా వాడికి అవకాశము ఉండదు. అసలు ఒక ఆఫీసరువచ్చి పన్నువేస్తే ఈ బోర్డుకు ఇంకేమీ అధికారము ఉండదు. ఆ Executive Officer వేసిన పన్నును తప్పించడానికి బోర్డుకు అధికారము ఉన్నది. అటువంటప్పుడు వీరు కట్టుకోవడము ఏలాగు ? కట్టుకుంటేనేగాని అప్పీలు చేసుకోవడానికి వీలులేదు.

ఆ Executive Officer కాకుండా ఒక ఆడిటరుకూడా కావాలన్నారు. అసలు వాళ్లు ఉండి చేసేపని ఏమిటి ? వాళ్లు ఏ తాలూకా headquarters లోనో కూర్చొని, చిన్న పంచాయితీల బోర్డులు చాలాదూరంగా ఉన్న వాటి

Sri P. Narasimhappa Rao] [6th December 1955

ప్రెసిడెంట్లు అందరినీ పుస్తకాలు పుచ్చుకొని రమ్మని సంతకాలు చేస్తారు. వాళ్లు వెళ్లినట్లు మినిట్సు పుస్తకములో వ్రాసుకొని T.A. లు draw చేస్తుంటారు. ఆ సంతకాలకోసం ఆ ఆడిటర్సును ఎందుకు వేశారో తెలియదు. అపనికి Deputy Panchayat Officer చాలదా ? ఆయన ఆ మాత్రము సంతకాలు చేయలేకుండా పోడు. అనవసరంగా ఇంకా ఎక్కువ డబ్బు ఆయనకొఱకు ఖర్చు పెడుతున్నారు. అసలే పంచాయితీలకు డబ్బులేదంటూ యింకా అదనంగా ఖర్చు పెడుతున్నారు. అది తగ్గించమని కోరుతున్నాను. మీరు పంచాయితీలకు ఎల్లాగో సూపరువైజరులను వేశారు. వారు పనిచేస్తున్నారు. వారిపైన హైవేస్ అసిస్టెంటు ఇంజనీర్లు ఉంటారు. వారి పనిని వీరు అజ్మాయిషీ చేస్తుంటారు. దీనిలో estimate లు అన్నీ పంచాయితీల ద్వారా వెళ్లాలన్నారు. ఈరోజున ముఖ్యంగా పాలకొండ పంచాయితీ బోర్డును తీసుకుంటే అందులో రు. 500 లు ఖర్చులేకుండా lapse అయిపోయింది. జిల్లా పంచాయితీ ఆఫీసుకు వెళ్ళితే అచ్చట గుమాస్తాలు లంచము అడిగారు. వారు ఇవ్వలేకున్న కారణముచేత, ఆ గుమస్తాలు వాటిని refuse చేశారు. అట్లా refuse చేశారని resolution కూడా చేశారు. దానికి ఇంతవరకు దిక్కూ దివాణము లేదు. వాళ్ల deparment లో చేసేటటువంటి తప్పులనుగురించి ఆఫీసులో ఎప్పుడూ కూడా చర్య తీసుకోరు. పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటులమీద చెప్పితే వెంటనే సూపర్‌సీడ్ చేసేదానికి వస్తారు. కాని department లో ఎందుకు ఆలశ్యం చేశారు ? ఎంతకాలము చేశారు ? ఎందుకు ఈ report చేశారు ? ఎందుకు estimates పంపలేదు ? లంచము ఎందుచేత అడిగారు ? మొదలైనవి ఆలోచించరు. దానిని గురించి ఆ బోర్డువారు public గానే resolution pass చేసిపంపారు. కావలయునంటే దానిని ఆ మినిట్సు పుస్తకము వగైరా record అంతాకూడా ఆ పాలకొండ పంచాయతీకి వ్రాసి తెప్పించుకోమని మంత్రిగారిని అడుగుతున్నాను. ఏ మాత్రం ప్రెసిడెంటు తప్పుచేశారు అంటే, ఆయన పంచాయతీ ఆఫీసరుకు ఇష్టము కాకపోతే రిపోర్టుచేస్తే అదివెంటనే తీసుకొంటారుగాని, అసలు పంచాయతీ పరిపాలన ఎలా జరుగుతోందో ఏ గ్రామాలలోనూ విచారించినట్లు ఎక్కడా కన్పించదు. అటువంటి పరిస్థితుల్లో ఈ executive officers ను అనవసరంగా తీసుకువచ్చి, పంచాయతీబోర్డుల నెత్తిన పెట్టి ఖర్చులను భరాయించమన్నారు. అసలు ఆ ప్రజలు ఇప్పటికే పన్నులువేస్తే భరాయించలేని స్థితిలో ఉన్నప్పుడు ఇటువంటివన్నీ కూడా భరాయించడం కష్టం కాబట్టి అటువంటి ఖర్చులైనా తగ్గించమని కోరుతున్నాను.

మార్కెట్టు ఉంటే వాటిమీద పంచాయితీలకు కొంత లైసెన్సు ద్వారా డబ్బు వస్తుంటే అందులో భాగం కావాలని అడుగుతున్నారు. Stamp Duty 1% వరకు జిల్లా బోర్డుకు కావాలని జిల్లా బోర్డులకు యిప్పించారు. Village

పంచాయితీలు అన్నారు. వాటిమీద పన్ను ఎంత తప్పించారంటే, 85 లక్షల రూపాయిలవరకు saving ఉన్నది. అలాగే ఇప్పుడు గ్రామ పంచాయితీల క్రింద ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 17 కోట్ల రూపాయిలు పెట్టారు. దానినిగురించి రేపు గ్రామ పంచాయితీలు కొంతవరకు ఖర్చుపెట్టవలసి ఉన్నది. అందువల్ల వారు ఎంత మోయ గల్గుదురో ఆలోచించి అంతే వేస్తే బాగుంటుంది.

పంచాయితీబోర్డు విలువఎంత ? అది మోయగలినదంతా మోస్తుంది. యీ పన్నులన్నీ ఉంటే యీ ఏర్పాటులన్నీ మీరేచేస్తే పంచాయతీబోర్డు యివ్వగలదుగాని రేపుప్రొద్దున road కావాలంటే District Board యివ్వదు. District Board కు అసలే డబ్బులేదని చెప్పుతారు మీరే. ఆ కారణముచేత యీ 12½% పంచాయతీ బోర్డుకు యిచ్చినట్లయితే గ్రామాలు కొంతవరకు improve అవుతాయి. కాబట్టి ఆ 12½% తగ్గించకూడదు. బిల్లు పెట్టినప్పటినుంచి పంచాయతీబోర్డు ఇవ్వవలసినది యిస్తే బాగుంటుందని అయినా నాఉద్దేశము. రేపుప్రొద్దున ¼ తెచ్చి కట్టాలంటారు పంచాయతీబోర్డులు. Villages కొంత యివ్వాలంటారు సగము 2nd Five Year Plan కు ఇచ్చుకోమంటారు. ఆ ¼ కట్టుకో డానికి పంచాయతీ బోర్డుకు డబ్బు వుండనక్కరలేదా అని నేను మనవిచేస్తున్నాను. కాబట్టి మంత్రిగారికి మనవి చేసే దేమిటంటే, వారుపట్టుదలను కొంచెము తగ్గించుకొని మేముపెట్టిన బిల్లును తిరిగి ఎందుకు మార్చాలనే ఉద్దేశము విరమించుకొని పంచాయతీబోర్డులను వృద్ధిచేయడానికి ప్రయత్నిస్తే బాగుంటుందని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI D. RAMABRAHMAM :— అధ్యక్షా, నేడు యీ పంచాయితీ బోర్డుల పరిపాలన విషయములో కొన్ని amendments తీసికునివస్తూ బిల్లుప్రవేశపెట్టి నందులకు ప్రభుత్వాన్ని నేను అభినందిస్తున్నాను. ఇదివరకు ప్రభుత్వము యీ పంచా యితీబోర్డు ఎన్నికలలో ప్రెసిడెంటుకు Direct Election విధానము పెట్టినందువల్ల కొన్నిపంచాయితీల పరిపాలనలో కొంత స్తబ్ధత జరిగింది. పంచాయితీబోర్డులలో వున్న సభ్యులకున్నూ పంచాయితీ అధ్యక్షులకున్నూ సన్నిహితసంబంధములేక వారు ఒక పార్టీగను వీరొకపార్టీగను రావడము దానిలో సమావేశాలుకూడా జరుగకుండా పంచాయతీబోర్డు అధ్యక్షులే సర్వ అధికారాలు తీసికొని వారేపరిపాలన సాగించడము కూడా జరిగింది. దానిని ప్రభుత్వము ఇప్పటికైనా గుర్తించి ఆ పంచాయితీబోర్డు సభ్యుల ఎన్నిక జరిగిన తర్వాత వారి ద్వారానే అధ్యక్షుని ఎన్నిక జరగాలని చెప్పి యీ amendment చేసినందులకు ప్రభుత్వాన్ని అభినందించక తప్పదు. ఇదివరకు స్త్రీలు Assembly కే రావడము చాలా అరుదుగావున్నది. అందువల్ల పంచాయితీబోర్డులకు ఎన్నికల ద్వారా స్త్రీలు రావడము కష్టము. స్త్రీలుకూడా

Sri D. Ramabrahmam] [6th December 1955

పురుషులతోబాటు సగము జనసంఖ్యవున్నందున వీరికికూడా తగిన ప్రాతినిధ్యము మనము స్థానిక పరిపాలనలో యివ్వవలసి వుంటుంది. చదువుకున్నటువంటి వారు పురుషులు చాల కొద్దిమందే యీ పంచాయితీబోర్డు ఎన్నికలలో నిలుస్తున్నారు. కాని స్త్రీలుకూడా చదువుకున్నవారు ఎక్కడా లేకపోవడమువల్ల వారు ఆ స్థానిక సంస్థల ఎన్నికలలో రావడము చాల కష్టము. కాని యీ సభ్యత్వానికి co-opt చేసుకొని అక్కడ ప్రాతినిధ్యము యిచ్చి వారికికూడా పరిపాలనా వ్యవహారాలలో కొంత అనుభవము కల్గించేదానికిగాను స్త్రీలకు స్థానము యివ్వవలసి యున్నది. ఆ తీర్మానాన్నికూడా మనము బలపరుచవలసిన అవకాశమున్నది. ఇదివరకు ఉన్న ప్రభుత్వము యీ పంచాయితీ Act చేయడములో Land Revenue లో నుంచి 12½% పంచాయతీలకు కేటాయించవలసిందిగా చట్టములోని 71-వ Section ప్రకారం provision పెట్టారు. పెట్టినప్పటికీకూడా అప్పుడువున్న ఉమ్మడి మద్రాసు రాష్ట్రములోగాని తర్వాతగాని మనము దానిని పాటించలేదు. పాటించుకోదలచినప్పుడు మన ప్రభుత్వానికి ఆర్థికస్థోమతు సరిగాలేనందువల్ల ఆ clause వల్ల ఉపయోగములేదని ప్రభుత్వము గుర్తించినది. గుర్తించినపుడు ఆ Section ను మినహాయించనిదే పంచాయతీలకు ఎపుడుకూడా సహాయము చేయకూడదని ప్రభుత్వం ఉద్దేశముకాదు అని అనుకుంటున్నాను. సరియైన స్తోమతవచ్చిన తర్వాత పంచాయతీలకు ఎంతగ్రాంటు యిచ్చుకోనేదానికి సామర్థ్యము వుంటుందోచూచి అప్పుడు యిచ్చేఉద్దేశముకూడా ప్రభుత్వానికివున్నది. ఇప్పుడు పంచాయతీలకు గ్రామాలలో సరియైనటువంటి చదువుకున్నవారు అధ్యక్షులుగాను సభ్యులుగాను రాకపోవడమువల్ల చిన్నచిన్నతేలలో ఆ లెక్కలు పెట్టడము విషయములో చాలపొరపాట్లు జరుగుతున్నవి. పంచాయతీబోర్డు లెక్కలు ఏ పురాతనకాలములోనో సృష్టించియున్నారు. ఇప్పుడున్న లెక్కలు మొదలైన వాటి విషయములో పంచాయితీబోర్డులకు అధ్యక్షులకు సరియైన Training యిచ్చేవరకూ కొన్ని పంచాయతీలనుకలిపి పంచాయితీల accounts maintain చేయడానికి ఒక గుమాస్తాను పెట్టి లెక్కలు మొదలైనవాటిని తయారు చేయవలసి వున్నది. వీటినన్నిటినీ సరియైనపద్ధతిలో పంచాయితీలవారికి Training యిస్తే బాగుంటుందనిచెప్పి నేనొక సూచనచేస్తున్నాను. ఇప్పుడు పంచవర్ష ప్రణాళిక అమలు జరుపుతూవున్నారు. ఇదివరకు National Savings Certificates ఇంకా యితరమైన Certificates ను యీ గ్రామపంచాయితీలలో ఏ పని చేయవలసినప్పటికీ ఇదివరకు Deposit చేసిన మొత్తాన్ని అమ్ముకోడానికి Inspector-general of Local Boards వారి మన్ననపొందవలసివుంటుంది. ఇప్పుడు Inspector-general of Local Boards వారు దానిలోనష్టమువచ్చేపద్ధతివుంటే కాని దానినిఅమ్ముకో

డానికి వీలులేదని Surcharge పంచాయితీ బోర్డుల పైన పడుతుందని చెప్పి ఉత్తరువులు చేస్తున్నారు. కాని అటువంటిది ఎక్కువనష్టము రాకుండా Certificates అమ్ముకోడానికి పంచాయితీబోర్డులకు తగువైన ఉత్తరువులు ప్రభుత్వము వారు జారీచేయవలసినదిగా కోరుతూ యీ బిల్లును support చేస్తూ యింతటితో నేను సెలవు తీసికొంటున్నాను.

Sri P. RAJAGOPAL NAIDU :—అధ్యక్షా, ప్రతిపక్ష సభ్యులు ప్రజాస్వామికాన్ని తామే గుత్తకు తీసుకొన్నట్లుగా మాట్లాడడము చాల శోచనీయము. దానిలో కొంతఅయినాసరే మాకు మిగిల్చివుంటే చాల బాగుండేది. యీ పునర్వ్యవస్థీకరణ విషయములో మరొక విమర్శచేశారు—సివార్లను విడగొట్టడానికి వీలుకల్గించుకోవడము ప్రజాస్వామికాన్ని నాశనముచేయడమే అని నేనొక ఉదాహరణ చెప్పదలచాను. ప్రతిపక్షసభ్యులుకూడా ఆ విషయాన్ని గురించి కొన్ని ఉదాహరణలు చెప్పారు. తపనంపల్లె నియోజకవర్గములో రాగిమానిపెంట అనే గ్రామముంది. అది ఏడుమైళ్ళ పొడవుంది. దానిలో బోడబండ్లఅనే గ్రామము కస్బాగ్రామానికి 5 మైళ్ళదూరములోవుంది. కాని యీ బోడబండ్ల గ్రామమే రల్లూరు పల్లెకు ఒకమైలుదూరములోవున్నది. అలాంటపుడు ఒకమైలు దూరములో వున్న గ్రామముతో ఆ బోడబండ్ల గ్రామమునుచేరిస్తే మంచిదా లేదా అనికూడా వారు ఆలోచించాలి. అంతేకాక యీ రాగిమానుపెంట అనే గ్రామము అడవిలోవుంది. అలాంటపుడు సాధ్యమైనంత దగ్గరగావున్నటువంటి సివారులనైనాసరే గ్రామాలతో కల్పవలసినటువంటి అగత్యము ఆంధ్రరాష్ట్రములో హెచ్చుగా వున్నదని నేను అనుకుంటున్నాను. మరొకటి ఏమిటంటే యీనాడు చాల పెద్దపెద్ద గ్రామాలున్నాయి. ఎప్పుడో బ్రిటిష్‌వారి కాలములో ఏర్పడినటువంటి గ్రామాలున్నప్పుడు వాటిని పునర్వ్యవస్థీకరించవలసినటువంటి అవసరము ఇప్పుడువున్నది. అలాంటి పరిస్థితులలో యీ గ్రామాలను విడగొట్టడముకాని చిన్నచిన్న గ్రామాలను కలపడానికిగాని ప్రభుత్వానికి అధికారము వుండాలని నేను అభిప్రాయపడుతున్నాను. అందువల్ల అలాంటి పునర్వ్యవస్థీకరణ చేయవలసివచ్చినపుడు అలాగు చేయడానికి వీలుకల్పిస్తూ బిల్లులో సవరణ తేవడము ప్రజాస్వామికాన్ని నాశనముచేయడము కాదు. ప్రజాస్వామికముతోబాటు ప్రజలకు సౌకర్యాన్ని కల్పించడమని నేను చెప్పదలచుకున్నాను.

రెండోదేమిటంటే President ఎన్నిక విషయమై objection తెస్తున్నారు. ఈనాడు మన Chief Minister గారిని ఆంధ్రరాష్ట్రం మొత్తంమీద ఎన్నుకోవాలని ఎందుకు చెప్పలేదోనాకు అర్థంకావడంలేదు. ఆనాడు అసెంబ్లీ పార్టీ

నాయకునిగా ఆయనను ఎలాగయితే ఒప్పుకున్నారో President ఎన్నిక member ల వల్ల ఎన్నికఅయ్యేటట్లయితే, అందులో వుండేటటువంటి ప్రజాస్వామిక వ్యతిరేకత ఏమిటో కమ్యూనిస్టువారు చెప్పవలసి వున్నది. వాస్తవంగా శ్రీ రామబ్రహ్మం గారు చెప్పినట్లు మెంబర్లు ఎన్నుకోకుండా అందరు ప్రజలు ఎన్నుకోడంవల్లనే President కు member లకు మధ్యవ్యత్యస్థం కలిగి వారు ఏ పనినీ నిర్వహించలేక పోతున్నారని చెప్పారు. అది చాలా పంచాయతీలలో జరుగుతున్న విషయం. దానిని అరికట్టి సక్రమంగా సవ్యంగా కార్యనిర్వహణ జరపడానికి యిలాంటి మార్పు ప్రభుత్వం తెచ్చింది. అందువల్ల దానికి ప్రతిపక్షంవారుకూడా పేచీ పెట్టవలసిన అవసరం ఏమీలేదు. మరొకటి ప్రతిపక్షంవారు చెప్పారు. Auditor లు సరిగ్గా పని చేయడంలేదు కనుక audit చేయవలసిన అవసరం లేదన్నారు. ఇది అర్థం లేనిమాట. తర్కానికి నిలువదు. ప్రజలడబ్బు వ్యయంచేస్తున్నారు కనుక ఆ డబ్బు సరిగ్గా వ్యయపడుతున్నదా లేదా అనేది చూడవలసిన అవసరం ప్రభుత్వానికి వున్నది. కాబట్టి auditors తప్పనిసరిగా అవసరం. డబ్బు దుర్వినియోగపరచకూడదని ప్రతిపక్షంవారుకూడా చెబుతారు. డబ్బు దుర్వినియోగంచేసే అవకాశం కల్పించి దుర్వినియోగం చేసిన తరువాత శిక్షించేదానికంటే దానిని అరికట్టడానికి వీలుగా వుంటుందని అలాచేశారు. మరొకటి, స్త్రీలను ఎన్నుకునే విషయమై ప్రతిపక్ష సభ్యులు వ్యతిరేకాభిప్రాయం తెలిపారు. స్త్రీలకు యీనాడు ప్రాతినిధ్యం యివ్వడానికి అంగీకరించినందుకు ప్రభుత్వాన్ని అభినందించాలి. ఎన్నిక విషయం co-option ఉండకూడదు, మెంబర్లేఎన్నుకోకూడదా అంటున్నారు. నిజమే మిగతా సభ్యులున్నారు. వారందరూ పురుషులే రావాలనిలేదు. అవసరమైతే స్త్రీలను పెట్టి గెల్పించుకోవచ్చు ప్రతిపక్ష సభ్యులుకూడా. కాని తప్పనిసరిగా ఒక స్త్రీ సభ్యురాలుండాలి అనే ఉద్దేశంతో వారు రావడానికి వీలుగా member లు coopt చేసుకున్నట్టయితే బాగుంటుందన్నారు. ప్రజాప్రతినిధులే ఎన్నిక చేసుకుంటున్నారు. కాబట్టి యిందుకు వ్యతిరేకించాల్సిన అవసరం ఏమీలేదు. ఇంక $12\frac{1}{2}$ percent grant తీసివేస్తున్నది ప్రభుత్వం, అన్నారు. అది యిదివరకు యిచ్చినటువంటి grant కాదు. యివ్వబోయే grant కాదు. $12\frac{1}{2}$ per cent grant తగ్గించినా తప్పనిసరిగా ప్రభుత్వం ఏదో కొంత మొత్తాన్ని grant గా యివ్వాలని చెప్పి నేను కోరుతున్నాను. మరొక టేమిటంటే private market లు regulate చేయడానికి ప్రభుత్వం తీసుకుంటున్నందుకు చాలా అభినందించవలసిన విషయం. ఎందుల్లనంటే regulate చేయకపోవడంవల్ల ప్రజలకు చాలా యిబ్బందులు కలుగుతున్నాయి. Regulate చేయకపోతే సౌకర్యాలు కలగడంలేదు. అక్కడ వున్నటువంటి యిజారాదార్లు డబ్బు వసూలు చేసుకోడమేగాని అక్కడకు వస్తున్న

ప్రజలకు సౌకర్యం కలిగించడంలేదు. కనుక వారికిపుడు సౌకర్యం కల్పించేటట్టు చేయడానికి పంచాయతీలకు వీలుకలిగేటట్టు ప్రభుత్వం దీనిని regulate చేయడం చాలా అవసరమై వున్నది. అంతేకాకుండా యీనాడు పంచాయతీ ఎన్నికలు జరుగుతున్నాయి. జరిగినా యింతకుముందు రామబ్రహ్మంగారు చెప్పినట్లుగా చదువుకున్నటువంటివారు administration తెలిసినటువంటివారు అధ్యక్షులు కాలేకపోవడం సంభవిస్తున్నది. అలా జరుగడానికి యింకా కొంతకాలంపట్టవచ్చు, కాబట్టి refresher courses అయినా పెట్టి యీ అధ్యక్షులకు ఏదో ఒక విధమైనటువంటి తరిఫీదు యిస్తే మంచిదని నేను అభిప్రాయపడుతూ విరమిస్తున్నాను.

SRI P. SATYANARAYANA:—అధ్యక్షా, యీ పంచాయితీల సవరణ బిల్లులో చాలా ప్రధానమైనటువంటి హంశములున్నవి. Vote చేసేటటువంటి విధానం, స్త్రీల ప్రాతినిధ్యం, బంజరుపన్ను, భూమి పన్నులో భాగం పంచిపెట్టడం, market licence లు, Special Officer ల అధికారాలు, Audit Fees మొదలయినటువంటి హంశాలు చాలావున్నవి. అందులో కొన్ని చాలా ప్రధానమైన హంశాలు. అవి త్వరత్వరగా ఏదో 2, 3 గంటలు మాత్రమే చర్చించి, నిర్ణయంచేసి గ్రామాల మీద రుద్దడం ఎంతమాత్రం శ్లాఘ్యమైనపనికాదు. అందుచేత దీనిని Select Committee కి తప్పకుండా refer చేయవలసినదని చెప్పి నేను కోరుతున్నాను. అసలు యిప్పుడున్నటువంటి Voting system లో చాలా జూదపు స్వభావం వున్నది. ఓట్లు ఎక్కువ వచ్చినప్పటికీ సీట్లు తక్కువ రావడం. ఓట్లు తక్కువ వచ్చినప్పటికీ సీట్లు ఎక్కువ రావడం మనం అనేక విషయాల్లో చూస్తునేవున్నాం. నిజమైన ప్రజాస్వామికం కావాలంటే ప్రజాభిప్రాయం ఏ పక్షం పట్ల ఎంత ఎక్కువగా వున్నదో ఎంత తక్కువగా వున్నదో ఏ proportion లో వున్నదో పంచాయితీలలో సరిగా ప్రతిబింబించాలి. Proportional representation అనేటటువంటి system న్యాయంగా పెట్టి వుండవలసినది. ఐతే అసెంబ్లీ, పార్లమెంటు మొదలైనటువంటి వ్యవహారాలలోనే ఆ మాత్రం చాలా చక్కగా వుండివుండునుగాని దాన్ని గురించి శాసించే అధికారం మనకులేకపోయినా పంచాయితీలను గురించి శాసించే సర్వాధికారం మనకున్నది. కాబట్టి యీ సావకాశాన్ని ఉపయోగించి మనం అవసరమైతే Select Committeeలో దానిని కూడా చర్చించి ఆవిధంగా చేయవచ్చు. అందుచేతనే అది చాలా ఉత్తమమైనటువంటి పద్ధతికనుక ఆపద్ధతి ఎలాగూ జరగడం లేనప్పుడు ఏదో ఒక President వ్యవహారంలోనయినా తీసివేయడం చాలా అక్రమం. ఆవిధంగా యిదివరకు జరుగుతూవుండేది. మనకు ఉన్న power అంతకూ వర్తించకుండా ఒక President కే వర్తింపచేయడం ఉత్తమం కాకపోయినా మధ్యమం అనుకుంటే

దానిని కూడా తీసివేసి Council లోనుంచి పంచాయతీల ఎన్నిక పద్ధతి పెట్టడం ప్రజాస్వామికాన్ని అభివృద్ధి పరచే కార్యక్రమం కాదు. దానిని నిరుత్సాహపరచేది నిరోధించేదిగా వున్నది. ఇప్పుడు పంచాయితీలు సాధారణంగా చిన్న చిన్న గ్రామాలకే వుంటున్నాయి. గ్రామాలలో వున్నటువంటి సాంఘిక వ్యవస్థను గురించి అనేక కారణములను చూచి పరిశీలించి report వ్రాసినటువంటివి మనం చూచివున్నాం. Rural Credit Survey Report లు మొదలైనటువంటి మనం చూస్తే గ్రామంలో వున్నటువంటి కొద్ది మంది అధికారులు, భూస్వాములు, వడ్డీ వ్యాపారస్థులు ఎంతదౌర్జన్య పూరితంగా ప్రజాస్వామికానికి వ్యతిరేకంగా ప్రవర్తించి గ్రామ అభివృద్ధిని సమష్టి అభివృద్ధిని నిరోధిస్తున్నారో దానిని మనం చూస్తూనే వున్నాం. ఆ సాంఘిక స్వభావంలో యిప్పుడేమార్పు రాలేదు. కనుక యిప్పుడు ఏదో 7 గురు members కలిగినటువంటి పంచాయతీబోర్డులో యిద్దరుమాత్రమే తన పక్షాన వున్నట్టయితే ఇంకొకమనిషిని కనుక తాను డబ్బిచ్చి కొన్నట్టయితే తప్పకుండా పక్షాన President కావడానికి chance వుంటుంది. తన పలుకుబడిని డబ్బును తప్పక ఉపయోగిస్తాడు. అట్లా ఉపయోగించడానికి తగిన దోహదం యీ సవరణ యిస్తోంది. ఇది ఎంతమాత్రం మంచి పని కాదు. అందుచేత ఆ సవరణ మేము బలపరచలేక పోతున్నాం. రెండోది స్త్రీలకు ప్రాతినిధ్యం. స్త్రీల ప్రాతినిధ్యంలోకూడా సాధారణంగా పంచాయతీబోర్డులో దామాషా అయిదో పదో సభ్యులుంటారను కుంటాను. చాలా ఎక్కువగా స్థానిక populationబట్టి దామాషా కూడావుంటుంది. Minimum I said. అంత తక్కువ సంఖ్య కలిగినటువంటి పంచాయతీ Member లలో ఒక స్త్రీ సభ్యురాలు యొక్క vote కు కూడా చాలా విలువవుంటుంది. అంతవిలువ కలిగినటువంటి vote ను కేవలం Co-option పెట్టడం సబబుకాదు. 100 సభ్యులు కలిగినటువంటి సంస్థ అయితే ఒకరిద్దరు nomination అయితే ఫరవాలేదు. ఉండేదే 7, 8, 9 అయినపుడు ఒక సభ్యురాలిని nominate చేయడం ఎంతమాత్రం మంచిదికాదు. ఇది గ్రామాలలో వున్నటువంటి పెత్తందారీతనాన్ని బలపరచడానికే ఉపయోగపడుతుందిగాని ప్రజాస్వామికాన్ని బలపరచడానికి ఎంతమాత్రం ఉపయోగపడదు.

అందుచేత ఇపుడు ఒక పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయి, రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రవేశించబోతున్నాం. స్వరాజ్యం వచ్చిన 9-వ సంవత్సరంలో ఉన్నాము. ఇప్పటికి అప్పుడే మన భారత దేశంయొక్క Republican Constitution లో నిర్వచించిన ప్రకారం గ్రామాల యొక్క సౌష్టవాన్ని బాగా బలపరచుకోవడం, మరి గ్రామ పరిపాలనను బలపరచుకోవడం, ఇది అంతా

జరుగవలసినదానికి బదులుగా, ఎప్పటికప్పుడు దానికి ఉండేఅధికారాలను, ఇదివరకు కొద్ది కొద్దిగా అధికారాలు ఉంటే, ఇప్పుడిప్పుడే మనంవాటిని తీసివేయబోతున్నాం. అసలు న్యాయంగా అక్కడ ఉండేటటువంటి ఆ భూమిశిస్తులు అన్నీ వాండ్లు వసూలు చేయడం, అక్కడ ఉండే విద్యా సంస్థలు, ఆరోగ్య సంస్థలు మొదలైనవి అన్నీకూడ తాము స్వయంగా manage చేసుకో కలగడం, ఈ రకమైనటువంటి స్థాయికి క్రమ క్రమముగా తీసుకొని వచ్చేబదులు, వాటికి ఉండేటటువంటి ఆర్థిక అవకాశాలు అధికారాలు లాగివేస్తున్నాము. మొత్తం మీద ఈ ధోరణి అంతాకూడ అభివృద్ధిదాయకంగా ఉండేబదులు, దానిని నిరోధించే పద్ధతిలోనే ఉన్నది. అందుచేత ఈ విషయంలో అన్నీకూడ సాకల్యంగా విచారించటానికి సావకాశం ఇచ్చే నిమిత్తం Select Committee కి refer చేసి కొంత time తీసుకోవడం మంచిది అని నా మనవి.

SRI T. LAKSHMINARAYANA REDDI :—ఉపాధ్యక్షా, ఈ బిల్లును నేను బలపరుస్తున్నాను. మన Samalkota నుంచి వచ్చిన గౌరవ సభ్యుడు proportional representation అనే పెద్దవిషయాన్ని తీసుకొనివచ్చి పెట్టారు. Proportional representation కూడ Democracyలో ఒక పద్ధతైన వోటింగే. అయినప్పటికీకూడా proportional representation ఎక్కడెక్కడ ఉందో అక్కడ ఆ ప్రభుత్వాలకు stability లేకుండాపోవుటం మనం చూస్తూనే ఉన్నాము. అటువంటప్పుడు ఏదైనా ప్రభుత్వ పరిపాలన సక్రమంగా జరగాలంటే stability చాలా ముఖ్యమైన సంగతి అని అందరికు తెలుసును. అటువంటి దానిని ఈ proportional representation ద్వారా తెచ్చుకొని మనము దానికి తోడ్పడం అనేది మంచిదికాదేమో అని నేను అనుకొంటున్నాను. రెండవది గౌరవ సభ్యుడు మాట్లాడుతూ directగా ప్రెసిడెంటు వోటింగు తీసివేయడం అనేది పొరపాటు. అది retrograde step అని ఏదో చెప్పారు. నిజమే. ఆ ఆదర్శాన్ని కొలతబద్ధగా మనము తీసుకొన్నట్లయితే, ఇవన్నీ కూడ తప్పుగానే ఉంటాయి. అందువల్ల ఆ ఆదర్శాన్ని కొలతబద్ధగా తీసుకోనటకు వీలులేదు. వాస్తవాన్ని మనము గ్రహించవలెను. ఈనాడు పల్లెటూళ్లలో ఉన్న పరిస్థితులను చూసినట్లయితే, మనం too much democracy మూలంగా అక్కడ లేనిపోని పోట్లాటలకు, దెబ్బలాటలకుకూడ కారణాలు అవుతున్నాయి. మనము direct ఎలక్షనులు పెట్టుకొంటున్నామని, అసెంబ్లీకిలేక పార్లమెంటు మొదలైన వాటికి ఇంకా పంచాయితీలకుకూడ direct ప్రెసిడెంటు ఎలక్షనులు పెట్టుకొంటే అది ఒక పెద్ద కోలాహలం అయిపోతుంది. అట్లాకాకుండా, ఇలాగా మెంబర్సు ద్వారా ప్రెసిడెంటును ఎన్ను

Sri T. Lakshminarayana Reddi.] [6th December 1955

కొన్నట్లయితే, అంతగా గొడవలకు తావు ఇవ్వదు. రెండవది ఏమంటే వచ్చిన ప్రెసిడెంటు majority సభ్యుల ద్వారా వచ్చినపుడు,—అక్కడకూడ—ప్రెసిడెంటు ఒక పార్టీ, మెంబర్లు మరొక పార్టీకి చెంది నిరంతరం వచ్చే కోలాహలం అవి.అన్నీ లేకుండా—పరిపాలన సక్రమంగా జరగడానికి తావు ఉంది.

రెండవ విషయం ఏమంటే 12% రెవిన్యూ నుంచి వచ్చేది పోతుంది. అలాగా పంచాయితీలకు స్వాస్థ్యం లేకుండాపోతుంది అని చెప్పి గౌరవ సభ్యుడు చెప్పాడు. నిజమే. పోతుంది గాని ఈ 12½% అసలు పంచాయితీని స్వాస్థ్యం చేస్తామనే ఉద్దేశంతోటే అప్పుడు ఈ బిల్లు లో చేర్చారు గాని మనకు ఉండే ఆర్థిక పరిస్థితులు అందరికి తెలిసినవే. చాలా పెద్దలోటు వచ్చిన కారణంగా అవి అన్నీకూడ మంచిది అని ఒప్పుకుంటేకూడ అవి అమలు పెట్టలేక పోతున్నాము. అములులో పెట్టలేక పోయినపుడు, ఆ క్లాజు అక్కడ ఎందుకు ఉండడమని తీసి వేయబడుతుందేగాని, అటువంటి స్వాస్థ్యము మన ప్రభుత్వానికి కూడినవుడు, మళ్లీ పంచాయితీలను స్వాస్థ్యం చేయడానికి ఇంకా ఎక్కువ % ఇవ్వడానికి ప్రభుత్వం సిద్ధంగానె ఉంటుందని, ఆ సిద్ధాంతాన్నికూడ ప్రభుత్వం ఒపుకొంటుందని చెప్పి గౌరవ సభ్యులకు మనవి చేస్తున్నాను. ఇకపోతే స్త్రీ సభ్యులను గురించి కూడ direct election కావలెనని ఒక amendment వచ్చినట్లు కనబడుతుంది. మనము ప్రెసిడెంటును ఏ కారణంచేత direct గా ఎన్నుకొనడంలేదో, ఆ కారణంచేత ఇది కూడ తగదని మనము చెప్పవచ్చును. రెండవది ఏమంటే, ఈనాడు మన పల్లెటూళ్లలో పరిపాలనకూడ ....

THE HON. SRI A.B. NAGESWARA RAO:—ఈ general సీట్లకు కూడా నిలవడానికి అవకాశం ఉంది. అది సరే. అందుచేత నిలబడవచ్చునని గాని మనం ఆలాగా direct election పెట్టనట్లయితే చాల పంచాయితీలలో ఒక స్త్రీ కూడ రాకుండాపోవడానికి అవకాశం ఉంది. గాని కొంతకాలంపాటు వాండ్లందరిని కూడ co-opt చేసుకొని, వారు కొంత ముందుకు వచ్చేటట్లు అలవాటు చేసినట్లయితే తర్వాత అక్కరలేకపోతే ఈ పద్ధతినికూడ మనం తొలగించుకొనవచ్చును. కాని ప్రస్తుతం మాత్రం ఈ co-opt system చాల అవసరం అని చెప్పి నేను అనుకొంటున్నాను.

SRI T. LAKSHMINARAYANA REDDI:—కాని ఇంకొకవిషయం. ఏ పంచాయితీ బోర్డు supercession వల్ల గాని, మరి ఏవిధంచేతనైనగాని ఒక special ఆఫీసరును వేయడం, ఆయనకు కొంతజీతం ఇచ్చేటట్లుగ ఈబిల్లులో ఉంది. ఇది అవసరంలేదేమో అని నేను అనుకొంటున్నాను. ఎందుచేత అంటే, జీతం

అక్కరలేకుండా ప్రభుత్వ ఉద్యోగి ఉన్నట్లయితే, ఎట్లాగు కొంత జీతం ఆయనకు ఇస్తుంది. ఆయనకు ఉండే బాధ్యతలలో, ఇది ఒకటి అవుతుంది. గాని దీనికి special గా ఎక్కువ fee ఏమి ఇవ్వవలసిన అవసరంలేదేమో అని నేను భావిస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, ఈనాడు ప్రభుత్వం తీసుకొని వచ్చిన ఈ బిల్లును నేను బలపరుస్తూఉన్నాను. ముఖ్యంగా నాకు ఒకటే విచారం వేసింది. Communist సోదరులు మాట్లాడుతూ ప్రజాస్వామ్యం, ప్రజాస్వామ్యం అని చెబుతున్నారు. ప్రజాస్వామ్యం పట్లవాండడ్లకు ఉన్న విశ్వాసము ఎంతవరకు అనేది నేను వారిని ప్రశ్నిస్తున్నాను. అందుచేత ఈనాడు, ప్రపంచంలో ఇక్కడ ఉన్నదాని కన్న నాలుగురెట్లు ఎక్కువగా ఉన్నది. ప్రస్తుతం సుందయ్యగారు పూజిస్తున్న రష్యాదేశాన్ని, ప్రజలను చూస్తే తెలుస్తుంది అని ముఖ్యంగా ఈనాడు చెప్పతూ ఉన్నాను. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కాంగ్రెసు ప్రభుత్వములే, ప్రజాస్వామ్యం పట్ల సంపూర్ణమైన విశ్వాసంతో ప్రజాస్వామ్యం వర్ధిల్లాలనే ఉద్దేశంతోనే అందరికికూడ వోటింగు హక్కు ఇచ్చి ఎన్నికలు జరిపించిన సంగతి కూడ, communist సోదరులకు బాగా తెలుసును. అందుచేత ప్రజాస్వామ్యం అనేమాటను మాత్రం ఉపయోగించే అవకాశం హక్కు వారికి అక్కటేలేదని మాత్రం నేను విశ్వసిస్తున్నాను. అందుచేతనే, ఏదో ఈనాడు పంచాయతీయాక్టులో ప్రభుత్వం కొంచెం, కొంచెంగా సవరణలు తీసుకొనివచ్చింది. ఈ సవరణలు select committee కి వెళ్లవలసిన అవసరంకూడలేదు. 12½% land revenue నుంచి ఇవ్వవలెనని ప్రభుత్వం మొట్టమొదట తలపెట్టింది, కాని ఈనాడు ఈ పంచవర్ష ప్రణాళికలు, పెట్టిన తర్వాతను, ఈనాడు దేశములో అన్ని రకాలుగా అభివృద్ధిచేస్తూ ప్రభుత్వానికి వస్తున్న రాబడి తగ్గుతుంది. ప్రభుత్వ ఖర్చులు పెరగడంవల్ల, ఈ deficit బడ్జెటులో మనము ఇచ్చుకోలేమనే పరిస్థితులను బట్టి గాని, రేపు ప్రొద్దున, రెండో, మూడో, పంచవర్ష ప్రణాళికలు ప్రారంభం అయిన తరువాతనే Land Revnue అంతాకూడ పంచాయతీల పరంచేయుటకు ప్రభుత్వం తప్పకుండా అంగీకరిస్తుందనే నేను సంపూర్ణంగా విశ్వసిస్తున్నాను. అంతేకాకుండా మనము ఈమూడు పంచవర్ష ప్రణాళికలు అమలు పెట్టిన తర్వాత, దేశానికి కావలసిన ముఖ్యమైన అవసరాలు, దానివల్ల తీర్చుకొన్న తరువాతను, మనకు కావలసిన గ్రామ స్వరాజ్యము, పంచాయతీ రాజ్యము, అనే ఉద్దేశం కాంగ్రెసుకు మొట్టమొదటినుంచి ఉంది. ఏనాడు కూడ, ఆవిషయంలో కాంగ్రెసు వెనుకకుపోదు. అందుచేతను పంచాయతీ రాజ్యము గురించి మనము ఆనాడు ఏ

విధముగ కొత్త శాసనము తీసుకొని రావలసి ఉంటుందో, పంచాయతీలు ఏవిధంగా అభివృద్ధిచేసి, దానికి ఉన్నరాబడిని అభివృద్ధి చేయడానికి Land Revenue అంతాకూడ పంచాయతీలకే ఇవ్వవలసిన పరిస్థితులు వస్తాయి. అందుచేత ఆవిషయాలలో ప్రభుత్వం ఈ పంచాయతీల పట్లు నిర్లక్ష్యం చేస్తుందనిగాని, గ్రామ పంచాయతి అభివృద్ధిని ఆటంక పరుస్తుంది అనిగాని, ఎవరైనా భావించడం పొరపాటు అని నేను మనవిచేస్తున్నాను. ముఖ్యంగా స్త్రీలకు కూడ, ప్రాతినిధ్యం ఇవ్వడంలో నిజంగా మంత్రివర్గానికి ప్రత్యేకంగా అభినందనాలు అర్పిస్తున్నాను. ఈనాడు మనము చూస్తూఉన్నాం. స్త్రీలకు ఎంతవరకు ప్రాతినిధ్యం ఉన్నది అనేది మనం తెలుసుకొంటే, అది చాల స్వల్పం. దేశంలో మనము కొంతవరకైనా వారికి, ప్రజాసేవచేయడానికి వచ్చేవాండ్లకు అవకాశం కల్పించడానికి ఇటువంటి co-option పద్ధతి పుట్టినపుడు, క్రమేపివాండ్లు అభివృద్ధిచెంది, వాండ్లలో నూతన చైతన్యం కలిగి, తరువాతను కొత్త Act ను మనము సవరించుకొనేటప్పుడు, అప్పుడు ఎన్నికలద్వారా వాండ్లు వచ్చేవిధమున చూచుకోవచ్చును. కొన్ని పరిస్థితులలో వాండ్లలో సంపూర్ణమైన చైతన్యం వచ్చినతరువాత, వాండ్లే మనకు సీట్లు ఇవ్వవలసిన పరిస్థితులు వస్తాయేమో అనికూడ నేను భావిస్తున్నాను. అందుచేతను, ఆవిషయం సంపూర్ణంగా, పంచాయతీ రాజ్యస్థాపన పది సంవత్సరములు తర్వాత పెట్టడానికి అవకాశాలు ఉంటాయి. ఈ రెండు పంచవర్ష ప్రణాళికలు పూర్తి అయిన తర్వాత కొత్త పంచాయతీ Act ను మనము తీసుకొనివచ్చేటప్పుడు అప్పుడప్పుడు ఈ జిల్లా బోర్డుల అవసరంలేదు అని నేను భావిస్తున్నాను. ఈనాడుకూడ జిల్లా బోర్డులు అనవసరం అనే నేను భావిస్తున్నాను.

అందుచేత ఆ విషయంలో ప్రభుత్వం పంచాయితీల పట్ల నిర్లక్ష్యం చేస్తున్నదని గాని గ్రామ పంచాయతీల అభివృద్ధికి ఆటంకపరుస్తుందని గాని ఎవరైన భావించడం పొరపాటు అని మనవిచేస్తున్నాను. ముఖ్యంగా ఇక్కడ స్త్రీలకుకూడా ప్రాతినిధ్యం ఇచ్చినందుకు నిజంగా మంత్రివర్గానికి ప్రత్యేకంగా అభినందనాలను అర్పిస్తున్నాను. ఈనాడు స్త్రీలకు ఎన్నికలలో ఎంతవరకు ప్రాతినిధ్యం ఉన్నదనేది మనం తెలుసుకొంటే చాలా స్వల్పమని భావిస్తున్నాను. ఈ దేశం ఈవిధంగా మనం కొంతవరకైనా వారికి ప్రజాసేవకు బైటకు వచ్చేవారికి అవకాశం కల్పించడానికి ఇటువంటి co-option పద్ధతి పెట్టినపుడు క్రమేపి వాళ్లలో అభివృద్ధి పొంది; వాళ్లలో నూతన చైతన్యం కలిగిన తరువాతను కొత్త Act ను మనం సవరించుకొనేటప్పుడు అప్పుడు ఎన్నికలద్వారా వాళ్లు వచ్చేటట్లుగా చూసుకోవచ్చు. కొన్ని పరిస్థితులలో వారిలో ఇంకా సంపూర్ణమైన చైతన్యం వచ్చిన తరువాత వాళ్ళే

మనకు సీట్లు ఇవ్వవలసిన పరిస్థితి వస్తుందేమో ? అందుచేత సంపూర్ణంగా ఈ పంచాయతీ రాజ్యస్థాపన 10 సంవత్సరముల తర్వాత పెట్టడానికి చాలా అవకాశాలుంటాయి. ఈ రెండు పంచవర్ష ప్రణాళికలు పూర్తి అయిన తరువాతను క్రొత్త పంచాయతీ Act తీసుకువచ్చేటప్పుడు ఈ జిల్లా బోర్డులు అవసరంకూడా ఉండదని నేను భావిస్తున్నాను. ఈనాటికి నా ఉద్దేశంకూడా జిల్లా బోర్డులు అనవసరమనే నేను భావిస్తున్నాను. ఎందుకంటే ఒక ప్రక్క planning ద్వారా గ్రామాలను అభివృద్ధి చేసుకుంటూ, రెండవ ప్రక్క పంచాయతీలద్వారా గ్రామాలలో గ్రామరాజ్యస్థాపనకు ప్రయత్నంచేస్తున్నప్పుడు ఈమధ్య జిల్లా బోర్డుల అవసరం నాకేమీ కన్పించడం లేదు. ఆ విషయాలుకూడా ప్రభుత్వం గమనించాలని మాత్రం నేను కోరుతున్నాను. ముఖ్యంగా నేను ప్రభుత్వానికి మాత్రం ఈ పంచాయతీలలో పంచాయతీ ప్రెసిడెంటుకు ప్రత్యేకంగా ఒక training ఇచ్చే పద్ధతి ప్రవేశ పెట్టాలని మాత్రం ప్రభుత్వాన్ని కోరుతున్నాను. చాలచోట్ల పంచాయతీ ప్రెసిడెంట్లు వాళ్లకు పంచాయతీ పరిపాలన ఏవిధంగా జరిపించాలనేది తెలియక అక్కడ వాళ్లకుగల పలుకుబడిచేత ప్రెసిడెంట్లు అయిన తరువాతకూడా వాళ్లకు తెలియక కొంతమంది ఆఫీసర్ల చేతులలో పడడం మూలంగా కొన్ని అవకతవకలు జరుగుతున్నాయి. అందుచేత అక్కడ క్రొత్త యువకులను తయారుచేసి దానికికూడా కనీసం కొంత చదువు అని పెట్టో లేక ఒక training అని పెట్టో, అటువంటి వాళ్లను ప్రెసిడెంట్లుగా ఎన్నుకొనే అవకాశం కల్పించినట్లయితే గ్రామాలలో పరిపాలన సక్రమంగా జరుగుతుంది. తరువాత ముఖ్యంగా ఇంకో మార్పు చేశారు. అందుకు నేను ప్రభుత్వాన్నికూడా అభినందిస్తున్నాను. ఏమిటంటే ప్రెసిడెంటుకు direct ఎన్నిక, తక్కిన మెంబర్లకు మామూలు ఎన్నిక అని చెప్పారు. దానివల్ల కొన్ని అవకతవకలు కలిగాయి. మరి మా జిల్లాలో ఇచ్ఛాపురం, టెక్కలిలోను చూశాము. ఈ రెండుచోట్లలోకూడా ప్రెసిడెంట్లు ఎన్నికయ్యారు. కాని పంచాయతీలలో వాళ్లకి majority ఏ మాత్రంకూడా లేకుండాపోయింది. ప్రజలందరు వాళ్లనుఎన్నుకొన్నారు. కాని memberలు మాత్రం వాళ్లకు వ్యతిరేకంగా ప్రవర్తించడంచేత అక్కడ ప్రెసిడెంటుగారు ఏ మంచికార్యం తలపెట్టినా member లు ఆటంకం చేయడం మూలంగా ఎప్పటికప్పుడు deal lock create అవుతూనే ఉంది. అందుచేత Majority member లు అందరు ఎన్నుకొని ఒక ప్రెసిడెంటును ఎన్నుకొనేటప్పుడు Majority తో కార్యక్రమాలు సాగించుకోవడానికి అవకాశం ఉంటుంది. అందుగురించి మాత్రం ప్రభుత్వం వెంటనే ఈ విషయం గమనించి తీసుకువచ్చినందుకు ప్రభుత్వానికి మరొకసారి నేను అభినందనాలు అర్పిస్తున్నాను. ముఖ్యంగా ఈ విషయంలో మాత్రం ప్రతిపక్ష సభ్యులకు మనవిచేస్తున్నాను. వారు ఈవిషయంలో Select Committee బాధపడ

నవసరంలేదు. కాంగ్రెసు ఉద్దేశ్యం, కాంగ్రెసు చేయవలసిన కార్యక్రమం ముందుగా, ఎప్పుడో, మొదటే చెప్పిఉన్నాము. దానికి ఏమాత్రం వెనక్కుపోము. కాని ప్రజాస్వామ్యం పట్ల కాంగ్రెసుకు విశ్వాసంలేదనే భావంమాత్రం మీరు కల్పించవద్దు. అది ప్రజలు మాత్రం నమ్మరు. మీరుమాత్రం ఈ ప్రజాస్వామ్యం పట్ల వారికి ఉన్న విశ్వాసాలు ఇంకా గురుతరం చేసుకొని భారతందేశ పరిస్థితులనుబట్టి మన యొక్క పరిస్థితులనుబట్టి మనమందరం కలిసి భారతదేశంలో ప్రజాస్వామ్యం మరింత వర్ధిల్లచేసి ప్రపంచానికి ఆదర్శప్రాయంగా ఉండడానికి అవకాశాలు ఉంటాయి. అందుచేత ఈవిషయంలో మారేమి అభిప్రాయబేధాలు పెట్టుకోకుండా ఇది pass చేయవలసిందని అందరినీ కోరుతు విరమిస్తున్నాను.

SRI D. V. SUBBA RAO :—అధ్యక్షా, ప్రతిపక్ష సభ్యులు ప్రజాస్వామ్య విరుద్ధ సూత్రాలు కొన్ని ఈ బిల్లులో ఇమిడి ఉన్నాయని చెప్పి ఆక్షేపణ చేసినందుకు ప్రభుత్వపక్ష సభ్యులు కారాలు మిరియాలు నూరేస్తున్నారు. కాని ఇప్పుడు పుచ్చల సత్యంనారాయణగారు మన శాసనసభకు దామాషా ఓటింగ్ పద్ధతి ప్రకారం పెట్టడానికి సర్వాధికారాలు ఉన్నప్పుడు ఆ experiment ఎందుకు చేయకూడదు అని అంటే, లక్ష్మీనారాయణ రెడ్డిగారు దానివల్ల స్థిరత్వంపోతుందని, ఏ పంచాయతీబోర్డులోను స్థిరమైనటువంటి పరిపాలనగల బోర్డు ఏర్పడడానికి సావకాశంలేదని చెప్పారు. అయితే ఇప్పుడు ఉన్నటువంటి సూత్రాలప్రకారం మాత్రం స్థిరంగాఉంటున్నాయా? మొన్న 10 నెలలకే ప్రభుత్వం ఎందుకు పడిపోయింది? మళ్లీ కొత్త మంత్రివర్గం ఎందుకు వచ్చింది? అదిగాదు. దామాషా ఎన్నిక పద్ధతిలో ప్రజాభిప్రాయం సరిగ్గా ప్రతిబింభించడానికి తగిన సావకాశం ఉంటుంది. ఇప్పుడు లక్ష్మణదాసు గారికికూడా చాలాకోపం వచ్చింది. అంటే ప్రతిపక్ష సభ్యులమీద చేసినటువంటి ఆక్షేపణ అన్నమాట. మొన్న ఎన్నికలలో 27 లక్షల ఓట్లు కమ్యూనిస్టు పార్టీకి వచ్చాయి. సీట్లు 14 వచ్చాయి. ఆ జన్మాంతము కాంగ్రెసుకు విరోధంగా ఉన్న ఎప్పుడూ గాంధిగారి పేరైనా చెప్పని, ఎప్పుడు ఖద్దరు జేబురుమాలైనా లేనివారిని అందరిని కలిపి లెక్క కట్టుకుంటే, కాంగ్రెసులో నుంచి లేచిపోయినవారిని అందరిని కూడదీసి లెక్క కట్టుకుంటే 42 లక్షలు వచ్చాయి. అయితే సీట్లకు ఓట్లకు ఏమైనా సంబంధం ఉన్నదా? 27 లక్షలు ఒక్క కమ్యూనిస్టు పార్టీ ఏకాకిగా నిలబడితే వచ్చి అంత ప్రజాసానుభూతి ఆంధ్ర రాష్ట్రంలో ఉండి సీట్లు తక్కువవస్తే దాని అర్థం ఏమిటి? ఇప్పుడు ఉన్నటువంటి ఎన్నికల తంత్రము ప్రకారం ఇలా జరిగింది. అంతేగాని ప్రజాభిప్రాయం 100 కి 40 పాళ్లు కమ్యూనిస్టు పార్టీ పక్షం ఉంది అని స్పష్టం అవుతోంది గదా? అందు

వలన హామాషా ఎన్నిక పద్ధతిలో ప్రజాభిప్రాయం ప్రతిబింభించడానికి సరైన అవకాశం ఉంది అనేటటువంటి ఉద్దేశ్యంతోటి ఈ proportional representation ప్రకారం ఎన్నికలు పంచాయితీ బోర్డు కైనాకూడా మనం pass చేయడానికి మనకు సర్వాధికారం ఉంది గనుక అటువంటి సవరణ ఈ బిల్లులో ఎందుచేత తీసుకు రాకూడదు అని వుచ్చల సత్యనారాయణగారు చెప్పారు. దానిలో ఆక్షేపించ వలసిందేమీ నాకు కన్పించలేదు. ఒకవేళ బాగుగా లేదంటారా, పోనీ experiment ప్రతిపక్షం చెప్పినందుకైనా చేసిచూడండి. ఎన్నిసార్లు experiment లు చేసి తప్పులు దిద్దుకోలేదు? మన మంత్రివర్గంయొక్క పద్ధతి "అయ్యవార్లంగారు తప్పులుచేసి దిద్దు కొంటున్నారు" అనే పద్ధతి ఉందికదా! ఇప్పుడు మొట్టమొదట ప్రెసిడెంటు directగా ఎన్నుకోవాలనే పద్ధతిగా మాత్రం పెట్టలేదా? పెట్టి మళ్లీ మార్చుకున్నారా లేదా! ఎన్ని అవునని ఎన్ని కావంటున్నారు? అందుచేత మళ్లీ ప్రతిపక్షానికి ఒక chance ఇచ్చి వీరు చెప్పిన పద్ధతికూడా ప్రవేశపెట్టచూస్తే దీనివల్ల ఎక్కువ ప్రమాదం కల్గినట్లయితే అప్పుడే మార్చి వేయవచ్చు. అంతమాత్రాన ప్రజాస్వామ్యము గుత్త కొన్నాముగా అని ఒక మంచి సూచన వచ్చినపుడు మంచో చెడ్డో దానిని గురించి శ్రద్ధగా ఆలోచించినట్లయితే బాగుంటుందిగాని, చెప్పిందల్లా తప్పే అని విమర్శచేయడం అన్నది అత్యంత న్యాయమైన పద్ధతికాదు. అయితే అసలు ఈ పంచాయ తీలు ఎక్కువగా పెట్టుతున్నందుకు ప్రభుత్వాన్ని తప్పకుండా హర్షించవలసిన విషయం. ఎందుచేత గ్రామ పంచాయతీ పరిపాలన నెలకొల్పాలని గ్రామీణ ప్రజలకు గ్రామ పరిపాలనా యంత్రంతో భాగస్వామ్యం కలుగజేయడానికి గ్రామ గ్రామపరిపాలనా దక్షత సమర్ధత గ్రామీణ ప్రజలకు అలవర్చుటకు తప్ప కుండా పంచాయతీలు రాష్ట్రంలో ఎక్కువగా నిర్మించవలసి ఉన్నది. అయితే ఆ గ్రామాలలో తగినసదుపాయాలు సౌకర్యాలు ప్రజలకు కలుగజేయడానికి తగినటువంటి ఆర్థిక స్తోమతుకూడా కల్పించవలసిన పూచీ ప్రభుత్వం మీద ఉంది. ముందు ఇప్పుడు ఈ 12½% తీసివేయటానికి 71-వ Section రద్దు చేశాం అన్నారు. అంటే 12½% Land Revenue తీసి వేస్తే లక్ష్మణ దాసుగారు చెప్పినట్లు ఉత్తరోత్తర Land Revenue అంతాకూడా గ్రామ పంచాయతీకి ఇచ్చే ఉద్దేశముందా? ఇప్పుడు క్రొత్తగా నిర్మిస్తున్న పంచాయతీలు వీటికి డబ్బు ఉండాలి అంటే, క్రొత్తగా ఏర్పడే Government కు మరీచిక్కు ఉంటుంది. అటువంటప్పుడు ఈ 12½% ఉదారంగా ప్రభుత్వం ఆ గ్రామ పంచాయతీలకు పంచిపెడితే బాగుంటుందా! ఇప్పుడు డబ్బు లేకుండా క్రొత్తగ నిర్మాణమయ్యే క్లిష్ట పరిస్థితులలోనే ఇవి తీసేసి ఎప్పుడో ఇస్తామంటే " బ్రతికి ఉండగా పాలు లేవు

గాని చచ్చిపోయిన తరువాత ఆవును దానం చేస్తాను అన్నాడట ఒకడు" ఎప్పుడో కొన్నాళ్లు పోయిన తరువాత ఇస్తాను, అంటే అది అర్థంలేని ధానం అన్న మాట. మంత్రివర్గం ప్రభుత్వ పక్షం యొక్క వాగ్దానం అట్లాగే ఉన్నదని చెప్తున్నాను. ప్రస్తుతం డబ్బు ఎక్కువగా అవసరమైన ప్రాథమికదశలో ఇప్పుడేమో ఎగవేసి, ఉత్తరోత్తర ఎప్పుడో ఇస్తామని అనడం న్యాయంకాదు. ఇదివరకు 12½ ఇస్తున్నది కూడ ఎగచెప్పేస్తున్నారు. పోనీ ఇంక auditor ను వేయవలసిందే. ఎందుచేతనంటే గ్రామాలలో ఎక్కువగా దుర్వినియోగం అవుతున్నది. ఆపంచాయతీబోర్డు ప్రెసిడెంటు చదువుకున్నవాడు అవుతాడో, కాడో, లేకపోతే ఏదో గుమస్తా ఉంటాడు. లెక్కలు తిప్పి వీడు గారడీచేయవచ్చు. దానివల్ల అక్కడకూడ కేసులు, నేనుకూడా న్యాయవాద వృత్తిలో ఉన్నాను. సె. 409 క్రింద చాలా కేసులు చూశాను. ఈ audit తప్పకుండా కావలసిందే. అందులో ఆక్షేపణ లేదు. అయితే ఈ ఖర్చు మళ్లీ ప్రభుత్వం పెట్టుకోదట. పంచాయతీలే పెట్టుకోవాలట. పంచాయతీబోర్డు ఎందుకు పెట్టుకోవాలి ? ఇప్పుడు కోర్టులలో చూడండి. కోర్టుఫీజు సరిగా మునసబుగారు వసూలు చేశారా లేదా, Sub Judge గారు సరిగ్గా వసూలు చేసారా లేదా, High Court, మీద Examiners ను వేస్తారు. వేస్తే వాళ్ల T. A., బేటా, వారిజీతంలంతా వాళ్లు Government servants కాబట్టి ప్రభుత్వమే భరిస్తుంది. అంతేగాని మునసబుగారు భరించడం లేదు. Lawyers అయినా భరించడంలేదు. అదేవిధంగా పంచాయతీబోర్డు ఎంతభరించాలి? Government భరించవచ్చు ఆ ఖర్చు. ఈ క్రొత్త ఖర్చు అంతా పంచాయతీబోర్డు మీద రుద్దడం, ఇస్తానన్న 12½% ఇవ్వకపోవడం ఇది శుద్ధ అన్యాయంగా కనుబడుతుంది. House tax విషయంలో shall అని ఉంది. అందులో అంటే విధి క్రింద తప్పకుండా విధించాలి. ఒక చుట్టు గుడిసె ఉంటుంది. అది almost Portable Type Writerలా మోసుకు పోవడానికి వీలు ఉంటుంది. దానికికూడా వేయవలసిందని ఈ Act ప్రకారం. అందుచేత అటువంటి విషయాలలో కొన్ని సందేహాలు ఉన్నాయి. ఇప్పుడు సత్యనారాయణగారు చెప్పినట్లు ఇది అనేక వేల గ్రామాలకు సంబంధించినటువంటి శాసనం కాబట్టి కొంచెము తాపీగానే ఆలోచించి pass చేస్తే మంచిది. ఇంతట్లో ఆవేశం ఎవరిమీద పడిపోయేది లేదు. కాబట్టి పరిశీలన సంఘాలను పంపడంలో తప్పేమిలేదు, అట్లా చేయడం సబబుగా ఉంటుందని మా ఉద్దేశ్యం.

SRI D. KONDAIAH CHOWDARY :—అధ్యక్షా, ఈ బిల్లు తెచ్చి నందుకు ప్రతిపక్షసభ్యులు ప్రముఖంగా 2, 3 విషయాలలో పదేపదే విమర్శిస్తున్నారు. ఎక్కువ విషయాలలో oppose చేసినప్పటికికూడ ముఖ్యమైనటువంటి కొన్నిటిలో మాత్రము ఎక్కువ తీవ్రంగా భేదాభిప్రాయాలు ఉన్నట్లుగా తెలుస్తుంది. అధ్యక్షుని ఎన్నుకొనే విషయములో మేమంతా ప్రజాస్వామ్యానికి భిన్నంగా ఉన్నామని, వాళ్లే ప్రజాస్వామ్యానికి సంరక్షకులుగా ఈ దేశంలో ఏర్పడినట్లు భావిస్తున్నారు. ప్రజాస్వామ్యంలో వారికి నమ్మకము మేము అనుకొనె దానికన్న నాలుగు రెట్లు ఉన్నదని ఇందాక సుందరయ్యగారు చెప్పారు. అసలు మీకు ప్రజాస్వామ్యమనేది ఉందా అని !

SRI P. SUNDARAYYA :—కాంగ్రెస్‌వాళ్లు అనుకున్న దానికన్న నాలుగు రెట్లు అదనంగా ఉన్నది.

SRI D. KONDIAH CHOWDARY :—కాంగ్రెస్‌వాళ్లు కమ్యూనిస్టులకు ప్రజాస్వామ్యంలో నమ్మకం సున్న (zero) అంటున్నారు. కాబట్టి మీకు $0 \times 4 = 0$ పెద్దసున్న అనే చెప్పవలసియున్నది. మీరు ప్రభుత్వమునకు రాలేదు కాబట్టి మీ ప్రజాస్వామ్యం ఎట్లుంటుందో తెలియదు కాని మీరు అధికారములోకి వచ్చిన దేశాలలో ప్రజాస్వామ్యం సున్నగానే ఉన్నది. కాబట్టి ఇక్కడ అధికారంలోకి వస్తే అంతకంటే పెద్ద సున్నగా ఉంటుందని మా అభిప్రాయము. ఇంక దాన్ని గురించి మనము అనుకోవలసిన అవసరంలేదు. ప్రత్యక్ష ఎన్నికలు ప్రజాస్వామ్యమునకు అనుగుణమా కాదా అనే విషయంలో అనేక రకాలైన అభిప్రాయాలు ఉన్నాయి. రాజకీయ శాస్త్రకోవిదులు అనేక రకాలైన అభిప్రాయాలు కలిగి ఉన్నారు. అనేక విధాల ఎన్నికలు జరుగుతున్నాయి ప్రజాస్వామ్యంలో, ఇంగ్లాండులో ఉండేటటువంటి ప్రజాస్వామ్య ఎన్నికల విధానంలో ఇక్కడ పంచాయతీబోర్డు ఎన్నికలు ఇదివరకు జరుగుతూ వచ్చాయికాని కొత్త పంచాయతీ చట్టములో కొంచము అమెరికన్ పద్ధతి ప్రవేశపెట్టారు. Checks and balances వల్ల, ఇంక ఎక్కువ ప్రజాస్వామ్యం స్థిరం అవుతుందని అభిప్రాయము ఉన్నది. కాని అసలు patient చచ్చిపోయేటటువంటి క్రొత్తమందును మనవాళ్లు ప్రతిపాదిస్తున్నారు. ఈ proportional representation అనేది ఎందువల్ల వాళ్లు ప్రవేశపెట్టమని అంటున్నారో నాకు తెలియును. France ప్రభుత్వములో దాదాపు ఈ proportional representation ఉన్నది. అందువల్ల అక్కడ కమ్యూనిస్టులు పైవిధానం కీలకస్థానాలలో 30% సంపాదించుకొని నాటకాలు ఆడుతూ ప్రభుత్వాన్ని పతనం చేస్తున్నారు. కాబట్టి ఇక్కడకూడా ప్రతి గ్రామంలో

ఈ proportional representation పద్ధతి పెట్టి ఇక్కడకూడా ప్రభుత్వాన్ని స్తంభింప చేయాలనే ఉద్దేశంతో ఆ విధంగా చెపుతున్నారుగాని అనుభవం దృష్ట్యా ఈ ప్రజాస్వామ్య విధానంలో proportional representation సాధ్యం కాదని, న్యాయం కాదని దానితో సుస్థిరమైన ప్రభుత్వం ఏర్పడజాలదని నా అభిప్రాయము. France లో అనుభవం దృష్ట్యాకూడ మనం తెలుసుకొన్నాము కాబట్టి అది ఏ పరిస్థితులలోనైన ఈ దేశంలో ప్రవేశపెడితే గ్రామ పరిపాలన తారుమారవుతుంది. ఈ తారుమారయ్యే పద్ధతి కమ్యూనిస్టులుఎప్పుడూ కోరుతూ ఉంటారు కాబట్టి ఈ పద్ధతి ఇక్కడ పెట్టడానికి మాత్రం వీలులేదని మనవి చేస్తున్నాను. అయితే direct elections మంచిదా లేకపోతే మెంబర్లద్వారా ఎన్నుకొన్నే పద్ధతి మంచిదా అనే విషయమును గురించి చెప్పవలసిన సందర్భంలో ఒక ఉదాహరణ చెప్పదలచాను. మా జిల్లాలోని కనిగిరిలో Major Panchayat ఉన్నది. అక్కడ President కమ్యూనిస్టు, Members Socialists ఉండడంవల్ల నిత్యం పరిపాలన స్తంభించడం, ప్రతి రోజూ ఒకరిమీద ఒకరు petitions పెట్టడం 40 వేలు ఆదాయం వచ్చేటటువంటి పంచాయితీలో ఒక పనికూడ జరుగకపోవడం దానివల్ల పరిపాలన సక్రమంగా జరుగకపోవడం చూస్తున్నాము. అందువల్ల ఈ విధానము మంచిదికాదని అనుభవము దృష్ట్యా తెలుసుకొన్నాము. కాబట్టి మనదేశంలో పార్లమెంటు ఎన్నికలు రాష్ట్ర ప్రభుత్వాల ఎన్నికలు ప్రజాస్వామ్యానికి అనుగుణంగా ఏ విధంగా జరుగుతున్నాయో పంచాయితీలనుకూడ అదే విధంగా ఏర్పాటు చేయాలనే ఉద్దేశంతో ప్రభుత్వంవారు ఈ సవరణ తెచ్చారు. అనుభవం దృష్ట్యా మనకు పురాతనం నుంచి ఉన్నటువంటి పద్ధతే మెరుగ్గా ఉన్నదని తెలుసుకొన్న దానివల్ల ఈరోజు ఈ సవరణ తెచ్చారు. దీన్ని అట్టే ప్రతిఘటించ వలసిన అవసరంలేదు. అంతేకాక, wards కూడా సక్రమంగా చేయడంలేదు. blocks లో ఒక్కొక్క చోట బీదవాళ్లను తీసుకువచ్చి భాగ్యవంతులతో చేర్చి blocks అంతా తారుమారు చేస్తున్నారనడానికికూడఅవకాశంలేదు. ఎందువల్లనంటే చేసిన blocks ను Gazette లో notify చేస్తారు. దీనివల్ల ఏదైనా objections ఉంటే పెట్టుకోవచ్చు. అది ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చి సర్దుబాటు చేసుకోడానికి అవకాశం ఉన్నది. కాబట్టి ప్రతి విషయంలోకూడ, ప్రభుత్వం ఏదో చేసిందని, కేవలం అది ధనికులకొరకు చేస్తున్నారని ఊరికే పదేపదే platform మీద ఉపన్యాసాలు చెప్పినందువల్ల ప్రజలు నమ్మేది ఏమిలేదు. Gazette notification చేసినపిదప అందులో ఏదైనా అక్రమాలు, అవకతవకలు జరిగితే, అవి ప్రభుత్వ దృష్టికి తీసుకురావడానికి అవకాశం ఉన్నది. కాబట్టి దాన్ని గురించి అట్టే విమర్శించ వలసిన అవసరంలేదని మనవిచేస్తున్నాను.

ఇక పంచాయతీలకు 12½% ఇచ్చేవిషయంలో మనమందరము ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో ఉన్నప్పుడు Land Revenue లో 12½ percent పంచాయితీలకు ఇవ్వవలసియుంటుందని తీర్మానం చేశారు. కాని ఆరోజు ఉమ్మడి మద్రాసు రాష్ట్రము యొక్క ఆర్థిక పరిస్థితి అంతలోటుగా గాని, అంత surplus గా గాని లేకుండా ఒక రకమైనటువంటి, balanced (సరిపోయేటటువంటి) budget గా ఉంటూ వచ్చింది. అందువల్ల అప్పుడు పంచాయితీ పరిపాలన సక్రమంగా జరుగుటకై 12½ per cent Land Revenue ఇచ్చినాకూడ పరవాలేదు అనుకొన్నారు. అంతే గాక, అక్కడ మద్రాసు రాష్ట్రములో 8 కోట్ల రూపాయలు మాత్రమే land revenue క్రింద వస్తూ ఉండినది కాబట్టి, ఈ 12½ percent పంచినందువల్ల, అట్టే ప్రభుత్వానికి నష్టంరాదు. కనుక పంచాయితీలు సక్రమంగా నడపడానికని ఆ విధంగా ఇవ్వదలించింది. ఈ సందర్భంలో ఇంకొక విషయం గమనించాలి. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో Land Revenue ముఖ్యమైనటువంటి ఆదాయము కాదు. కాని ఆంధ్రరాష్ట్రములో Land Revenue ప్రధాన పద్దుగా ఉన్నదనే సంగతి మన మిత్రులు తెలుసుకోవాలని మనవిచేస్తున్నాను. ఇక్కడ Land Revenue లో 12½ percent ఇస్తే, చాలా డబ్బు ఇవ్వవలసివస్తుంది. దీనివల్ల మనకు ఉండేటటువంటి లోటు ఇంక ఎక్కువ అవుతుంది. కాబట్టి మనకున్నటువంటి పరిస్థితులనుబట్టి ఇది ఇవ్వడానికి వీలులేదని చెప్పుతున్నారు. అంతేగాని మరే ఉద్దేశంతో కాదు అని ప్రతిపక్ష సభ్యులకు మనవిచేస్తున్నాను. అయితే భవిష్యత్తులో మనకు ఇతరవిధమైనటువంటి ఆదాయము అభివృద్ధి చెందినప్పుడు, Industries అభివృద్ధిచెంది తద్వారా Sales Tax మొదలైన వాటివల్ల మన ఆదాయం పెరిగినప్పుడు, ప్రభుత్వము ఈ 12½ percent ఇవ్వవచ్చుకదా, ఇపుడెందుకు దాన్నిగురించి సవరణ తీసుకురావలసిన అవసరం వచ్చింది అంటే Panchayat Act లో ఇది mandatory గా ఉన్నది. ప్రభుత్వము ఇవ్వవలెను అని ఉన్నది. ఒకవేళ ఎవరైనా "ఎందుకు ఇవ్వరు, నేను High Court కు పోతాను, Civil Court లో దావావేస్తాను" అంటే, అప్పుడు ఇవ్వక తప్పదు. అందువల్లనే ఈ సవరణ తీసుకురావలసివచ్చింది. కాబట్టి, ఇదివరకు ఇవ్వలేదు, ఇక ఇవ్వబోరు గనుక ఈ సవరణ ఎందుకు అనేటటువంటి దానికి అర్థంలేదు. Clause Mandatory గా ఉన్నది కాబట్టి, కోర్టులో ఎవరైనా దావాచేస్తే ప్రభుత్వము బాధ్యత వహించి తప్పకుండా ఇవ్వవలసివస్తుంది. మనకు ఉన్న ఆర్థికలోటునుబట్టి అట్లా ఇవ్వడానికి సాధ్యంకాదు కాబట్టి ఆ clause ను తీసివేయవలసివచ్చింది. అంతేగాని మంత్రిగారికి వేరే పనిలేదు గనుక ఈ సవరణలు ఊరకే తెస్తూఉంటారు అని అనుకోకూడదు. Legal difficulty ఉన్నది కాబట్టి ఇది తీసుకురావలసి వచ్చింది.

తరువాత ఈ elections విషయంలో ప్రథమంలోనే విశ్వేశ్వరరావుగారు చెప్పారు. Special officer ను వేస్తే, ఈ ఎన్నికలు ఎన్నిరోజులైనా వాయిదా వేస్తూ పోతూ ఉండవచ్చు అని, దానికి సమాధానం వారు ఆ clause చూస్తే తెలుస్తుంది. ప్రథమంలో పంచాయితీ ఏర్పాటు చేసేటప్పుడు ఒక్కసారే Special Officer ను appoint చేయడం జరుగుతుందని, అవసరమని తోచినప్పుడు, elections జరుప వీలులేని పక్షములోనే, ఎన్నికలు వాయిదా వేయడం జరుగుతుందని Act లో ఉన్నది. అంతేగాని, ఇది ఒక పెద్ద order of the day అవుతుందని, ఎల్లకాలము Inspector of Local Boards ఎన్నికలు జరుపకుండా వాయిదా వేస్తూంటారని గాని అనుకోవటం తప్పు.

తరవాత Cart tax గురించి అది optional అని అన్నారు. Optional అంటె అర్థం ఏమిటి? శాసనంలో ఉండే ప్రతి అక్షరాన్ని అర్థంచేసుకోకుండా, ఒకవేళ అర్థం తెలిసినా, తెలియనట్లు నటిస్తూ ఉంటె మాత్రం మేము ఏమి చేయలేము, దానికి. ఎందువల్లనంటే, దీంట్లో భావము విశదంగానే ఉంది. Optional అంటె ఇష్టము ఉంటే వేసుకోవచ్చును అని అర్థము, Cart tax అనే పదాలు ఉన్నంతమాత్రాన, అది బారుకే వేస్తున్నారు. అంటే మేము ఏం చెయ్యాలి? పంచాయితీ తమంతట తాము వేసుకొనే పన్ను అది. వాళ్లు ఇష్టం ఉంటే వేసుకోవచ్చును, లేకపోతేలేదు. కొన్ని పంచాయితీలు విధించాలి, అనే అభిప్రాయంతో ఉన్నాయి. కొన్ని పంచాయితీలు అది విధించడానికి ఇష్టంలేకుండా ఉన్నాయి. కావలసినప్పుడు వేసుకొనేందుకు అవకాశం ఉంటుంది. కాబట్టి ఆ రకంగా చట్టాన్ని సవరించారు. అంతమాత్రంచేత పంచాయితీ బోర్డు ప్రతిదానికి పన్ను వేస్తున్నారనుకోవడం పొరబాటు. ఇంటికి పన్ను, జుట్టుకు పన్ను, అన్నిటికి పన్ను వేస్తున్నారని విశ్వేశ్వరరావుగారు చెప్పారు. అయితే నేను ఒక విషయం మనవిచేస్తున్నాను. పంచాయితీ బోర్డు పరిపుష్టంగా ఉండాలంటే, నిజంగా వాళ్లు అక్కడ local గా ధనం సేకరించాలి, వాళ్ల పనులకు ఉపయోగించాలి. గాని ప్రభుత్వమునుంచి ధనం తీసుకొంటే, ప్రభుత్వానికి మాత్రం ఎక్కడనుండి వస్తుంది? ప్రభుత్వము మరల వాళ్లమీదే పన్నులు వేయవలసి ఉంటుంది. అటువంటప్పుడు, ధనాన్ని ఆవిధంగా, indirect గా ప్రభుత్వంనుంచి తీసుకువచ్చేదానికన్నా, వారే పన్నులద్వారా డబ్బు సేకరించుకొని, తమ డబ్బును తామే ఖర్చుపెట్టుకొంటే చాలాబాగుంటుంది. ప్రభుత్వము వద్ద తీసికొనడమనేది గౌరవప్రదమైన పనికాదు. అంతేకాకుండా ప్రభుత్వము ఎప్పుడో ఇస్తుందనే హామీ ఏమీలేదు. మనం ప్రభుత్వం వద్దనుంచి తీసుకొన్నప్పటికీకూడ, వారు మరల దానికొరకు ప్రజలమీద పన్నులు వేయకతప్పదు. కాబట్టి పంచాయితీ పన్నులు వేసినట్లయితే, ఆ డబ్బు తమకే చెందుతుంది. దాన్ని

తమ ఇష్టమైన పనులకు వినియోగించుకోవచ్చు. ఆ విధంగా పంచాయితీ పాలన సాగిస్తే చాలా బాగుగాను, అభివృద్ధికరంగాను ఉంటుంది. కనుక దాన్నిగురించి అక్షేపణ పడవలసిన అవసరంలేదని మనవిచేస్తున్నాను.

Mr. DEPUTY SPEAKER:—సభ 2-30 గంటలకు తిరిగి సమావేశ మౌతుంది.

AFTER LUNCH 2-30 p.m.

Sri SHEIK MOULA SAHIB :—అధ్యక్షా, ప్రపంచములో వేల కొలది సంవత్సరాలనుంచి పరిపాలిస్తున్న అగ్రరాజకీయ వేత్తలను దిగ్భ్రమము గావించేటట్లు చేసిన మన పంచాయితీ రాజ్యముయొక్క చట్టములోని సవరణలను, ప్రతిపాదనలను, ఇప్పుడు మంత్రిగారు తెచ్చిన బిల్లునూ నేను బలపరుస్తున్నాను. కాని ఈ పంచాయితీరాజ్యముయొక్క ఉద్దేశ్యము యేమిటంటే, ప్రభుత్వ పరిపాలనలో ఎంతో భారము తగ్గించుకొని ప్రజలకు అటువంటి పరిపాలనా విధానము కొంతవరకైనా చేకూరేటట్లు చేస్తే అట్టి ప్రభుత్వము ఆ చంద్రార్కస్థాయిగ నిలుస్తుందనే వుద్దేశ్యముతో మహాత్మా గాంధీజీ పంచాయతీ రాజ్యమును స్థాపించారు. ఈ నాడు పంచాయితీలలో ఏ లోపాలు లేకుండా చేయాలని ప్రభుత్వం తలపెట్టింది. వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా మేజరు పంచాయితీలలోకూడ కొన్ని లోపాలుండటం ప్రభుత్వం కనిపెట్టింది. అందువల్ల మంత్రిగారు తెచ్చిన ఈ సవరణ చట్టాన్ని చక్కగా అమలుజరిగేటట్లు చేస్తారని నేను భావిస్తున్నాను. ఈనాడు మంత్రిగారు తెచ్చిన సవరణనుబట్టి పంచాయితీబోర్డులకు ప్రజా ప్రతినిధులుగ ప్రజలవల్ల సభ్యులను ఎన్నుకోవడం, సభ్యులలోనుంచి అధ్యక్షుణ్ణి ఎన్నుకోవడం జరుగుతుంది. Major Panchayats గ్రామాలలో సాధారణముగ 10 వేల జనాభాకు తక్కువ వుండదు. 5000 రూపాయ పైబడిన ఆదాయముండి, 5 వేల జనాభాకు పైబడివున్న గ్రామ పంచాయితీలకు, ప్రభుత్వము,Executive Officers ను వేస్తున్నారు. ఈ పంచాయితీబోర్డులకు ప్రభుత్వము ఎప్పుడైతే పరిపాలనా నిర్వహణకు Executive Officers ను ఏర్పాటు చేసిందో ఆనాటినుంచి, Executive Officers వల్ల నిరంకుశ పరిపాలన చేయబడుతుంది. ఈ విధమైన నిరంకుశ పరిపాలనా విధానము ప్రభుత్వము అవలంభించుట ప్రజాస్వామ్య పద్ధతులలో పరిపాలన జరగకుండ ప్రభుత్వము దిక్కరించినట్లు అవుతున్నది. పంచాయితీబోర్డులకు Ex cutive Officers ను నియమించుటవల్ల వారు నిరంకుశ పరిపాలన సాగిస్తు సర్వాధికారులుగా తమయిష్టంవచ్చినట్లు పన్నులు విధించటము జరుగుతున్నది. ఈ విధంగా వేసే పన్నుల విధానములవలన ప్రజలకున్నూ ప్రభుత్వానికిన్నీ చాలదూరమయ్యే

Sri Sheik Moula Sahib] [6th December 1955

విధానములు జరుపబడుతున్నవి. గ్రామ పంచాయితీలలో ఇళ్ళకు పన్నులుగూడ చెల్లించుకోలేనంత బీద ప్రజలు వుంటున్నారు. Executive Officers నిరంకుశ తత్వముతో పన్నులు వేసినప్పుడు, అక్రమ పన్నులు వేసినచోట్లు పేద ప్రజలు, తాము ఎన్నుకున్న ప్రతినిధులద్వారా, తమయిబ్బందుల గురించి, Executive Officers కు అవి తొలగించాలని చెప్పుకోడానికి వీలు లేకుండాపోతున్నది. Executive Officers కు గాని ప్రభుత్వానికిగాని, అక్రమముగ వేసిన అధికపన్నులను తొలగించాలని, చెప్పుకోటానికిగూడ అవకాశములేకుండా వుంటున్నది. పేద ప్రజలు తమ ప్రతినిధులుద్వారా చెప్పుకొనే సాక్ష్యం కంటేయింకా ఎవరి సాక్ష్యం కావలెనో అర్ధముగాకుండావున్నది. Executive Officers కు చెప్పుకుంటే వారు వినకుండా పోతున్నప్పుడు ప్రభుత్వానికైనా చెప్పుకుంటే, చట్టము క్రింద Executive Officers సర్వాధికారి అని, ఆయన తప్పేమీ చేయగలిగింది ఏమి లేదని, ప్రభుత్వము జవాబు చెప్పుచున్నది. ఈనాడు పంచాయితీబోర్డుల పరిపాలనకు గాను సవరణ బిల్లును, ప్రవేశ పెట్టిన మన స్థానిక సంస్థల మంత్రిగారు పన్నుల Revision ను గురించి ప్రజలలో జరిగే ఆందోళనను గుర్తించి నిన్ననే Bill ను ప్రతిపాదించే సమయములో జవాబు యిచ్చారు. కనిగిరి పంచాయితీ E. O. వేసిన అక్రమయిండ్లపన్ను మంత్రిగారివలన నియమించబడిన Executive Officers వల్ల కలిగే లోపాలను సవరించటానికి స్థానిక సంస్థల మంత్రిగారికి అధికారము లేకుండవున్నదని మంత్రిగారు చెప్పడం శోచనీయము. పంచాయితీబోర్డుల పరిపాలనలో Executive Officers కు యిచ్చే జీతము భరించేది ఎవరు ? ఆ డబ్బు యిచ్చేది ఎక్కడనుంచి ? Executive Officers పైన అధికారాలు ఎవరు నిర్వహిస్తున్నారు ? ఈ విషయాలన్నింటిలో ఏ విధమైన నిర్ణయమూ లేకుండవున్నది. కాబట్టి Executive Officers లో వుండేలోపాలు సవరించటానికి స్థానిక సంస్థల మంత్రిగారికి యీవత్తు అధికారాలు వుండేటట్లుగా ఈ చట్టమును సవరించాలని కోరుతున్నాను. Executive Officers కు పంచాయితీబోర్డుల పరిపాలనా నిర్వహణలో సర్వాధికారము యిచ్చినట్లయితే, పంచాయితీ గ్రామాలలోవుండే పేద ప్రజలకు చాల యిబ్బందులు ప్రభుత్వము కలుగజేసినట్లు అవుతుంది. Executive Officers కు బదులు Supervisors అనే పేరుగ మార్చాలి. పంచాయతీబోర్డువారు నిర్ణయించే తీర్మానాల ద్వారా Board కిచ్చే డబ్బు, Board ద్వారానే ఖర్చు పెట్టించాలి గాని, ఈ అధికారము Executive Officers కు ఇవ్వగూడదు. ఈ ఆఫీసర్లను Board తరఫున paid servants గా చేసేవారు, Board కు జవాబుదారీ గా డబ్బు విషయము చూచేటట్లు చేస్తే Executive Officers వల్ల అక్రమచర్యలు గాని, అన్యాయాలుగాని, వుండనేరవు. Executive Officers పంచాయతీబోర్డు

డబ్బునుగురించి, క్రమ పద్ధతిలో లెక్కలు వ్రాస్తూ కాపాడుతూవుండాలి. ఆ విధంగా చేసినప్పుడు అది నిజమైన ప్రజాపరిపాలన అవుతుంది. ఈనాడు జరిగే పరిపాలన విధానము చూస్తే అటు Executive Officers కు గాని Boardకు గాని, యిటు ప్రజలకుగాని మధ్య ఏలాంటి సంబంధము లేకుండా ప్రజలయందు నిర్లక్ష్యభావము నిర్ధాక్షిణ్యము, చూపించటం కనబడుతున్నది. ఈ విధముగా Executive Officers ప్రవర్తిస్తే ప్రజలకు ప్రభుత్వంమీదవున్నటువంటి విశ్వాసము తప్పకుండా ప్రభుత్వము కోల్పోతుందని చెప్పక తప్పదు. ముఖ్యంగా యిటువంటి విధానమువలన ప్రభుత్వానికి వున్న పేరు ప్రతిష్టలు భగ్నము కాకతప్పదు. ప్రభుత్వముమీద విశ్వాసము వుండాలంటే Boardల పరిపాలనా విధానము ప్రజలచేత ఎన్నుకున్న సభ్యులు, ప్రెసిడెంటు నిర్వహింపచేయాలి. దీనిలోవున్న నిజానిజములు, ప్రభుత్వమే గుర్తించాలి. Executive Officers నిర్ణయించిన పన్నులకు appeal అధికారము Boardకు వున్నది కాబట్టి Boardకే appeal చేసుకోమని ప్రభుత్వమువారు అంటున్నారు. Appealకు ఒక రూపాయి stamp duty కట్టాలని Billలో ఏర్పడుతున్నది. ఒక పేదవాని యింటిమీద పది రూపాయిలు పన్ను విధించినప్పుడు stamp duty క్రింద ఆ ఒక్క రూపాయిగూడ చెల్లించుకునే శక్తిలేని ఆ పేద వాడికి 10 రూ॥లు యిళ్ళ పన్నువేస్తే, appeal చేసుకోడానికి ముందు, పంచాయితీ బోర్డుకు, 10 రూ॥లు పన్నుచెల్లించి, ఆ తరువాతనే appeal చేయవలెనని బిల్లుద్వారా బోధపడుతున్నది. ఈ విధముగా అప్పీలు చేసుకునే పద్ధతి పేదవానికి ఎంత మాత్రము సహాయపడదు. పేదవాళ్లయిబ్బందులు ప్రభుత్వము తొలిగిస్తుందని ఆశిస్తున్నారు. ఈ పద్ధతిలో కాకుండ appeal చేయటానికి వీలుగా, Board కు ముందుగనే పన్నుకట్టకుండావుండేటట్లు చట్టమును సవరించాలి. ఒక్క రూపాయి stamp duty కట్టుకోలేని పేదవాడు 10 రూపాయిల పన్నుముందు చెల్లించి అటుతరువాత appeal చేయమంటే అతను ఆ 10 రూపాయిలు ఎక్కడనుంచి తెచ్చి కట్టుకోగలడు ? ఈ విషయము ప్రభుత్వము ముఖ్యంగా గుర్తించాలి. Appeal పద్ధతిమార్చటానికి పంచాయితీ చట్టం సవరించక పోతే గ్రామాల్లోవుండే పేదవాళ్లు అనేక యిబ్బందులకు గురి అవుతారు. నిరంకుశ పరిపాలకుని ప్రభుత్వమే బలపరిచినట్లు అవుతుందని మంత్రిగారికి విన్నవిస్తున్నాను. కాబట్టి మంత్రిగారు ఈ నిరంకుశ పరిపాలన తొలగిస్తూ ప్రజాపరిపాలనవుండేటట్లు చేయడానికి మంత్రిగారు తెచ్చిన సవరణ బిల్లును తగినట్లుగా సవరించుతారని ఆశిస్తు యీనాడు మంత్రిగారు ప్రవేశపెట్టిన బిల్లును, నేను హృదయపూర్వకముగ బలపరుస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ బిల్లులోని మొత్తము మీద ప్రతి అంశముగూడ వ్యతిరేకించవలసి వస్తున్నది. పరిపాలనలో మార్పువస్తుందని అనుకుంటున్నాము. మార్పువస్తున్నది నిజమే. రోజులు మారినవి అక్కడ చెప్పినట్లు అక్కడ అవి మంచికే మారినవనిగాని యిక్కడ మాత్రము చెడుకుమారినవని చెప్పక తప్పదు. Interruption Difference of opinion ప్రతివారికి వుంటుంది. అవును difference of opinion వున్నది. ప్రపంచములో వివాద గ్రస్తమైన విషయాలుఅన్నీకూడా difference of opinion తోటే వుంటున్నవి. ప్రభుత్వము యిదివరకు యీ విషయములోమంత్రి చంద్రమౌళి గారు ఒక బిల్లుతెచ్చిన సందర్భములో పంచాయతీ బోర్డులకు direct elections పెట్టి ఏర్పాటుచేస్తే బాగుంటుందని బిల్లు తెచ్చారు. అందరం అప్పుడు అభినందించాం. ఈనాడు దీనికి వారు ఒప్పుకుంటే, ఆబిల్లు తేవటములో వారు తప్పుచేశామన్నా ఒప్పుకోవాలి, లేకపోతే, వారికి ఇందుకు, యిష్టములేదనన్నా చెప్పాలి. ప్రస్తుతము యిక్కడ మంత్రి చంద్రమౌళిగారులేరు. వారు యీ సమయములో వున్నా, లేకపోయినా, యిప్పుడు నాకు అది సమస్యకాదు. వారు తెచ్చిన బిల్లు మంచికే తెచ్చారు. దానిని మేము ఆరోజున బలపరచాముకూడా. Direct Elections పెట్టటము బాగానే వున్నదని మేము అన్నాము కాని కొంతమంది మిత్రులు కాదనికూడ చెప్పారు. మిత్రులు మాతో వాదించగా అవిధంగా మేము మంచిదేనన్నాము. Direct Elections పెట్టడము మంచిదే, బాగానే వుంటుందని మేము అందరమూ మాత్రము అనుకున్నాము. కాని యీనాడు అటువంటి పద్ధతిని తొలగించి బిల్లును తీసుకొనిరావడము చాలా అన్యాయమని చెప్పక తప్పదు. ఇప్పుడు మేము దీన్ని ప్రతిఘటించక తప్పదు.

ఇకపోతే రెండవది పంచాయితీ బోర్డులకు వచ్చే ఆదాయము విషయము వున్నది. పంచాయితీ బోర్డులకు డబ్బులేదని అనుకుంటున్నప్పుడు, యిక అది వచ్చే మార్గాలు యేమిటి అని ప్రభుత్వం ఆలోచిస్తున్నది. దీనికోసం కేంద్ర ప్రభుత్వం ఒక కమిటీని వేశారు. కాంగ్రెసు సంస్థగూడా Local Finance Committee అని కట్జూగారి అధ్యక్షత క్రింద ఒక కమిటీని వేశారు. వారు రిపోర్టు తయారు చేస్తూ పంచాయితీ బోర్డులను అభివృద్ధి పరచాలి అని ఆ కమిటీవారు వ్రాశారు. ఆదాయము రావటానికి రాష్ట్ర ప్రభుత్వాలకు ఎంతెంత ఆదాయము వస్తున్నదో, అందులోనుంచి ఆయా రాష్ట్రాలలో పంచాయితీ బోర్డులకు ఎంతెంత యిస్తున్నారో కూడా వ్రాశారు. నాకు యిప్పుడు time చాలా తక్కువ వుందని భయపడుతూనే

మాట్లాడుతున్నాను. మద్రాసు రాష్ట్రములో Land Revenue లో నుంచి మన మాదిరిగానే యిస్తున్నారు. బొంబాయిలో 15%, పంజాబులో యిదివరకు 10%, యిప్పుడు యింకా ఎక్కువగా యిస్తున్నట్లు తెలుస్తున్నది. హైదరాబాదులో 15%, సౌరాష్ట్రలో C. Class కు 17½%, B. Class కు 25%, A. Class కు 33⅓%. మైసూరు రాష్ట్రములో 12½%, మధ్య ప్రదేశ్‌లో మనము యిదివరకు యిచ్చినట్లుగా 6%, పెప్సూలో 1/10%, కాశ్మీరులో Village Cess Fund మొత్తము అంతా యిస్తున్నారు. ఈ కమిటీ అన్ని విషయాలు విచారించి, అన్ని రాష్ట్రాల స్థానిక పరిపాలనా మంత్రులనందరిని సమావేశ పరచారు. వారందరిని విచారించిన మీదట ఆ కమిటీవారు యీవిధంగా వ్రాశారు. వారు వ్రాసింది "They also recommended that all State Governments should assign a suitable portion of their land revenue" అని వ్రాశారు. ఇది ఆ కమిటీ proceedings లో 85 వ పేజీలో వున్నది. మంత్రిగారుగూడా చదువుకోవచ్చును. కనుక ప్రతి రాష్ట్రమునూ యీవిధంగా యిస్తున్నప్పుడు, మనము యిక్కడ యిచ్చేదికూడా తీసివేస్తున్నాము. ఈవిధంగా చేయడము చాలా అన్యాయము. పంచాయతీ బోర్డులకు యింకా ఎక్కువ సౌకర్యాలు కలుగజేయాలనికూడా వ్రాశారు. ఇంకా యీ విషయములో ఎక్కువ details కావాలంటే యివ్వగలను కాని యిప్పుడు నాకు టైములేదు. కాబట్టి యిప్పుడు నేను అందులోకి పోదలచలేదు.

ఇకపోతే పంచాయితీ బోర్డులకు ఎన్నికల విషయము ఒకటి వున్నది. ఇదివరకు ప్రెసిడెంటు ఎలెక్షను అక్కడక్కడ జరిగినది. ఆ ఎలెక్షన్సు అన్నీ న్యాయముగా లేవు అని అన్నప్పుడు, యిప్పటికి రెండు మూడు సంవత్సరాలనుంచి యీ ఎలెక్షన్సు రాకుండా చేశారు. ప్రభుత్వము బహుశ ఏదో మనస్సులో పెట్టుకుని, direct elections పెట్టినట్లయితే, మంత్రిగారు వారియొక్క పార్టీవారు వస్తారో రారో అనే అనుమానంతో, యీ ఎలెక్షన్సును రాకుండా చేస్తున్నారని ప్రజలు అనుమానిస్తున్నారు. నామటుకు నేను మంత్రిగారుమీద అటువంటి నిందారోపణ వేయదలచలేదుగాని, పైకి మాత్రము యీ ఎలెక్షన్సు పెట్టినందువల్ల ప్రజలు మాత్రం ఆ విధంగా అనుమానము పడుతున్నారని మాత్రం నేను చెప్పకతప్పదు. అటువంటి అనుమానాలు ప్రజలలో లేకుండా ప్రభుత్వం సరిదిద్దుకోవలసివుంటుంది.

తరువాత private market licences యివ్వడము అనేది వున్నది. ఇక వాటి విషయములో వివరాలు, రూల్సులోనికిపోతే, అవి అన్నీ యిప్పుడు అర్థము కాదేమోనని అనుకుంటాను. ఈనాడు private markets కు పంచాయితీ బోర్డులు licences యివ్వటములో వారి యిష్టమువచ్చినట్లుగా యివ్వడము చాలా

Sri Vavilala Gopalakrishnayya] [6th December 1955

చోట్ల జరుగుచున్నది. అటువంటిది control చేయడము అవసరమేకాని, వాటిని control చేస్తే ప్రజా సౌకర్యాలకు ఏమైనా ఉపయోగపడుతుందా? లేకపోతే యిది యితరులను యిబ్బందిపరచటానికి ఉపయోగపడుతుందా, లేకపోతే, యిది పూర్తిగా Executive Officers ను బాగుపరచటానికి వుపయోగిస్తుందా? గనుక యిటువంటివి చిక్కులు చాలా వుంటవి. వాటి విషయములో క్లాజువారిచర్చ జరిగేటప్పుడు అన్ని విషయాలు మాట్లాడదలచాను. ఇప్పుడు ఆ details లోకి నేను పోదలచుకోలేదు.

కొత్తగా పంచాయితీ బోర్డులను ఏర్పరచడంలో, వార్డుల విభజన చేయడములో అవకతవకలు జరుగుతున్నాయని చెప్పకతప్పదు. అన్నింటిలో జరుగుతున్నాయో లేదోగాని, కొన్నింటిలో తప్పకుండా జరుగుతున్నాయి. ఒకచోట ఒక వార్డు మొత్తములో ఒక్క హరిజనుడుకూడా లేడు. ఆ వార్డుకి హరిజన రిజర్వుడు సీటు ఇచ్చారు. అభ్యర్థికైనా పనికి వచ్చేందుకు పొరబాటున ఒక్కడైనా దొరుకుతాడేమో నని అంటే కనబడడు. అటువంటి చోట రిజర్వుడు సీటు ఎట్లా వచ్చిందో తెలియదు. అసలు రిజర్వుడుసీటు అనేది పెట్టేటప్పుడు దానికి సంబంధించిన కులాలవారు అక్కడ ఎక్కువగా ఉంటేనే పెడుతారు. Backward tribes అనేది గుంటూరు జిల్లాలో ఒక గ్రామం సంగతి చెబుతున్నా కాని అక్కడ Backward Class వారు ఎవ్వరూలేరు. అందువల్ల అక్కడ రిజర్వ సీటు అనేది ఉండదు. అసలు బిల్లు తేకుండా ఉండడము చాల మంచిది. తెస్తాము అంటూరా సెలక్టు కమిటీకి పంపిస్తే వారు తేల్చిన తరువాత మనం వివరంగా చెప్పడానికి వీలవుతుంది. ఈవిధముగా పంచాయితీలకు అధికారం ఇస్తారని, ఆలోచిస్తున్నారు. జిల్లా బోర్డులు అసలు అక్కరలేదని మనమిత్రులు చెబుతున్నారు. ఇది చాలా తప్పు అని చెబుతున్నాను. అయితే ఇది సందర్భముకాదుకాని, వారు చెప్పినందువల్ల చెప్పాల్సి వస్తున్నది. చాలా intermediary గా ఉండాలని మంత్రులు సమావేశము ఖచ్చితంగా చెప్పి ఉన్నది. అది మీరు ఎవరూ మరచిపోవద్దని చెబుతున్నాను.

"The opinion of the Select Committee was that there should be an intermediary unit of Self-Government between Panchayats and the State."

అని పంచాయితీ కమిటిలో చెప్పి ఉన్నారు. Intermediary జిల్లాబోర్డులను తీసుకోవాలనేది ఇక్కడ సందర్భముకాకపోయినా సందర్భము వచ్చినందుకు చెప్పాను. పంచాయితీబోర్డులకు పూర్తిగా అధికారము ఇవ్వాలనే దీంట్లో పూర్తిగా మీతో ఏకీభవిస్తాను. ఇంతకన్నా ఎక్కువ ఇవ్వాలి. అది ఇప్పుడు చెడిపోతున్నాయి,

అంటారా నాకేమి ఆ బాధలేదు. Democracyలో కొన్ని వ్యవస్థలుపెట్టాల్సి వస్తున్నది. అది ఏమైనా మనవాళ్లు చేసినదానికి చైతన్యము కలిగించి, వాళ్లచేతే మార్పు చేయించడానికి ప్రయత్నించాల్సి ఉన్నది. కాని అది ఇంకో విధముగా చేయడానికి వీలు లేదు. అందుచేత powers ఎప్పుడుకూడ ప్రజానీకానికి పోవలసిందే. దానివల్ల వచ్చిన పొరపాట్లు చైతన్యమువల్లనే మార్పు చేసుకోవలసిన అవసరము ఉన్నది.

" I do agree Sir as Dadabhai said that a good Government is no substitute for self-Government."

"A good Government is the best substitute for self-Government but at the same time I have to say a good self-Government is only the substitute for any other form of Government.

అంతేగాని మంచి పరిపాలన జరుగుతుందని ఆ Executive Officersను పెట్టడానికి నేను ఒప్పుకోను. కాని ఇవ్వాళటిరోజున తీసుకువచ్చిన ఈ బిల్లుమాత్రము ఈ పరిణామాలనుతీసుకురాదు. స్త్రీలకు చోటు ఇస్తున్నారు, తప్పకుండా ఇవ్వవలసిందే. స్త్రీలకు చోటు ఇచ్చినప్పుడు co-option ఎందుకు? ఎన్నికలలో వచ్చేందుకు విధిగా ఒక సీటు ఏర్పరచండి. వచ్చితీరాలంటే సరిపోతుందిగాని అప్పుడు ఏ General ఎన్నికల్లో రాకపోతే మీరు co-option చేసుకొంటే, అన్నప్పుడు doubtful మెజారిటీవున్నప్పుడు దాని సరిచేసుకోడానికి ఈ కోఆప్టు పద్ధతి పెట్టడం న్యాయంకాదు. ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు వోటు ఇచ్చేప్పుడు చేసుకోవలసిఉంటారు, అందువల్ల స్త్రీకి వాళ్లు ఒప్పుకొంటారు. ఇక్కడున్నుంచి suitable గా తీసుకోవడానికి వీలవుతుంది. అది న్యాయముకాదు. స్త్రీకి సీటు ఇస్తున్నాము అంటే మరింత ఎందుకు వ్యతిరేకస్తున్నారు అంటారు. ఎప్పుడు వ్యతిరేకించడము లేదు, స్త్రీలకు యిచ్చే సీటు విషయంలోకాదు. ప్రతి గ్రామంలో ఒక సీటుయివ్వండి కాని కోఆప్టు పద్ధతినిమాత్రంకాదు. విధిగా స్త్రీకూడా ఉండితీరాలనేది పెట్టి ఉంటే దీనికి పూర్తిగా ఒప్పుకొంటాముగాని, ఏదో co-option ఇచ్చి చేస్తే వీలులేదు. అందువల్ల ఈ బిల్లుకు మొత్తముకూడ వ్యతిరేకిస్తూ సెలక్టు కమిటీకి పంపిస్తే సంతోషిస్తాము. అసలు మొత్తము అంతకూడ drop చేస్తే ఇంకా చాలా సంతోషిస్తాము అని చెప్పి ఇంతటితో నేను విరమిస్తున్నాను.

Sri S. NARAYANAPPA :—అధ్యక్షా, మన స్థానిక సంస్థల మంత్రిగారి 8 నెలల పరిపాలనలో, అన్ని జిల్లాల పర్యటన సందర్భములో పంచాయితీల నిర్వహణ సక్రమంగా జరుగుతున్నదాలేదా అని పరిశీలన జరిపిన తరువాత ఈ సరణలతో

గాడిన బిల్లును శాసనసభలో ప్రతిపాదించినారని నేను భావిస్తున్నాను. ఈ సవరణ ల్ల పంచాయితీ పరిపాలన, పంచాయతీల అభివృద్ధికి, దోహదము ఇస్తూ, పంచాయతీ పరిపాలన సక్రమంగా నిర్వహణ జరిగి, ఆ పంచాయితీద్వారా ప్రజానీకానికి జరగవలసిన మేలు క్షేమము జరిగేదానికి అవకాశాలు ఉంటాయి. సక్రమమైన పద్ధతిలో పంచాయితీల నిర్వహణలో వున్న చిక్కులను తొలగించే ఉద్దేశ్యంతోనే ఈబిల్లును తీసుకువచ్చారు. ఇప్పుడు చాలామంది ప్రతిపక్ష సభ్యులు విమర్శిస్తూ ఉపన్యసించారు. ఈ పంచాయతీల చట్టమునకు సవరణలు తెచ్చిన ముఖ్యమైన భాగాలు కొన్ని ఉన్నాయి. ఒక ఆర్థిక విషయానికి సంబంధించినటువంటిది. భూమిశిస్తు $12\frac{1}{2}\%$ పంచాయితీలకు ఇవ్వాలని చట్టంలో ఉన్నది. ఆ $12\frac{1}{2}\%$ ద్రవ్యాన్ని పంచాయితి చట్టను అమలులోకిచ్చినప్పటినుండి రాష్ట్రప్రభుత్వము పంచాయితీలకు ఇవ్వాలి. మన ఆర్థిక లోపమువల్ల యింతవరకు యివ్వలేదు. పంచాయితీలు నిర్వహణ కేవలము పంచాయితీలు విధించే పన్నులద్వారా వచ్చే ఆదాయముతోనే అనగా ప్రభుత్వము నేరుగాఇచ్చే రిజిస్ట్రేషను entertainment ఇత్యాది మార్గముల ద్వారా వచ్చే ఆదాయముతో ఈ పంచాయతీల నిర్వహణ జరుగుతున్నది. కాబట్టి భూమి శిస్తులో రాష్ట్ర ప్రభుత్వం ఇక్కడ ఉన్న లోటు పాట్లకు తీర్చడానికి వల్లేకుండా వున్న యీ పరిస్థితులలో వచ్చే 5 యేళ్లలోకూడా $12\frac{1}{2}\%$ ఈ భూమి శిస్తులనుండి యిచ్చే సావకాశం లేదు. ఇప్పటికి దాదాపు $5\frac{1}{2}$ కోట్ల రూపాయలు లోటుతో జరుగుతున్న రాష్ట్ర ప్రభుత్వము ఎక్కడనుండి డబ్బు పంచాయితీలకు ఇచ్చే సావకాశము లేనప్పుడు చట్టములో నిద్రుశ్యంగా ఎందుకు వుండాలనే ఉద్దేశ్యంలో మంత్రిగారు మంత్రివర్గంయొక్క సలహాతో ఈ సవరణ తీసుకోవడం సమంజసంగా ఉన్నది. డబ్బు ఇవ్వలేనటువంటి సవరణ ఈ చట్టములో ఎందుకు ఉండాలని వుద్దేశ్యము. పూర్తిగా రద్దుచేయుటకంటె suspense చేయవచ్చును. Temporary period 5 యేళ్లు పెట్టేవరకు యివ్వడంలేదని సవరణ చేయవచ్చు. Suspend చేయుటవల్ల ప్రమాదంలేదు. తరువాత కావాలంటే రాష్ట్ర ప్రభుత్వము ఆర్థికంగా బాగుపడిన తరువాత మిగులు డబ్బు ఉన్నప్పుడు, పంచాయితీలయొక్క నిర్వహణకు ఈ $12\frac{1}{2}\%$ భూమి శిస్తులోనుండి ద్రవ్యాన్ని కేటాయించవచ్చును. $12\frac{1}{2}\%$ భూమి శిస్తులో యివ్వాలని ఖచ్చితంగావున్నమాటను ఆర్థిక లోటువల్ల యీ సవరణ తీసుకురావడము సమంజసంగా ఉన్నది. దీనిని వ్యతిరేకించడము న్యాయము కాదు. చట్టములో పైపద్ధతి ఉండడము సమంజసము కాదని చెప్పే ఉద్దేశ్యంతోనే ప్రభుత్వం యీ సవరణ తీసుకు వచ్చినది.

పంచాయితీ బోర్డుల ఎన్నికలు జరిగాయి. 3 సంవత్సరముల పరిపాలన [illegible] అయింది. నేడు పంచాయితీలు, వాటియొక్క ప్రెసిడెంట్లు ఆటూ

గ్రామములయొక్క ప్రజానీకము ఎన్నుకున్నారు. క్లాసు A. పంచాయితీలలో కూడా ఈవిధంగానే ఎన్నుకున్నారు. క్లాసు 1 లో ప్రజానీకము పట్టణవాతావరణము కలిగినందునను పంచాయితీలకు Executive Officers Control వుంది, పరిపాలన నిర్వహణ చట్టబద్ధంగా జరిగేదానికి అవకాశమున్నది. సభ్యులు ప్రెసిడెంటు అందరూ కూడా ఒక పద్ధతిలో వ్యవహరించడానికి సావకాశములు ఉన్నాయి. రెండవ క్లాసు పంచాయితీలు తీసుకున్న వాటి పరిపాలనచూస్తే ఈ 3 సంవత్సరముల్లో చాలా అవకతవకలు జరిగినాయి. పంచాయితీ ప్రెసిడెంటును నేరుగా ప్రజలనుంచి ఎన్నకోవడము, పంచాయితీ సభ్యులు వార్డుల తరఫున రావడము, ప్రెసిడెంట్లకు పంచాయితీ సభ్యులకు పొత్తులేకపోవడము తగాదాలు ఏర్పడడము, ఆ గ్రామ పంచాయితీ పరిపాలనా వ్యవహారము కుంటుపడడము, ఇవన్నీ జరుగుతున్నాయి. జరిగిన అనుభవాన్ని బట్టి వారు ప్రెసిడెంటు ఎన్నిక తిరిగి సభ్యులుద్వారా కావడం బాగుండునని యు, ఆ ప్రెసిడెంటుకు సభ్యులకు పంచాయితీ ఆదాయం సక్రమంగా గ్రామాభివృద్ధికి ఖర్చు చేయడానికి వీలుపడేట్లు చేసే ఉద్దేశ్యంతో ఈ సవరణ తీసుకు వచ్చారు. కేవలం ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేయాలనిగాని, ప్రజాస్వామ్యము పైన ప్రభుత్వానికి విశ్వాసములేనట్లు, పతిపక్షసభ్యులు ఆరోపణచేయుడం న్యాయముకాదు. ప్రజాస్వామ్యంద్వారానే మెంబర్లుద్వారా జిల్లా బోర్డు అధ్యక్షుని ఎన్నిక మునిసిపల్ చేర్మన్ కౌన్సిలర్లద్వారా జరుపుకుంటువున్నాము. పంచాయితీ మెంబర్లు పంచాయితీ అధ్యక్షుని ఎన్నిక జరగడం బాగుండును. పంచాయితి ప్రెసిడెంటుతో మీటింగు జరిపేదాని సీటుగూ సభ్యులు, సహకరించినప్పుడు ఆ పంచాయితీ అధ్యక్షునియొక్క కార్యనిర్వహణ ఏవిధంగా జయప్రదంగ జరుగుతుంది. అందువల్ల గ్రామాభివృద్ధి నిలిచిపోతుంది. పంచాయితీలలో పరిపాలన స్తంభించిపోయి ఎక్కడి డబ్బు అక్కడ నిలచిపోతుంది. నాకు బాగా తెలుసును. ఎన్నో పంచాయితీలయొక్క డబ్బు సేవింగ్సు బ్యాంకులలోనే, ట్రెజరీలలోనే నిలిచిపోయింది. ఆ డబ్బుతో సక్రమంగా పరిపాలన నిర్వహించడానికి ప్రభుత్వం తప్పకుండా పై చర్య తీసుకుంటుంది. ఇప్పుడు పంచాయితీల నిర్వహణ సక్రమంగా జరుపుటకుగాను జిల్లాకు technical assistance కు గాను ఒక సూపరువైజరుగారిని మాత్రం ఇచ్చియున్నారు. అట్లా కాకుండా ఇంజనీరు సిబ్బందిని కొన్ని పంచాయితీలను ఒక group చేసి జిల్లాలలో ఉన్న వీటిని కొన్ని భాగాలుచేసి ఇంజనీరు శాఖకు సంబంధించిన సూపర్వైజర్లను సిబ్బందిని estimate లు వగైరామీద తయారుచేయించి పనులు సక్రమంగా జరిగే దానికి, పంచాయితీ పరిపాలన జయప్రదంగా జరపడానికి ఈ సవరణ తెచ్చారు.

ఐతే ఈ technical assistance ను గురించి ముందు ప్రభుత్వం ఒక సవరణ తీసుకొస్తే బాగుంటుంది. తర్వాత స్త్రీల ప్రాతినిధ్యాన్ని గురించి

Sri S. Narayanappa] [6th December 1955

వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఇంకా కొంతమంది ఇది election ద్వారా చేస్తే బాగుంటుందని చెప్పారు. స్త్రీలు కేవలము అబలలు. పురాణకాలమునుంచికూడా చెప్పుతూ వారికి యివ్వవలసిన ప్రాధాన్యము యిచ్చేదానికి ప్రజాస్వామ్యములో అవకాశాలు కల్పించేదానికి ప్రభుత్వము ముందుకువచ్చి నామినేషన్ ద్వారానైనాసరే స్త్రీలకు ప్రాధాన్యమిచ్చివాండ్ల అభిప్రాయాలను వాండ్ల స్వేచ్ఛను బాగా అభివృద్ధి పరచే దానికి తోడ్పడేటట్లు ప్రభుత్వము ఈ విధమైనటువంటి సవరణను తెస్తే దానిని కూడా వ్యతిరేకిస్తున్నారంటే అది చాల ఆశ్చర్యముగావుంది. ఇది సమంజసముగా వుండదు. కాబట్టి ఆ వ్యతిరేకత న్యాయముగా కన్పించదు. Audit fees వసూలు చేయడము న్యాయము. ఇప్పుడు Second Class పంచాయితీలలో audit పద్ధతి అనేదిలేదు. హోలీడిపార్టుమెంటుద్వారా జరుగుచున్నది. వసూలు చేసినడబ్బును పంచాయితీలలో సక్రమముగా లెక్కలు వ్రాయకుండా దుర్వినియోగము చేసినారనియు కొన్ని పంచాతీలలో అనవసరముగా డబ్బుఖర్చుపెట్టకనే, పెట్టినట్లు ప్రభుత్వానికి reports వచ్చాయి. మనముకూడా చూస్తున్నాము. Second Class పంచాయితీల అధ్యక్షులను కొందరిని తొలగించారు. ఎందుకంటే Executive functions అధ్యక్షులచేతిలోనే వుండిపోయినాయి. పంచాయితీ Boards మీటింగులు జరుపడము అటు అధికారాలుకూడా ఆ పంచాయితీ అధ్యక్షునిచేతిలోనే వుండిపోయినాయి. ఇట్టి సందర్భాలలో పంచాయితీలు సక్రమమైన లెక్కలు వుంచక పోవడమువల్ల audit అనే దానినివుంచి audit fees కూడా ఆ పంచాయతీలతో వసూలుచేయడము న్యాయవిరుద్ధముకాదు. ఇది అసమంజసము కాదనిచెప్పి నేను మనవిచేస్తున్నాను. ఇక Vehicle taxను గురించి కొందరు సభ్యులు మాట్లాడినారు. బండ్లపన్ను 54 సంవత్సరము అక్టోబర్‌లో రద్దుచేశారు. Second class పంచాయతీలకు బండ్లుపన్ను రద్దుచేస్తూ Class I పంచాయతీల ఇష్టమువస్తే బండ్లపన్ను వేసుకోవచ్చును. లేనిఎడల విడిచిపెట్టవచ్చునని option కొన్ని major పంచాయితీలు బండ్లపన్ను వేస్తున్నాయి. కొన్ని వదలిపెట్టినాయి. ఇప్పుడు చిన్న పంచాయితీలలో యీ బండ్ల పన్నును విధించుటకు గ్రామముల పంచాయితీలకే వదలిపెట్టినారు. గ్రామపంచాయితీ అధ్యక్షులు ఆ గ్రామములో ఎన్నుకొన్న సభ్యులుకలసి యీ బండ్ల పన్ను వేసుకోడానికి అవకాశము కల్పిస్తున్నాము. అంటే బండ్లపన్ను వేసుకొనే సందర్భము వాండ్లకు పొసగితే వేసుకోవచ్చును. లేకపోతే ఆ గ్రామములోని ప్రజలకు ఇబ్బందిగావుంది, గ్రామముయొక్క రైతాంగానికి కష్టముగా వుందంటే అపుడు దానిని వేయకుండా వుండేదానికికూడా యీనాడు చట్టమునకు సవరణరూపములో [illegible] ఖచ్చితముగా వేసుకోకూడదు అనే సవరణను యీనాడు సడలించి కేవలము

వాండ్లకు Option యిస్తున్నారు. వేసుకోడానికి అవకాశాలు కల్పిస్తున్నారు. అందువల్ల వేసుకొనే అధికారము ఆ పంచాయితీకేవుంది, కాబట్టి యీ సవరణను కూడా మనము ఏవిధముగా oppose చేసేదానికిగాని వ్యతిరేకించడానికిగాని అవకాశము కన్పించడంలేదు. అందుకు కారణాలుకూడా కన్పించవు. ప్రతిపక్షము వారు వ్యతిరేకించక తెచ్చిన సవరణబిల్లును అంగీకరిస్తారని నేను తలస్తున్నాను. తర్వాత మునిసిపాలిటీలకు సంబంధించిన కొన్ని సవరణలుకూడా మంత్రివర్యులు తీసుకొచ్చారు.

MR. SPEAKER :—మునిసిపాలిటీలు ఇక్కడ లేవండి. వాటినిగురించి మాట్లాడడానికి వేరే అవకాశము వస్తుంది,

Sri S. NARAYANAPPA :—ఇక మార్కెట్ ఫీజ్ వసూలుచేయు అధికారమునకు సంబంధించిన సవరణ తీసుకొచ్చారు. Private markets పైన fees విధించడములో పంచాయితీలకు అధికారము లేకుండావుండిన private markets ఎన్నోవున్నాయి. ఆ మార్కెట్లనుంచి ఏ విధమైన ఆదాయము పంచాయతీలకు రావడములేదు. అక్కడ licensing fees విధించి ఆ పంచాయితీకి ఆదాయాన్ని పెంచేఉద్దేశముతో యీ private markets కు licensing fees విధించు విధానము తీసికొనిరావడం సమంజసముగవున్నది. ఇది చాలా బాగుంది. పంచాయితీల ఆదాయము పెరుగడానికి అవకాశాలు కలిగిస్తారు. కాబట్టి యీ పంచాయతీలు పంచాయతీ పరిపాలన జయప్రదముగా సాగేదానికి పంచాయితీల అభివృద్ధినికోరి ప్రభుత్వం తీసుకొచ్చిన ప్రధానమైన యీ ముఖ్య ఉద్దేశాన్ని ప్రతిపక్ష సభ్యులు వ్యతిరేకించుతూ ఈ బిల్లును select కమిటీకి పంపాలని ఊరక కాలయాపన జరుపడానికి తలపెట్టినారు. యీ సవరణలు అత్యవసరము సమంజసము కూడా. వ్యతిరేకరించక దీనిని వెంటనే ఆమోదించడానికి ప్రయత్నముచేసి పంచాయితీలకు యీ సవరణలతో తిరిగి ఎన్నికలుజరుపు అవకాశాలు కల్పిస్తున్నారని ఆశిస్తూ నేను యింతటితో విరమిస్తున్నాను. అవసరమైనచోట పంచాయితీలోవున్న పల్లె ప్రజల కోరికమన్నించి, ప్రత్యేకపంచాయితీ నిర్మాణముచేయు అధికారము కల్పించు సవరణ మిక్కిలి బాగున్నది. మిక్కిలి హర్షింపదగినది.

Sri N. RAMULU :—అధ్యక్షా, గౌరవనీయులు స్థానిక స్వపరిపాలనా శాఖామాత్యులు ప్రతిపాదించిన గ్రామపంచాయితీల చట్టసవరణ బిల్లును నేను బలపరుస్తున్నాను మన గ్రామపంచాయితీల చట్టము 1950 సంవత్సరములో pass అయింది. యీ 5 సంవత్సరాల కాలములో యీ చట్టము అమలు జరపడములో వచ్చిన సాధకబాధకాలు గురించి యీనాడు ఈ సవరణ

Sri N. Ramulu] [6th December 1955

ప్రతిపాదించడము చాలముదావహము. క్రిందటిసారి ఈ minor పంచాయితీ ఎన్నికలు జరిగేటపుడు చేతులెత్తి ఎన్నికలు జరుపడమనేది వుంది. దానివల్ల చాలచిక్కులు వచ్చాయని గమనించి ఆ ఓటింగ్ పద్ధతి ద్వారా ఆ ఎన్నికలు జరుపాలని ఆనాడు సవరణ తెచ్చారు. అదే విధంగా యీనాడుకూడ యీ ఎన్నికలలో ఏ విధమైన లోపాలు లేకుండా తొందరగా ఎన్నికలు జరిపించడానికి తగు కార్యక్రమాలు నిర్వర్తించడానికి యీ సవరణ తెచ్చారు. మొట్టమొదట చట్టములో 5 వందల లోపు జనాభా వుండే గ్రామాలను కలిపి పంచాయితీలుగా ఏర్పడాలన్నారు. ఆ విధంగా ఏర్పరచితే ఎన్నో వేల పంచాయితీలు ఏర్పరచవలసివచ్చునేగాక ఆ పంచాయితీల ఎన్నికలు జరిపించడానికికూడా కావలసినంత సిబ్బంది లేకుండావున్నది. అందువల్ల ఇప్పుడు పంచాయితీ చట్టము 5 సంవత్సరముల క్రితము పాస్ ఐనప్పటికికూడా మొత్తము అన్ని గ్రామాలలోకూడా పంచాయితీలను ఏర్పరచలేకపోయాము. యీనాడు మంత్రిగారు 5 వందల పైబడిన జానాభాగల గ్రామాలలోకూడా పంచాయితీలు ఏర్పర్చాలనే సవరణతెచ్చారు. ఇది చాల సమంజసమైనది. ఇక స్త్రీలకు ప్రాతినిధ్యము యివ్వడానికి మన ప్రతిపక్ష సభ్యులకు ఎవరికి అభ్యంతరము లేదు. కాని వారికి ఎన్నికల ద్వారా ప్రాతినిధ్యము యివ్వడమా, లేకపోతే co-option ద్వారా ప్రాతినిధ్యము యివ్వడమా అనే విషయములోనే భేదాభిప్రాయము కనబడుతూ వున్నది. యీనాడు co-option ద్వారా ప్రాతినిధ్యము యివ్వాలనే విధానముకూడా అనేక గ్రామాలలో స్త్రీలు యీ పంచాయితీలకు సభ్యురాలుగా వస్తారన్నది నాకు అనుమానము. అటువంటపుడు వాండ్లను ముందుకురానివ్వడానికి మనము co-option పద్ధతి అమలు జరుపడములో వచ్చిన కష్టము ఏమి వుంటుందో నాకు అర్థంకాదు. మిత్రులు చెప్పుతున్నారు ఎన్నికలలో స్త్రీలు చాలమంది నిలబడుతారని, అటువంటివారు రావడానికి అవకాశముంది. అటువంటప్పుడు వాండ్ల స్థానానికే కాకుండా పురుషలకు ప్రత్యేగించబడిన స్థానాలకుకూడా వారు పోటీచేసి పంచాయితీ సభ్యురాలుగా రావడానికి అవకాశమున్నది. దానికి ప్రత్యేకంగా co-option అనేది వుండకూడదు అనడము అసమంజసముగా వుంటుందని నేను భావిస్తున్నాను. ఇక Special Officers ను ఇపుడు వేసి ఎన్నికలు జరిపించాలని సవరణ పెట్టివున్నారు. యీ సవరణకూడ చాలాసమంజసమే. పంచాయితీబోర్డులు ఏర్పడిన తర్వాతనే District Board ఎన్నికలు జరిపించుకుంటామంటే అన్ని పంచాయితీలు వెంటనే ఏర్పడాలి. యీ పంచాయితీలు అన్ని ఏర్పడాలంటే తాలుకాలో వుండే Deputy Panchayat Officer తన తాలుకాలో వుండే [illegible] పంచాయితీలుకూడ ఒకేసారి ఏర్పర్చడమంటే చాల కష్టము. అందు

గురించే ప్రతి పంచాయితీకి ఒక Special Officer ను వేస్తే ఆ పంచాయితీలను త్వరితముగా ఏర్పర్చడానికి వీలువుంటుందని నేను భావిస్తున్నాను. ఇక అధ్యక్షుల ఎన్నిక సంబంధించి మిత్రులు indirect election వద్దు direct election జరిపించాలంటున్నారు. Indirect election లో direct election లో వచ్చిన సాధకబాధకాలు ఏవో వారు గుర్తించినట్లు కనబడదు. Direct Election లోవచ్చిన President కూడాను మెంబర్ను తీర్మానానికి అనుకూలంగా ఓటు చేసినపుడే ఆ తీర్మానాన్ని అమలు జరిపి ప్రజలకు కావలసిన సౌకర్యాలు చేకూర్చ గల్గుతాడుగాని తాను direct గా వచ్చినంతమాత్రాన సభ్యుల ప్రమేయము లేకుండా తీర్మానము నెగ్గకుండానే కార్యక్రమాలు నెరవేర్చి ప్రజలకు తగినంత సదుపాయాలు కలుగజేయడమనేది యీ Act లో లేదు. అందుచేత పంచాయితీల పరిపాలన సక్రమముగా జరుగాలంటే పంచాయితీలో ప్రతిపాదించిన ప్రతి తీర్మానము ఆమోదింపబడాలంటే పంచాయితీ సభ్యుల అభిమతము చూరకొన్ననాడే సాధ్యమాతుంది, లేని నాడు జరుగడానికి అవకాశము లేదు. ఇక మరొకటేమిటంటే యీనాటి పంచాయితి చట్టములో గత చట్టములో వుండే Land Revenue లో $12\frac{1}{2}\%$ ఇప్పుడు యివ్వమని ఇపుడు సవరణ తెచ్చివున్నారు. ఐతే ఈ సవరణ తేవడములో ఉద్దేశ్యము యింతవరకుకూడా పంచాయతీ చట్టములో $12\frac{1}{2}\%$ యివ్వాలని వున్నా అమలులో మాత్రము యివ్వలేదు. కాని మన మిత్రులు లేకపోతే లేకపోయింది కాని మీరు యివ్వమనే తీర్మానము అమలుకు తేవడము అంత సమంజసముగా లేదు అని భావించడము పొరపాటు. ఎందుకంటే ప్రతిపక్ష సభ్యులలోకూడా కొంతమంది పంచాయితీ అధ్యక్షులుగా వున్నారు. 50 సంవత్సరములో పంచాయితీ చట్టములో గవర్నమెంటువారు $12\frac{1}{2}\%$ Land Revenue పంచాయితీలకు యిస్తామని నిర్దిష్టముగా ఒక Clause వున్నప్పటికికూడను ఇంతవరకూ ఈ $12\frac{1}{2}\%$ మా పంచాయితీలకు ఎందుకు మీరు యివ్వడములేదని అడగడముకాని లేకపోతే High Court లో దానికి తగిన దావాలు తేవడముగాని జరుగలేదు. అంటే వాళ్లకు యివ్వను అని చెప్పి సవరణ బిల్లు తేకుండా ఎంతకాలం యివ్వకుండా వుంటేనే వాళ్లు దానిని సమర్థిస్తారనేది అర్థం అవుతుంది. అందుచేత దీనిని Bill తెచ్చి యివ్వకపోతేనేం కార్యరూపంగా యివ్వకపోతేకూడా ఒకటే అయినందున యిప్పుడు $12\frac{1}{2}$ percent విషయంలో ప్రభుత్వం ఆర్థిక దృష్ట్యా సమంజసం. ఎంత సమంజసమో ఆలోచించుకోవాలిగాని కార్యరూపంలో యివ్వకుండా bill సవరణ మంచిది కాదనడం భావ్యంకాదు. ఇప్పుడు ప్రభుత్వం తాలూకు ఆర్థిక పరిస్థితి చాలా బాగులేదని మనకందరకు తెలుసును. ఆ దృష్ట్యా $12\frac{1}{2}$ percent యివ్వకుండా చట్టంలో యింకా clause పెట్టడం అనేది యీ సవరణ తెస్తున్నది

Sri N. Ramulu] [6th December 1955

కాబట్టి దానిగురించి అంత చింతించవలసిన పనిలేదు. యదార్థంగా యీ పంచాయతీల గురించి చెప్పవలసినస్తే పంచాయతీలు గ్రామ సౌభాగ్యానికి ఉపయోగిస్తారనేది మనకు తెలుసును తగినంత ఆర్థిక స్తోమత ఏదోవిధంగా కల్పించవలసిన అవసరం కనుక యీయేడాది తీసుకుని రేపువచ్చే బడ్జెటులోనే పంచాయతీలకు తగిన ఆదాయం కూర్చే మార్గాలను స్థానిక స్వపరిపాలనా మాత్యులుగారు చేయాలని కోరుతున్నాను. పంచాయతీలకు తగిన ఆర్థికస్తోమత లేకపోతే రాబోయే రెండవ పంచవర్ష ప్రణాళికలో పంచాయతీలు ¼ వరకు ద్రవ్యసహాయము యిచ్చుకోలేక Planning Department తాలూకు సహాయం పొందలేకపోతుంది. అందుచేత పంచాయతీలకు తగిన ఆర్థిక స్తోమత తప్పనిసరిగా కలుగజేయాలని నేను కోరుతూ యీ bill ను సమర్థిస్తున్నాను.

SRI B. SANKARAIAH :— అధ్యక్షా, ఈ Bill విషయంలో యిప్పుడు చాలామంది మాట్లాడారు. ఈ వున్నటువంటి clause లో ముఖ్యమైనటువంటి ప్రత్యక్ష ఎన్నికలగురించిగాని పంచాయతీ బోర్డులు కొన్నిటిని రద్దుపరచి కొన్ని కొత్తగా కలిపి ఏర్పరచే విషయంలోగాని ఇప్పుడు యీ Bill ప్రకారం జరిపేపని అయితే గ్రామాలలో పరిస్థితి ఏవిధంగా ఏర్పడుతుందో అనేకమంది మాట్లాడారు. మొట్టమొదట ప్రత్యక్ష ఎన్నికలు యిదివరకు ఎన్నుకునేటటువంటి దానిని రద్దుపరచవలసినటువంటి కారణం యిదికొన్ని చోట్ల చిక్కు తెస్తాయి అనే కారణంలో రద్దుపరుస్తున్నారు. మా నియోజకవర్గం, జిల్లాలో అనేకచోట్ల అధ్యక్షుడు ఒక పార్టీకి సంబంధించినటువంటివారు memberలు వేరే పార్టీకి సంబంధించినటువంటివారుకూడా వున్నారు. ఇన్నేళ్లయినప్పటికీ కూడా member లు చేసినటువంటి majority తీర్మానం సవ్యంగా జరిగిపోయినటువంటి పంచాయతీ బోర్డులు చాలా వున్నాయి. ఐతే యిప్పుడు ప్రత్యేకంనా ఆవిధంగా లేనప్పుడు అధ్యక్షుడు తన విధులను సక్రమంగా నిర్వహించడానికి యింకా కొన్ని విధులను చేర్చవచ్చుగాని యిదివరకు కలసి వందలమంది ఎన్నుకునే హక్కు కొద్దిమంది సభ్యులకు కుంచించడం అనేది ఏవిధంగా ప్రజాస్వామికానికి యింకా ప్రోత్సహించడానికి ఉపయోగపడుతుందోలేదో చెప్పవచ్చు. ఇవ్వేళ లక్ష్మణదాసు గారు మాట్లాడుతూ ప్రజలందరికీ యీ voting అధికారాన్ని తీసివేయడం కూడా యిదో ప్రజాస్వామికం అని చెప్పారు. అందులో ప్రజాస్వామిక విషయంతో ఆయన అప్పుడప్పుడు మాట్లాడినప్పుడు యిక్కడున్నట్టిది Bill కు దానికి సంబంధం వున్నా లేకపోయినా రష్యాలో ప్రజాస్వామికంలేదని అందువల్ల కమ్యూనిస్టు పార్టీకి [illegible] ప్రజాస్వామికంగురించి మాట్లాడ్డానికే అసలు హక్కుకూడా లేదని చెప్పారు.

రష్యాలో యిప్పుడు మనకు 21 సంవత్సరాలకు voting జరిగితే అక్కడ 18 సంవత్సరాలకే voting హక్కు యిస్తున్నారు. అందువల్ల ప్రజాస్వామికం అనేది ఆయన ఉద్దేశ్యమా? ఇక్కడ కేవలం ఎన్నుకోడానికయితే అక్కడ ఎన్నికయినటువంటివారు సరిగా ప్రవర్తించనప్పుడు తీసివేసే అధికారం కూడావున్నది. అందువల్ల ప్రజాస్వామికం లేదనా? ప్రభుత్వం ఇంతకాలం District Boards చట్టం పరిశీలించి మార్చమని 3, 4 సంవత్సరాలనుంచి District Boards ను Special officers ద్వారా పరిపాలిస్తున్నది. ఇదేనా ఉత్తమమైన ప్రజాస్వామికం. కొన్ని వేలమంది యిదివరకే ఎన్నుకునేటటువంటి హక్కు తీసివేయడం ఏ విధంగా ప్రజాస్వామికం? ఆవిధంగా అసలు సందర్భం లేనటువంటి విషయాలు మాట్లాడుతున్నారు. గ్రామాలలో ఎక్కడాకూడా ప్రజల అభిప్రాయానికి పంపినప్పటికీ ప్రజలు యిదివరకు ఎన్నుకునేటటువంటి హక్కును తీసివేసి యిప్పుడు కొద్దిమంది member లు ఎన్నుకునే పద్ధతి ప్రజలంగీకరించరని ప్రభుత్వానికి తెలుసును. అందువల్ల కనీసం Select Committee కి వేయాలనకుండా వెంటనే యిప్పుడే pass చేయాలి అంటున్నారు. అంతేకాకుండా తీవ్రమయినటువంటి అధికారాలు యిదివరకు లేనటువంటి కొత్త అధికారాలు యిస్తున్నారు. కొన్ని గ్రామాలలో కొన్ని చిక్కులుంటాయి. కాబట్టి 500 పైపడినవి కలుపడానికి వున్నటువంటి బోర్డులు రద్దుచేయడానికి యింకోచోట కలపడానికి పూర్తిఅధికారాలు యిస్తున్నారు. అటువంటప్పుడు ఆ area లోని ప్రజల అభిప్రాయం తెలుసుకోడానికి కనీసం పంచాయితీ బోర్డును సంప్రదించకుండానే గవర్నమెంటు Inspector General of Panchayats కోరితేనే అనుకుంటే నే బోర్డురద్దు చేసేటటువంటి తీవ్రమయిన అధికారాలు యిందులో యిచ్చారు. ఆ విధంగా చేసినప్పుడు ఎన్నో కోట్ల పంచాయితీబోర్డులో వున్నటువంటి members ను కూడా తీసివేసి Boards ను Supersede చేయడం జరుగుతుంది. ఇంకా ఎక్కువ అధికారాలు యిచ్చినందువల్ల ఏవిధంగాను ప్రజాస్వామికం ప్రోత్సహించబడదు. పరిపాలనా స్వాష్టవం పెరగడానికి ప్రజల హక్కులు కుంచించడంవల్లకాక ఆర్థికస్తోమత పెంచాలని అందరకు తెలిసినదే. ఇది అన్ని పార్టీలు ఆందోళన చేసినటువంటి విషయమే. గ్రామాలకు ఆర్థికస్వాష్టవం కలుగ జేయడానికి 12½ percent భూమి శిస్తుయిస్తున్నాం అని యిదివరకు Act లో ఒప్పుకున్నారు. కాని యిప్పుడు తీసివేస్తున్నారు. దానివల్ల ఆర్థికస్వాష్టవం కోల్పోయి ప్రణాళికలను జయప్రదం చేయగలశక్తిపోతుంది. దేశాన్ని ముందుకు తీసుకుపోయే దానికి కనీస ఆవసరాలను చేకూర్చేందుకు యిదివరకు Act లో యిచ్చినటువంటి అవకాశం తీసివేస్తున్నారు. ఈ విధంగా యీ Act మొదటినుంచే చివరదాకా ఏదో ఒకవిధంగా పంచాయితీబోర్డు కున్నటువంటి ఆదాయం తగ్గించడానికి హక్కులు

Sri P. Sankaraiah] [6th December 1955

తగ్గించడానికి అధికారులు యిష్టంవచ్చినట్టు ప్రవర్తించడానికి వీలున్న యీ చట్టాన్ని ప్రజాస్వామికాన్ని ముందుకు తీసుకుపోతున్నదని చెప్పడం హాస్యాస్పదమైనది. ప్రజాస్వామికం అనగా ప్రజల సమస్యలను పరిష్కరించడానికి కావలసినటువంటి అవకాశం కలుగచేస్తున్నప్పుడే దానిని ప్రజాస్వామికం అంటాం. పార్లమెంటు ఎన్నికలు రాష్ట్రఎన్నికలు ప్రభుత్వం చేతులోలేనేలేవు. ఇంక వుండేదిస్థానిక సంస్థలకు సంబంధించిన ఎన్నికలుగాని స్థానికసంస్థల పరిపాలన మాత్రమే హక్కున్నది. అటువంటప్పుడు ప్రతి విషయంలో యిదివరకున్న హక్కులనయినా కాపాడడానికి కనీసం Select Committee లోనైనా చెడుగా వున్నవాటిని సవరించాలని ప్రభుత్వాన్ని కోరుతూ మిగతా సభ్యులనుకూడా మాట్లాడాలని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

SRI N.C. SESHADRI :- అధ్యక్షా, స్థానిక స్వపరిపాలన శాఖమంత్రిగారి తీసుకువచ్చిన యీ Bill ను చాలమంది ప్రతిపక్షసభ్యులు Select Committee కి refer చేయవలసినదిగా చెబుతూవచ్చినారు. ఐతే Select Committee కి ఎందుకు refer చేయమన్నారో దానికి 3 విషయాలు పేర్కొన్నారు. మొదటిది మహిళలకు co-option పెట్టాలనేటటువంటి విషయం. రెండోది Land Revenue పంపకం యిదివరలో Section 71 of the Act ప్రకారంయిస్తూ యిప్పుడు రద్దు చేయడం సమంజసంకాదని. మూడో direct election వుండాలనేటటువంటి విధానాని అకస్మాత్తుగా తీసివేయడం. ఇతర విషయాలన్నీ యించుమించు ప్రతిపక్ష సభ్యులందరూ మనతో ఒప్పుకుంటూనే వున్నారు.

ఇది Select Committee కి refer చేయాలన్నారు. ప్రతిపక్షసభ్యులు తప్ప ప్రభుత్వపక్షం సభ్యులంతా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. Select Committee కి వెళ్లినతర్వాతకూడ ఇదే స్వరూపంలో వస్తుందిగాని, కాలయాపన జరగడంతప్ప ఇతర విధమైన అనుకూలం ఏమి ఏర్పడబోయ్యేదిలేదు. Direct election తీసుకుంటే, చేర్మెను ఎన్నికజరుగుతుంది.

MR. SPEAKER .— మునిసిపాలిటీలలో అధ్యక్షుని direct election పద్ధతిపై ఎన్నుకోరు.

SRI N. C. SESHADRI :— ఇక్కడ ప్రజాస్వామ్యం ఉండేటప్పుడు అక్కడ ఎందుకు కాకుండా పోతుంది అని నేను ప్రశ్నిస్తు ఉన్నాను. ఎందుకు indirect election పెట్టుకొన్నాము. వాండ్లకు పరిపాలనా స్వాతంత్ర్యం ఉండలేదు. మనం ఒకపార్టీ ఏర్పడి ఆపార్టీద్వారా ప్రెసిడెంటు ఎన్నికఅయినట్లయితే [illegible] పరిపాలనలో చిక్కులు ఉండవు. ఇదివరకు direct ఎన్నికలు

జరిపి పంచాయితీ పనులు అన్నీనిలిచిపోయినవి. ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు భంగము చేయాలనే ఉద్దేశ్యం ప్రభుత్వానికిగాని, ప్రభుత్వం వెనుక ఉన్న సభ్యులకు గాని లేదని మనవిచేస్తున్నాను. తరువాత Land Revenue విషయంలో నిజమే, పంచాయితీ రాజ్యం ఏర్పాటుచేయబోతున్నాము. ప్రభుత్వానికి ఉన్న డబ్బు లోటుకారణంవల్ల మనం 12½% ఇవ్వలేకపోయాము. అంతమాత్రాన మనం ఇవ్వడంలేదని ఎక్కడ బిల్లులో చెప్పలేదు. Act అదేవిధంగా ఉంది. ఆ విధంగా అమలులోనికి తీసుకొనే ఆర్థికస్తోమతు ఏర్పడినపుడు 12½% లేకాదు. ఇంకా హెచ్చుకూడ ఇస్తారు. మహిళలు ఇపుడు రాజకీయాలలో ప్రవేశిస్తున్నారు. వారికి ఇపుడు కావలసిన రాజకీయ చైతన్యం లేకుంటే, మనము ఏదో నామినేషన్ చేస్తే కార్యక్రమాలలో పాల్గొంటారుగాని, వాండ్లలో వాండ్లకు తగవుపెట్టి ఇపుడు ఉన్న ప్రశాంత వాతావరణాన్ని భంగ పరుస్తాయి అని అనుకొంటాను. ప్రతిపక్ష సభ్యులు ఇదివరకు మనము వాండ్లకు ఒక footing ఇస్తున్నాము. దీనిని హృదయ పూర్వకంగా బలపరుస్తున్నాను.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ప్రభుత్వం 170 మంది తమ వెనకాల ఉన్నారని, ఇటువంటి ముఖ్యమైన బిల్లును ఆఖరు రోజున తీసుకొనిరావడం, ఎట్లా majority ఉంది కాబట్టి, ఎవరు చెప్పితే మాకు వచ్చిందేమిటిలే, ప్యాసుచేయ వచ్చులే, అనే ఒక ధీమాతో తప్ప ఈ బిల్లు తేచ్చే దానిలో కారణాలు ఏమి అగపడవు. నాకు ముందర మాట్లాడిన Seshadri గారు Select Committee కి పంపితే మాత్రం వచ్చేఉపయోగం ఏమి ఉంది. మేము కాంగ్రెసువాండ్లు నిర్ణయించుకొన్నాము. అందువల్ల Select Committee కి పంపించడంలో ప్రయోజనంలేదు. కాంగ్రెసువాండ్లు అంతా నిర్ణయించుకొన్నారు. ప్రభుత్వం అంతా నిర్ణయించు కొన్నారు. తమ ఇష్టం వచ్చినట్లు పెత్తనం చేసేదానికి ఇక్కడ ఉన్నామని చెప్పేది కాస్త ఖచ్చితంగా నిర్మొగ మాటంగాను, కాంగ్రెసు నాయకులు మంత్రులుకూడ చెప్పితే ఇంకా అంత స్పష్టంగా ఉంటుంది. అప్పుడు మేము ఇక్కడ కూర్చొనడం ఎందుకు ? మీరు ఎట్లా నిర్ణయంచేసుకొన్నారు. మీ ఇష్టంవచ్చినట్లు పరిపాలన చేయండి ; మీశక్తికొలది ఎంతవరకు చేస్తారో చేయండి ; మాకు ఏమన్నా ఉంటే చేసుకొంటాము. లేకుంటే అక్కడక్కడ బయట ఉంటాము. ఇక్కడ వచ్చికూర్చొనడం, ఈ మాటలు, ఈ చర్చలు వీటివల్ల ఉపయోగం ఏమిటి అని చెప్పాను. L. Lakshmandas గారు ప్రజాస్వామికం ప్రజాస్వామ్యం మీద చాలా పెద్ద ఉపన్యాసం చెప్పారు. వారి పార్టీతరపున ఇంకొకరు లేచి, ప్రజాస్వామ్యం అంటే ఏమిటో నిర్వచించారు. శాసనసభలో మీరు ఏమిచెప్పుకొన్నా లాభంలేదు. మీకు 170 మంది ఉన్నారు. కాబట్టి మా ఇష్టం వచ్చినట్లు చేయుటకు నిర్ణయించుకొన్నాము. Select

Committee కి వెళ్లినా అక్కడకూడ మీకు కంఠశోష ఎందుకు ? కావుంటే మీలో మీరు కొంత బేధములు పెట్టుకొని, ప్రతిపక్షంలో కూడ మావాండ్లను 20 మంది పెట్టుకుంటే, ఈ Select Committee లో వాండ్లకు రెండు స్థానాలు ఎక్కువ ఇచ్చుకొన్నా, మీ తరఫున ఎక్కువ చేసుకొన్నా ఉంటుంది. అటువంటి ఉద్దేశాలతో పెట్టి ఉంటే, పెట్టి ఉండాలి తప్ప మరేమికాదు.

SRI P. NARASIMHAPPA RAO :—మీరు 14 మంది ఉన్నారు. ఇద్దరినే ఇస్తున్నారు. మేము 20 మంది ఉన్నాం. మీతో సమానంగా మాకు ఇద్దరినే ఇస్తున్నారు.

SRI P. SUNDARAYYA :—నిజమే, మీ 20 మందిని ఎన్నుకొన్న ప్రజలు ఎంతమంది ఉన్నారు? మా 14 మందిని ఎన్నుకొన్న ప్రజలు ఎంతమంది ఉన్నారు ? ప్రపంచానికి అంతా తెలుసును. అందుచేత దానినిగురించి మనము పెద్ద వాగ్వాదములు చేసినంత మాత్రాన అసలు విషయం ఎవరికిపోదు. ఈ 20 మందికి ఒకరికి ఒక కార్యక్రమంలేదు. మీరు ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తూ మాట్లాడుతారు. వోటింగు వచ్చినప్పుడు అనుకూలంగా వోటు చేస్తారు. అందుచేత మీరు ఏమి మాట్లాడుతూ ఉంటారో మీకే తెలియదని అనుకోవలసి ఉంటుంది. మీరు ఏమి చేస్తున్నారో తెలియదు అనుకోవాల్సి వస్తుంది. అందుచేత మీది responsive co-operation కాదు. కాంగ్రెసుకు రాజులకన్నా రాజభక్తి ఎక్కువ, కాంగ్రెసు వాండ్లకన్నా వీరు ఇంకా ఎక్కువభక్తిగా ఉంటూ ఉంటారు. అంతకన్న ఏమిలేదు. అందుచేత మీరు 170 మంది ఉన్నారు. లక్ష్మణదాసు గారు, ప్రజాస్వామికాన్నిగురించి చాలా దీర్ఘ ఉపన్యాసం చేశారు. ప్రతి ఒక్క సమస్య తీసుకొన్నప్పుడు అది ప్రజాస్వామికానికి పూర్తిగా విరుద్ధం. ఇది గ్రామాలలో కూడ ఈరీతిగా పెత్తందార్ల రాజ్యాన్ని నిలబెట్టుకోవలని ఉంటుందో, దానికి తోడ్పడే దానికోసం ఈబిల్లును దారి తీస్తుంది. అంతకన్నా మరి ఏమిలేదు.

మొదటి సంగతి తీసుకొంటాం. పంచాయితీ అధ్యక్షుడు ఈరోజు ప్రజలచేత సరాసరి ఎన్నుకోబడినాడుగాని, పంచాయితీలో ఉండే సభ్యులు ward ల ప్రకారం ఎన్నుకోబడడంలో, ప్రజలందరికి వోటు ఇచ్చి సరాసరి ఎన్నుకోమన్నప్పుడు ఒకరిని ఎన్నుకొంటున్నాము. కాని ward ల ప్రకారం విభజించేటప్పటికి వచ్చేవాండ్లు అతనికి వ్యతిరేకమైన majority సభ్యులలో వస్తోంది. అందుచేత అనేక పంచాయితీలలో ప్రెసిడెంటు ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రెసిడెంటు, ఒక రకంగా చేయమంటే వార్డులలోనుంచి ఎన్నుకోబడినటువంటి వీరు ఇంకొక రకంగా చేయమంటున్నారు.

అందుచేత ఘర్షణవస్తుంది. పరిపాలనకు చిక్కు ఉంది, అందుచేత ఈ అధ్యక్షుణ్ణి ప్రజలు ఎన్నుకునే పద్ధతి తీసివేసి, ఈ పంచాయితీ Ward ల ద్వారా ఎన్నుకోబడినటువంటి పంచాయితి సభ్యుల ద్వారానే ఎన్నుకొంటే సమస్యలేకుండాపోతుంది. ఈ ప్రతిష్టంబనకంటే ఇంకొకమార్గం మీకు కనబడలేదా? ప్రజలు సరాసరి వోటుచేసినపుడు, ఎన్నుకొని అధ్యక్షుని అభిప్రాయం ప్రకారం అంటే అత్యధిక ప్రజల అభిప్రాయం ప్రకారం పరిపాలన సాగించేదానికోసం. ఇంకొక ఏర్పాటు ఏమిలోచకుండా, వార్డులలో ఎన్నుకోబడిన వాండ్ల అభిప్రాయం ప్రకారమే అధ్యక్షుడు వెళ్లాలి అని సంకుచితము చేయవలసిన అవసరం ఏమి వచ్చింది.

వార్డులలో ఎందుకని జరుగుతోంది ఎందుకని ప్రజలంతా ఓటుచేసినప్పుడు కూడా అధ్యక్షుడు ఒక పార్టీకి చెందినవాడుగాని ఒక్కొక్క భావాలు కలిగినటువంటి అధ్యక్షుడు రావడం కోర్టులు ఎన్నికలు పెట్టినపుడు ఇంకో తరగతి మనుష్యులు రావడం దీనికి కారణం ఏమిటిఅని ప్రభుత్వం ఆలోచించిందా? వార్డులలో దానికి అనేక కారణాలు ఉంటాయి. వార్డులు పెట్టేటప్పటికి అక్కడ పెత్తనదారు యొక్క పలుకుబడి క్రిందనో ఏవార్డుకావార్డు మనుష్యులను గెలిపించుకోవడం సాధ్యమాతుంది మొత్తం గ్రామానికి వెళ్లేటప్పటికి ఆ మాత్రం పలుకుబడి ఉండక పోవచ్చు. అందుచేత తన పార్టీని గెలిపించుకోలేని పరిస్థితి ఏర్పడవచ్చు. లేదు, ఒక పార్టీలో 51 మంది ఒక పెత్తనదారు వెనకాల ఉంటే 49 మంది ఇంకోపార్టీ వెనకాల ఉన్నట్లయితే లాభంలేదు, ఎందుకంటే ఆరెండు ఓట్లతో ఈపెద్ద మనిషిని గెలిపించేదానికోసం అందుచేతవార్డులప్రకారం ఎన్నుకోబడినటువంటివారు నిజంగాప్రజాప్రతినిధులు. కాని నిజంగా ప్రజలయొక్క అభిప్రాయాన్ని పూర్తిగా వ్యక్తీకరించేవాళ్లుకారు. అనేకకారణాలచేత పెత్తందార్లయొక్క పలుకుబడివల్ల గెలవడం జరుగుతోంది. ఇంతకుముందు ఈ ప్రభుత్వమే Municipal ఎన్నికలు వచ్చినప్పుడు ఓటింగ్ హక్కుగల చాలమంది ఓట్లువెయ్యకుండా వెనక్కు తీసుకొని పోతూంటారు. 300, 400 ఓట్లు ఒకవార్డులో ఉన్నప్పుడు ప్రతి ఒక్క ఓటుకూడా ఎన్నికలలో చాలా ముఖ్యంగా ఉంటుంది. కాబట్టి ఆ ఓటింగుపద్ధతి మార్చేస్తున్నాము. అక్కడే ఓటువేసే దానికోసం ఏవో సూచనలు చేస్తున్నాం అనిచెప్పి అన్నారు. దానిని గురించి అది పొరబాటు అనిచెప్పి వెళ్లారనుకోండి. అంటే తక్కినవార్డులో ఉన్నప్పుడు బిల్లును తారుమారుచేసేదానికొరకు ఓటర్లమీద ఒత్తిడి తెచ్చేదానికొరకు కొంతమందికి అవకాశం కలుగుతుంది. ఆ అవకాశం లేకుండాచేయాలనే ఉద్దేశ్యం ఒకటి వెల్లడించారు. అందుచేత ఈ వార్డులలో కొద్దిమంది పంచాయితీలకు వచ్చేటప్పటికి ఓటర్లసంఖ్య మరింత తక్కువగా ఉంటుంది. ఆ సందర్భంలో ఈ ఓటర్లమీద పలుకుబడి [illegible]

ఈ వార్డుల్లో ఎన్నికలు లేకుండా మొత్తం గ్రామంమీదఉన్న ఓటర్లందరుకూడా డామాషాపద్ధతి ప్రకారం ఓటుచేసి, ఏఏపార్టీకిగాని ఏఏవ్యక్తికిగాని, ఎన్నెన్నిఓట్లు వస్తాయో ఆ ఓట్లనుబట్టి ప్రతినిధులను ఎన్నుకొన్నట్లయితే అప్పుడు ఆ ప్రెసిడెంటు పార్టీ కమ్యూనిస్టుపార్టీ కావచ్చు, కాంగ్రెసుపార్టీ కావచ్చు సోషలిస్టుపద్ధతి కావచ్చు. లేకుంటే మన అప్పారావుగారిపార్టీకి చెందినటువంటి స్వతంత్రులు కావచ్చు. ఏపార్టీకి చెందినప్పటికికూడా డామాషా ఓటింగు ప్రకారం వచ్చినపుడు అది వస్తుంది. వచ్చినపుడు కాంగ్రెసు, స్వతంత్రులుకలిసి ఒక Block గా ఏర్పడవచ్చు. సోషలిస్టులు కమ్యూనిస్టులుకలిసి ఒక block గా ఏర్పడవచ్చు. లేకుంటే గ్రామసమస్యగా వచ్చినపుడు కాంగ్రెసులో గ్రామంయొక్క సౌభాగ్యం కోసం చెయ్యాలనేటటువంటి ఒకవ్యక్తి ఉన్నట్లయితే పార్టీసంబంధాలు లేకుండా అతనిని బలపరుస్తూ కాంగ్రెసు కమ్యూనిస్టు అందరుకలిసి, నువ్వు కాంగ్రెసువాడివి అయితే అయ్యావు న్యాయంగా పరిపాలన చెయ్యగలవని మాకు నమ్మకంఉంది. కాబట్టి మీ వెనకాల మేమంతా నిలబడతాము. ఈ ఊళ్లో పెత్తనదారుయొక్క పలుకుబడి లేకుండా చేస్తాముఅనిచెప్పి మన మందరంకలిసి ఒక Block గా ఏర్పడి డామాషా ఓటింగుపెట్టినట్లయితే అతనికి majority వస్తుంది. ప్రజలు సరాసరి అధ్యక్షుని ఎన్నుకొంటారు. ఆ majority కి చెందినటువంటి సభ్యులను ఎన్నుకొనే దానికోసం ఉంటుంది.

ఆ పద్ధతి ఆలోచించకుండా ఈ వార్డులపద్ధతి ఎందుకనిపోయారో ? దాని అర్థం ఒకటిచెప్పాల్సిఉంటుంది, మీ మనస్సులలో ఉందా లేదా అనికాదు. మీ మనస్సులో ఏ ముందో కూడా తెలీదు. ఎందుకంటె ప్రభుత్వం ఎప్పుడు ఏ బిల్లు తెస్తుందో ప్రభుత్వానికే తెలియదు. మంత్రులకు తెలియదు. ఆఖరుసమయంలో బిల్లు తెస్తారు. Majority ఉందికదా అని ఓటింగు అంటారు. అందుచేత మంత్రులుకూడా ఈ బిల్లు సక్రమంగా సవ్యంగా ఈ బిల్లు చదివారనిగాని కాంగ్రెసు పార్టీలో దానినిగురించి చర్చించారు అనిగాని నేను అనుకోవడంలేదు. దీనికి కొండయ్యగారు No, No అని చెప్పినంతమాత్రాన ఉన్న వాస్తవంమాత్రం మరుగు పరచ వీలులేదు. ఈ బిల్లు మీరు కాంగ్రెసుపార్టీలో చర్చించారా !

SRI L. LAKSHMANA DAS :—మీరేమి ఆయాసపడనక్కరలేదు.

SRI P. SUNDARAYYA :—నాకేమీ ఆయాసంలేదు. చర్చిస్తే మీరు బాగుపడతారు చర్చించకుండాచేస్తే దేశాన్ని బాగుపరుస్తారు అందుచేత మీరు చర్చించని విషయంకూడా చర్చించామని దబాయించినంత మాత్రాన నేను మాత్రం అంగీకరించడం సాధ్యంకాదు. మీ పార్టీ చర్చించలేదు. మా పార్టీసభ్యులు

చాలామంది మన పరిస్థితిమాట మన పార్టీలోను చర్చించడంలేదు. శాసనసభలోను చర్చించడంలేదు. మంత్రులుకూడా సరిగా చర్చించకుండా ఏవో బిల్లులు తెస్తున్నారు. మీకు కావాలంటే ఉదాహరణలు చాలా చెప్పగలను. అందుచేత ఆ విషయంలోకి పోను. మీరు చర్చించుకుంటే చర్చించుకోండి. విద్యుచ్ఛక్తి సంబంధించిన ఒక బిల్లు జనవరి 25 వ తేదిలోపల నే దానిని pass చేయవలెననే వచ్చింది. Time wave చేసే నిమిత్తం, ప్రతిపక్షనాయకుడను కారణంచేత ఆమోదాన్ని పొందటానికి అధ్యక్షులవారు నన్ను ఆ విషయమై అడిగారు. జనవరి 25 వ తారీఖు ఆ బిల్లును నిన్న గెజిటిలో notify చేసి ఈవాళ శాసనసభలో pass చెయ్యాలని సెక్రటరీగారు పంపించారు. అసెంబ్లీ కార్యదర్శిగారు మంత్రిగారిదగ్గరకు వెళ్ళి నా దగ్గరకు వచ్చినందున ఆయన నాతట్టు చూసి నవ్వటం మొదలు పెట్టారు గోపాలరెడ్డిగారు, నేను మాట్లాడకుండా ఊరుకొన్నాను. అందుచేత దానిని వాయిదా వేస్తున్నారు. ఇటువంటి బిల్లులో ఎన్ని వచ్చినాయో మీకే తెలియదు. మీరే చెప్పారు Stamp Fees గురించి. అది 80 clause ల బిల్లు. 80 clause ల బిల్లు అనిచెప్పి గోపాలరెడ్డిగారికీకూడా తెలియదు. దానిని ఈ సమావేశంలోనే pass చెయ్యాలి అన్నారు. సాధ్యంకాదు. ఆ 80 clause లలో ఏమి ఉన్నాయో చూడాల్సి ఉంటుంది. అని తరువాత Select Committee కి పంపుతాము నేనేచదవలేదు ఆ బిల్లు పూర్తిగాను మా పార్టీవాళ్లు చదవలేదు. ఈ శాసనసభలో ఇప్పుడే pass చేయటం ఎట్లా! అందుచేత Select Committee కి పంపితే అప్పుడేదో చూసుకొంటారని అన్నారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఆ బిల్లు 80 క్లాజుల బిల్లు కాబట్టి దానిని Select Committee లో చర్చించి తగు నిర్ణయాలు చేయాలనే అభిప్రాయంతో ఆ బిల్లును Select Committee కి పంపబోతున్నాను.

SRI P. SUNDARAYYA :— మంత్రిగారు ఎంతో హాయిగా సాహార్ద్రంగా ఇచ్చినదానికి నాకు ఎంతో సంతోషంగా ఉంది. ఆ Court Fees కోసం ఎంత ఉదారస్వభావం చూపించారో అదే రీతిగా దీనికికూడా ఆ ఉదారత్వం చూపించమనే నేను ఇందాకటనుంచి చెప్పేదానియొక్క సారాంశం. ప్రజాస్వామ్యం ఎట్ల ఉంది అంటే మీకు న్యాయం ఉంటే న్యాయం. అంతేగాని మంత్రిగారు చెప్పింది అదికాదు. మీకు Majority ఉంది కాబట్టి మేము చెయ్యదలచుకోలేదు. ప్రతిపక్షులనుకూడా Select Committee లోకి తీసుకొనివెళ్ళే అభిప్రాయాలు కూడాతీసుకొని ఎంతవరకు అది సవ్యంగా ఉంటుందో ఆలోచించిన తరువాతనే ఆలోచిస్తాం అన్నారు. Select Committee లో ఈ బిల్లు వచ్చినప్పుడు

ఏజెన్సీలు ఉన్నటువంటి 3 వేల గ్రామాలే కాకుండా ఆంధ్ర రాష్ట్రంలో 13,500 గ్రామాలకు వర్తించేటట్లు ఈ పంచాయితీ బిల్లుమీద ఇటువంటి ముఖ్య సవరణ తెస్తున్నప్పుడు మీరు ప్రతిపక్షాన్ని సంప్రతించకుండా చేశారు. ప్రతిపక్షం 14 ఉన్నారు. బైట 27 లక్షలు. మేము 27 లక్షలని మీరు ఒప్పుకొంటే మీరు 45 లక్షలని నేను ఒప్పుకొంటాను. అందుచేత మీరు ఉన్నది 14 గా 110 మంది అని అంటే లాభం లేదు. మీరు 45 లక్షలు మేము 27 లక్షలు అనే భావంలో బోధించినట్లయితే ఈ బిల్లు ఈ రకంగా తెచ్చి ప్రజా స్వామ్యం గురించి మా ఉపన్యాసాలు కొంచెము తక్కువగా చెప్పేవాళ్లము. అందుచేత ఈ వార్డుల పద్ధతి ఈ దాపూపా ఓటింగ్ పద్ధతి ఎందుకు తీసుకురావలసివచ్చింది. Municipality కి వచ్చేటప్పటికే ఈ ఓటు ఇటు వార్డులలో అనేక చిక్కులు వస్తున్నాయి. ఓటును ఎవరూ బైటకు తీసుకొని పోకుండా చెయ్యాలని చెప్పి ఆ ఎన్నికల స్వభావాన్ని రహస్యపద్ధతిలేకుండా చెయ్యాలని ముందు అనుకున్నారు. తరువాత మీలో మీరు ఆలోచించుకొన్నారో లేకుంటే ఏ కారణంచేతనో ఆ రకంగా అంగీకరించారు. దానితోపాటు మరల ప్రజాభిప్రాయము అవసరం అన్నారు. ప్రజాఅభిప్రాయం అంటే ఏమిటి ? ఇదివరకు చేతులు ఎత్తే పద్ధతి పెట్టమని చెప్పింది ప్రజాభిప్రాయం. ఇప్పుడు చేతులు ఎత్తే పద్ధతి మానివేశాము. ఓటరు వచ్చి పోలింగు ఆఫీసరు ముందు ఎవరికి ఓటు ఇయ్యదలచుకొన్నారో చెప్పాల్సి ఉంటుంది అనే పాత పద్ధతి పెడుతున్నారు. ఇది ప్రజాభిప్రాయమేనా ? Municipality కి ఒకరకం, Assembly కి ఒకరకం, రహస్య ఎన్నిక పద్ధతి పంచాయితీ ఓటుచెయ్యడానికి వచ్చేటప్పటికి అందరు బహిరంగంగా వచ్చి ఆ భూస్వాములయొక్క ఏజెంట్లముందే మేము ఫలానా వాళ్లకి ఓటు చేస్తున్నాం అని చెప్పడం ఇదే రహస్య పద్ధతి. ఎందుకని ఈ పద్ధతి పెట్టుకున్నారు అని అడిగితే డబ్బు లేదంటారు. జిల్లాబోర్డులు జరిపేదానికి డబ్బులేదు. పంచాయితీల రహస్య బ్యాలెట్ కౌంటు ప్రకారం చెయ్యడానికి డబ్బులేదు. అటువంటప్పుడు ఎందుకొ పంచాయితీలు ? పంచాయితీలు, లేకుండా చేస్తే బాగుంటుంది. ఈ నాటకం ఎందుకు మాకు. డబ్బులేదు డబ్బులేదు అనేటప్పుడు డబ్బులేనిదానికి పంచాయతీలు మాత్రం ఎందుకు. నాటకం ఎందుకు అని నేను అడగాల్సి ఉంటుంది. అంతేకాదు, వార్డు విభజన ఈరోజు Municipality లలో అవుతోంది. Municipality లో వార్డు విభజన సక్రమంగా జరగలేదు. వార్డుకు జనాభాలో చాలా తేడా ఉంది. కాబట్టి వాటన్నింటిని తిరగతోడాలనేది కారణంగా చూపించారు. ఈ కారణానికి సంతోషించాము. ఈరోజు పంచాయితీల వార్డుల విభజన సక్రమంగా జరుగుతోందా ? ఎంత సక్రమంగా జరిగినా వార్డుల్లో ఎన్నుకోబడినటువంటిది సరైన

ప్రజా తంత్రముకాదు. ప్రజాభిప్రాయం స్పష్టంగా వ్యక్తీకరించదనేది స్పష్టం అయినా వార్డుల విభజన సక్రమంగా జరుగుతోందీ, శ్రీ విశ్వేశ్వరరావుగారు మాట్లాడుతూ కృష్ణా జిల్లాలో కొన్నికొన్ని పంచాయతీలలో ఏగకంగా కుంభకోణం జరిగేది మీకు వివరంగా చెప్పారు. కుంభకోణం అంటే అందరికి తెలిసిందే అనుకుంటాను. గందరగోళం చేయడం అన్నమాట. అంతేగాని దేవాలయం కట్టడంలేదు. అందుచేత నేను ఒక ఉదాహరణ చెబుతున్నాను. ఈమధ్య నేను గుడివాడ తాలూకా గురజ అనే గ్రామంలో క్రొత్తగా పంచాయితీని ఏర్పాటు చేయాలనో లేకపోతే పంచాయతీని తిరిగి పెట్టాలనో, గాని చూస్తే 3 స్థానాలు కలిసినటువంటి ఒక వార్డును తయారుచేశారు. ముగ్గురిని ఎన్నుకొనేటటువంటి వార్డును తయారుచేశారు అన్నమాట. ఎందుకంటె గ్రామంలో హరిజనులకు కమ్యూనిష్టులకు పలుకుబడి ఉంది. గ్రామంలో కమ్మ భూస్వాములు పెత్తనంలో గ్రామంలో ఎక్కువమంది వారివినకొల ఉన్నారు. ఈ హరిజన ఓటు రాకుండాచేసేదానికి హరిజనులను వీళ్లను కలిపి ఒకే వార్డుగా 3 స్థానాలకైనా సరే పెడితేతప్ప వాళ్లకి majority రాదు. Majority వచ్చేదానికి అవకాశం కనపడలేదు. అందుచేత ఈ రెండుకాదని మూడు చేశారు. రేపు నాలుగు చేయవలసివచ్చినా చేసేస్తారు అన్నమాట. ఈరకంగా చేస్తూ ఉంటే, ఇది ప్రజాస్వామికము ఏరీతిగా అవుతుంది. అంతేకాదు, ఈరోజు అధ్యక్షుని ఎన్నుకొనేదానికి, దామాషా పద్ధతి ప్రకారము ఎనుకోవడం సరిఅయినది. ఆ పద్ధతి ఈ గ్రామాలలో నేకాదు, మునిసిపాలిటీలలోను, శాసనసభలలోను, పార్లమెంటులోను ఎందుకు మీరు పెట్టకూడదు. ఆ పద్ధతిని పెట్టవలసిందని ముందునుంచి మేము చెప్పతూనే ఉన్నాము. 1947 నుంచికూడ చెప్పతూ ఉన్నాము. అది పెట్టేదానికి అధికారము మీ చేతులలో ఉన్నది. ప్రజాస్వామికమని చెప్పతున్న మీరు దీనికి అమలు జరుపవలసియున్నది. మేము ప్రతిపక్షములో ఉంటె, చెప్పగలిగిందల్లా, ఇది సరియైన పద్ధతికాదు, ప్రజాభిప్రాయాన్ని వెల్లడించడంలేదు, దామాషా వోటింగు వస్తేనే సరిపోతుంది. అని మాత్రమే కాని దాన్ని అమలుజరిపే సంగతి మీలో ఉన్నది. లక్ష్మణదాస్‌గారు అనేక పర్యాయాలు చెప్పారు, ప్రజాస్వామికములో తగాదాలు ఉన్నాయని. కాంగ్రెస్ mark ప్రజాస్వామిక మున్నది, కమ్యూనిష్టు mark ప్రజాస్వామికమున్నది. రష్యాలో ఉన్న ప్రజాస్వామికము మీకు కన్పడదు. అమెరికాలోను, ఇంగ్లాండులోను ఉన్నది మాత్రమే మీకు కన్పడుతుంది. ఆ పద్ధతులను అనుసరించి మీరుభారతదేశంలో ప్రజాస్వామికమని చెప్పవచ్చు. మీప్రజాస్వామికంగురించి మీకు ఎంత నమ్మకం ఉన్నదో, మా ప్రజాస్వామికంగురించి మాకు అంత నమ్మకం ఉన్నది. అంటె రష్యాలో ఉన్నదానికి నేను ఐకాస్త్రీ పుచ్చుకొనవడం

లేదు. రష్యా దానికి రష్యావాళ్లు పుచ్చుకొంటారు మీరు అప్పుడప్పుడు అమెరికా యొక్క వకాల్తా పుచ్చుకొన్నట్లే, నేను అప్పుడప్పుడు రష్యాయొక్క వకాల్తా పుచ్చుకొంటూ ఉంటాను. అమెరికా, రష్యాలమధ్య పేచీ వచ్చినప్పుడు, మీరొక పార్టీ తీసుకొండి, నేను ఒక పార్టీ తీసుకొంటాను, కాని భారతదేశమునకు వచ్చినప్పుడు, ఏది మన ప్రజల అభీష్టాన్ని ఎక్కువ ప్రతిబింబిస్తుందో...

THE HON. SRI N. SANJEEVA REDDI :—Sir, we should not allow this unchallenged. It may be between Mr. Kondaiah and Mr. Sundarayya. But on behalf of the Congress I would like to say that Congress has never taken the order of America nor of Russia. We are independent in respect of our country.

SRI P. SUNDARAYYA :—మేముకూడా India ప్రజలయొక్క లాభాలకొరకు, వాళ్లయొక్క శ్రేయస్సు నుద్దేశించే మేముకూడ చేస్తున్నాము కాని సంజీవరెడ్డిగారు, ఈ కొత్త విషయాన్ని నాదగ్గరనుంచి తెలుసుకొన్నందుకు, ఇదివరకు తెలుసుకోకపోయినా, ఇప్పుడైనా తెలుసుకొన్నందుకు, నేను చాలా సంతోషిస్తున్నాను. అందుచేత ఈ విషయానికి మరల వెళ్ళవలసిన అవసరంలేదు. ఇక పంచాయితీ బోర్డుకు అధ్యక్షుని ఎన్నుకొనే విషయంలో సామాన్యా వోటింగు ప్రకారమే ఎన్నుకొన్నట్లయితే ఈరోజు ఉన్న ఘర్షణలు లేకుండా ప్రజా తంత్రంగా పరిపాలన నడిపేందుకు వీలుంటుంది. కాని దానికి ప్రభుత్వము తయారుగా ఉన్నదా అంటే లేదు. Wards లో nominate చేయబడిన వాళ్లద్వారా ఎన్నుకోబడేటటువంటి పద్ధతి ప్రజాభిప్రాయాన్ని వెల్లడించదు. కొన్తో కూస్తో ప్రజాభిప్రాయాన్ని వెల్లడించి ప్రజలే సరాసరి ఎన్నుకొనేటటువంటి పద్ధతి తీసివేసి ఈ కొత్త పద్ధతి పెట్టడమంటె గ్రామాలలో పెత్తందార్లె తేలికగా ఈ పంచాయితీలను తమ చేతులలో పెట్టుకొనేదానికొరకు దారితీస్తుంది. దీనికితోడు, స్త్రీని పంచాయితీ సభ్యురాలుగా wards లో నుంచి ఎన్నుకోబడినటువంటి వారిని co-opt చేసుకోవాలని ఇంకొక సూచనఉన్నది. నిజమే, పంచాయితీలో ఒక సభ్యత్వాన్ని స్త్రీలకు reserve చేయాలనే దానిలో మాకు అభ్యంతరంలేదు. ఒక స్త్రీ సభ్యురాలు ఉండితీరాలి, జనరల్ ఎన్నికలలో గెలిచినా, గెలువకపోయినా, ఒక స్త్రీ సభ్యత్వాన్ని reserve చేయాలిఅంటే మాకు ఏమి అభ్యంతరంలేదు. ఇదివరకు పంచాయితీ బిల్లులో అటువంటిది తీసుకురాకుండా ఇప్పుడైనా తెచ్చినందుకు చాలా సంతోషము కాని ఈ wards లో నుంచి ఎన్నుకొనేవాళ్లు ఏడుగురు ఉంటె అందులో అధిక పక్షమువారు నలుగురు, majority వారు ముగ్గురు ఉంటే, ఆ

నలుగురు కలసి ఒక స్త్రీని తమ పార్టీవారిని nominate చేసుకొని ఆవిధంగా 50 సంఖ్య అయిదుకు పెంచుకొనే పద్ధతి ఏమి పద్ధతి? నిజంగా స్త్రీ గ్రామం యొక్క సౌభాగ్యమని, గ్రామంలోని స్త్రీలందరియొక్క సౌకర్యంకొరకు కృషి చేసేందుకని మీరు పంచాయితీలో ఒక స్త్రీని ఎన్నుకొనేటప్పుడు, ప్రజలందరు ఎన్నుకొనేటట్లు ఎందుకు చేయకూడదు. అందులో ఉన్న కష్టమేమి? కాంగ్రెసు గానివ్వండి, Socialist Party గా నివ్వండి, స్వతంత్రులుగా నివ్వండి, ఎవరినైనసరే ఒకరిని అందరుకలిసి ఎన్నుకోవచ్చు. అందరికి ఏకాభిప్రాయముంటే, పోటీ లేకుండా ఎన్నుకోవచ్చు. ఒకవేళ పోటీ ఉంటే ఏ స్త్రీ సభ్యురాలుగా ఉంటే, గ్రామానికి ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందో, అటువంటి స్త్రీని, ప్రజలందరు కలిసి ఎన్నుకోవచ్చు. అంతేగాని, ఒక పార్టికి majority వచ్చేదానికొరకు, ఆ పార్టీచేత co-opt చెయించుకొనే పద్ధతి సరియైన పద్ధతికాదు. మీరు సదుద్దేశముతో ఒక మంచిపని చేయదలచినప్పటికి, మీరు అనుసరించే విధానంవల్ల, అది చివరకు ఏ రీతిగా పరిణమిస్తుందో, కొంత జాగ్రత్తగా. తీవ్రంగా ఆలోచిస్తే మీకే కన్పడుతుంది. అందుచేత ఒక పార్టీకి మీరు majority ఇవ్వదలచినప్పుడు ఆ పద్ధతి పనికివస్తుంది, గాని నిజంగా స్త్రీకి ప్రాతినిధ్యమిచ్చి గ్రామాన్ని బాగు చేయాలనుకొన్నప్పుడు, గ్రామ ప్రజలందరు ఎన్నుకొనేటటువంటి స్త్రీనే సభ్యురాలుగా చేయడమనేది అవసరము. తరువాత ఈ wards విభజించేటప్పుడు ఎన్ని అక్రమాలు జరుగుతున్నాయో నేను చెప్పాను. ఇంకా శాసన సభ్యులు తమ తమ నియోజక వర్గములలోని ఇంకా ఎక్కువ ఉదాహరణాలు చెప్పి ఉన్నట్లయితే, ఈ విషయములో ఎన్ని అక్రమాలు, ఎన్ని అన్యాయాలు జరుగుతున్నాయో ఇంకా బాగా మీకు తెలిసిఉండేది. ఈ బిల్లులో 3 వ క్లాజులో, ఈ పంచాయితీ Special Officers కు గాని, లేక పంచాయితీ ఆఫీసర్లకుగాని, పంచాయితీలోనుంచి కొంత భాగాన్ని కలిపేందుకు గాని, తీసివేయడానికిగాని అవకాశమున్నది. అందులో అయిదువందల జనాభాలోపలఉన్న గ్రామాలను కలపమని ఉన్నది. అయిదువందల జనాభాగల ప్రతిగ్రామానికి పంచాయితీ ఏర్పాటుచేయాలంటె చాలా ఎక్కువ పంచాయితీలు అవుతున్నాయి. దానికి కావలసిన ఆర్థిక సౌష్టవం ఉండడంలేదు. పనులుచేసేదానికి కావలసిన staff ఉండడంలేదు. అందుచేత పంచాయితీకి కొంత జనాభా ఎక్కువఉంటేనేగాని లాభములేదు అనేదానికి మేము అంగీకరిస్తాము. ఇందుకు ఎంతజనాభా ఉండాలో, వెయ్యి ఉండాలో, రెండువేలు ఉండాలో, ఎంతఉండాలో దీనికి ఒక సూత్రముండాలి. అటువంటిది పెట్టుకోండి. అంతేగాని, Special Officers ఇష్టంవచ్చినట్లుగాని లేక వాళ్లమీద తెచ్చే వొత్తిడి ప్రకారంగాన్ని, వారికి ఇష్టంవచ్చినట్లు 4 గ్రామాలు కలపడమో లేక

4 గ్రామాలు తీసివేయడమో జరిగితే ఒకచోట వెయ్యి, జనాభా ఉంటే, ఇంకొక చోట 2 వేలు, మరొకచోట 3 వేలుఉంటు ఈ విధంగా గ్రామాలను తారుమారు చేయడానికి అవకాశం ఏర్పడుతుంది. తరువాత గ్రామముల దూరముబట్టి అన్ని కలపబడును అంటే, నేను అందుకే సవరణ తెచ్చాను. మీరు ఎంతవరకు దానిని అంగీకరిస్తారో చూస్తాము. మీరు ఒక గ్రామానికి ఒక మైలు దూరానికి మించకుండా ఉండేవి కలపవచ్చునని, అంతకంటే దూరమున్నవి తీసివెయ్యాలనేటటువంటి నియమ మేదైనా ఉండాలి. ఈ సందర్భంలో విశ్వేశ్వరరావుగారు ఒక ఉదాహరణం చెప్పారు. తేలప్రోలుకు ఆనుకొనిఉన్న 1, 2 ఫర్లాంగులలోఉన్న పల్లెను తీసుకు పోయి దానికి 2 మైళ్లదూరంగా ఉండేటటువంటి ఇంకొక పంచాయితీలో కలపాలని వ్రాసినట్లు తెలుస్తున్నది. కనుక అటువంటి అక్రమాలు జరుగుతూఉన్నాయి. Majority కోసమని ఒక గ్రామంలోఉన్న నాలుగువీధులుతీసి 2 మైళ్లు దూరంలో ఉన్న ఇంకొక పంచాయితీలో కలపడం, అదేవిధంగా majority కోసమని, ఇంకొక గ్రామంలోఉన్న 4 వీధులుతీసి ఈ గ్రామంలో కలపడం జరుగుతున్నది. ఆ విధంగా చేయడానికి ఇప్పుడు అవకాశమున్నది. అటువంటి అన్యాయాలేమైనా జరిగితే మాకు తెలపండి అంటారు. ఇవి మేము ఎవరికి చెప్పుకోవాలి. మంత్రిగారికి నాగేశ్వరావుగారికి, చెప్పుకోవాలి. వారు సెక్రటరీకి వ్రాస్తాను. సెక్రటరీ కలెక్టరుకు వ్రాస్తాడు. ఆయన Special Panchayat Officer కు వ్రాస్తాడు. ఇదంతా అయ్యేటప్పటికి అన్యాయం అన్యాయంగానే పోతూఉంటుంది. ప్రతిదానికి మంత్రిగారి దగ్గరకు పోవలసియుంటుంది. అందుచేతనే, ఇటువంటివి జరుగకుండా బిల్లు చేసేటప్పుడే కొన్ని మాత్రాలు పెడితే బాగుంటుంది. ఇంత జనాభా ఉండాలని గాని, ఇంతదూరములో ఉండాలనిగాని పెట్టుకోండి. అది చేయకుండా పంచాయితీలను తారుమారు చేయడానికి పంచాయితీ ఆఫీసర్లకు సర్వాధికారాలు ఇచ్చేస్తున్నారు. నాకుతోచేది కేవలం జనాభా పెడితే కొన్ని చిక్కులు వస్తుంది. కాబట్టి, నేను జనాభాకు, దూరమును, రెండింటినీ సూచించాను. సుమారు వెయ్యిఅని పెట్టాను. అంటే వంద అటూ ఇటూ ఉండవచ్చు. వెయ్యి కాదంటారా 15 వందల పెట్టండి. ఇన్నివేల జనాభాకు ఒక పంచాయితీ ఉండాలని నిర్ణయించుకోండి. అవి కలపేటప్పుడు ఎంతదూరములో ఉండేవి కలపాలోకూడ నిర్ణయించుకోండి. మైలు కన్నా దూరముగాఉండేటివి కలపడమంటే, ఆ పంచాయితీలు పనిచేస్తాయని అనుకోవడం పొరబాటు.

పంచాయితీలకు ప్రభుత్వము డబ్బు యివ్వకపోతే, అసలు యీ పంచాయితీలు ఎందుకు ? అంతకన్నా, పంచాయితీలకు యివ్వటానికి ప్రభుత్వానికి డబ్బులేదు

కాబట్టి, యీ పంచాయితీలు అక్కరలేదు. ఆంధ్రరాష్ట్రములో వీటిని తీసివేస్తున్నాము" అని ఒక చిన్న క్లాజుతో ఒకబిల్లునుతెస్తే, ప్రతిపక్షమువారు పంచాయితీలు వుంచాలని గొడవచేస్తున్నప్పటికినీ, ప్రభుత్వముయొక్క పార్టీలో ఎలాగో 170 మంది వుంటున్నారు, అది మెజారిటీపార్టీగనుక, యీ బిల్లును ఎట్లాగైనా ప్యాసు చేయవచ్చుగదా! దీనికింత గొడవఎందుకు ? పంచాయితీలు మేము పెట్టబోతున్నామని చెప్పటమెందుకు? పంచాయితీలు పెట్టదలచినప్పుడు, పంచాయితీలకు డబ్బు వుండాలిగదా ! ప్రభుత్వంవాటిని పెట్టదలచినప్పుడు, వాటికి డబ్బులేకుండా పెట్టటమెందుకు ? అవి పెట్టటము గ్రామాలలో ప్రజలలో ఒకరి ఒకరి మధ్య తగాదాలు పెట్టటానికా ప్రభుత్వము పెట్టదలచుచున్నది ? లేకపోతే గ్రామాలలో పంచాయితీలు పనిచేయటానికేనా ? గ్రామాలలో పనిచేయడానికి పెట్టేటట్లైయితే, వాటిని డబ్బులేకుండపెట్టితే ప్రయోజనమేమి ? గ్రామాలు సౌభాగ్యవంతముగా చేయాలంటే, డబ్బులేనిది పంచాయితీలు మాత్రము ఎట్లా సౌభాగ్యవంతముకాగలవు ? అటువంటి వుద్దేశ్యమువుంటే, ప్రభుత్వము పంచాయితీలకు డబ్బు ఎందుకు యివ్వకూడదు ? Taxation Enquiry report ప్రకారము పన్నులువేస్తున్నామని చెప్పి, ప్రతి సంవత్సరము ఏదో ఒక పన్నువేయటానికి శాసనసభలోనికి బిల్లులుతెచ్చి ప్యాసు చేయిస్తున్నది ప్రభుత్వం. ఆ Taxation Enquiry report లో పంచాయితీలను గురించి అందరు చదివేవుండవచ్చు. ముఖ్యంగా లక్ష్మణదాసుగారు గూడ చదివేవుంటారను కుంటాను. కొండయ్యచౌదరిగారు లాయరుగనుక ఆయన కూడ తప్పకుండా చదివివుంటారనుకుంటాను. ఈ రిపోర్టులో ఏమివ్రాసివున్నదో చదువుతాను, వినండి.

"We recommend that not less than 15 per cent of the land revenue collected in the area of a local body should in all states be allotted as its share of the revenue to that body. We would emphasise that we regard 15 per cent as the very minimum."

అని వ్రాశారు. ఇది గరిష్టపరిమాణముకాదు. బొంబాయిలో 30% అని అన్నారు. ఆ details అన్నీ గోపాలకృష్ణయ్యగారు చదివారు. మనము ఇక్కడయిస్తామని అనుకుంటున్నది యీ 15% minimum అని అనుకునేదానికి యింకా యీ 12½% తక్కువేగాదా. అనికూడా వ్రాశారు.

"And even where only this minimum, and no more is allotted, we consider that an increase of land revenue

receipts, if this results from the standardisation or revision should be made the occasion for increasing the percentage or for otherwise passing on the benefit to local areas either as a general grants to local bodies or as contribution for the execution of specific projects," అని కూడా వ్రాసారు.

అందుచేత పంచాయితీబోర్డులయొక్క రోజురోజువ్యవహారాలు నడపటానికి రాష్ట్రప్రభుత్వానికి వచ్చే land revenue లో నుంచి కనీసము అదిగూడ కనిష్టములో కనిష్టము. అంతకన్నా అడగటానికి వేలులేదు కాబట్టి, 15% యివ్వాలని అంటే, అంతకంటే యింకా తక్కువగానే 12% యిచ్చేటట్లుగా చట్టము చేశాము. ఆ విధంగా చేసినప్పటికినీ, యీ 12% కూడా యివ్వలేము, ప్రభుత్వానికి డబ్బు లేదు కాబట్టి పంచాయితీలకు యిచ్చేదియేమిలేదు కాబట్టి పంచాయితీలకు డబ్బు ఉండదు కాబట్టి వాటిని నడపటానికి గ్రామ మునసబుల చేతనో, లేక గ్రామ కరణముల చేతనో, అదీకూడ కాకపోతే పోలీసు ఆఫీసర్ల చేతనో పరిపాలన ప్రస్తుతము సాగించుదాము, తరువాత ఎప్పుడో డబ్బు వచ్చినప్పుడు, చూద్దాం అని ప్రభుత్వం తలిస్తే సగము ఏమిటి, land revenue అంతాయిచ్చివేద్దాము అని, మన లక్ష్మణ దాసుగారు గూడ చాలా ఉదారభావముతో చెప్పారు. (Interruption) వారు కాకపోతే యింకొకరు చెప్పారు. అయినగూడ కాంగ్రెసు సభ్యులే అనుకోండి. ఎవరైతే నేమి ఆ పార్టీలోవారే చెప్పారు.

SRI L. LAKSHMANA DAS :—ఈ విషయములో ఒరిస్సాలో కాంగ్రెసు ప్రభుత్వం వున్నది. ఆ ప్రభుత్వంకూడా యివ్వటానికి ఒక బిల్లును తయారు చేసిందనే సంగతి సుందరయ్యగారికి తెలుసు. కాంగ్రెసువారు గ్రామ స్వరాజ్యమును గురించి ఏ విధంగా కృషి చేస్తున్నారో ఆ సంగతిని గురించి నేను ఇక్కడ చెప్పనవసరములేదు.

Sri P. SUNDARAYYA :— అధ్యక్షా, ఇప్పుడు నాకున్న బాధ ఏమిటంటే, నేనుగూడ కాంగ్రెసునాయకులు మాట్లాడినట్లుగా తియ్యటి మాటలు చెప్పడములేదు. కాంగ్రెసునాయకులు మాట్లాడే తియ్యటి మాటలతో బిల్లును తీసుకొనిరావడములో వారు ఏ విధంగా వినియోగించుచున్నారో నేను ఆ విధంగా చెప్పడములేదు. కానివారు చెప్పేమాటలు, వారు తెచ్చే బిల్లులు అన్ని చూస్తే ఆఖరుకు అవి ఆచరణలోకి వచ్చేటప్పటికి చాలా భేదము కనబడుతున్నది. ఒరిస్సాలో బిల్లు తయారు చేశారని అంటున్నారు. మనముకూడ యిక్కడ బిల్లును తయారు చేశాము. అది ప్యాసు చేయడముకూడ జరిగింది. ఇప్పుడుకాదు, దాన్ని ప్యాసు

చేసింది దాని ప్యాసు చేసి నాలుగు సంవత్సరాలు అయింది. అందులోనూటికి 12½ రూపాయి పంచాయితీబోర్డులకు యివ్వాలని అనుకుని ప్యాసు చేశాము. అదియింత వరకు పంచాయితీలకుయివ్వలేదు. డబ్బులేదని చెప్పేటప్పుడు ప్రభుత్వము అటువంటి బిల్లును ఎందుకు ప్యాసు చేయవలసి వచ్చింది? సరే యిప్పుడు డబ్బులేదని అంటున్నారు. రేపుకాదు ఎల్లుండి అయినా డబ్బు వస్తుందని గ్యారంటీ ఏమిటి? డబ్బు వస్తేమటుకు, యిస్తారన్న గ్యారంటి ఏమిటి? తీరా యివ్వవచ్చేటప్పటికి, ఇంకొక కారణము ఏదైనా చెప్పవచ్చు. అయినప్పటికన్ని అప్పుడు మాత్రం ఎక్కువ ఖర్చులు వుండవన్న గ్యారంటీ ఏమిటి? ప్రభుత్వము డబ్బుకోసం పన్నుల మీద పన్నులు వేసి వసూలు చేయటానికి తలపెట్టుతున్నది. ప్రభుత్వానికి ఖర్చులు ఎక్కువ గావున్నవి. అందుకోసం పన్నులు వేయాలి అని ఒక ప్రక్కన చెబుతూనే వున్నారు. ఇంకా ఎక్కువ ఖర్చులు వున్నవనికూడా చెబుతున్నారు. ఒక వేళ డబ్బు వచ్చినాకూడా పంచాయితీలకు యిస్తారన్న నమ్మకము కనబడడము లేదు. భూమి సిస్తులోనుంచి 12% యిస్తామని చెప్పడము పంచాయితీలకోసమే గదా. ఇప్పుడు ఈ అరు పైసలు ఇవ్వడముకూడా ఈ పంచాయితీలకోసమేగదా కాబట్టి దీన్ని అసలు రద్దు చేస్తే ప్రభుత్వము దీన్ని యివ్వనట్లె స్పష్టంగా తేలిపోతుంది. అదికనపడకుండా వుండాలంటారా, అట్లాగైనా చేయండి. దాన్ని గురించి ఇదివున్న పరిస్థితి. అందుచేత ఈ 12% తీసి వేయాలి అని ప్రభుత్వం చెప్పడం చాలా తప్పు. పోనీ, ప్రభుత్వంయొక్క Land Revenue లోనుంచి ఈ 12½% పంచాయితీలకు యివ్వవలసిన పంచాయితీల ఆదాయాన్ని వాటికి ఇవ్వకుండా మానివేస్తే అంతటితో సంతృప్తిపడతారాంటే, అంతటితో సంతృప్తిపడేది యేమిలేదు. దానిమీద ఇంకా అదనపు ఖర్చులు అని చెబుతున్నారు. డబ్బుతో ఏవో ఘనకార్యాలు చేస్తామని, ఇందులో ఒక భాగము జిల్లాబోర్డులకు యివ్వాలని మొన్న నేకాంగ్రెసువారు ఒక బిల్లు తెచ్చి ప్యాసు చేయాలనివచ్చారు. ఇదేమిటయ్యా! అసలు పంచాయితీబోర్డులకు ఇచ్చేదే ఎంతో తక్కువగావుంటే, అందులోనుంచి జిల్లాబోర్డులకు ఇవ్వాలనిఅంటారని కాంగ్రెసు సభ్యులే అడిగేటప్పటికి, అప్పటికప్పుడు, ఈ కాంగ్రెసు పార్టీహాలులో గుసగుసలాడుకొని అక్కడ పార్టీహాలులో ప్యాసు చేసుకొని బైటికి వచ్చారు

An Hon. MEMBER :—పార్టీ మీటింగులో ఏమిజరిగిందో ఎట్లా చెప్ప గలుగుతున్నారు?

Sri P. SUNDARAYYA :—కాదనిఅంటే మాత్రము లాభమేమిటి? అక్కడ కాంగ్రెసువారు మాట్లాడుకున్న సంగతులన్నీ మాకు వినబడుతూనేవున్నవి. మీరు అక్కడ లోపలవున్నారు. మేము యిక్కడవున్నాము. మీరు అనుకున్న మాట్లలు మాకు వినపడుతూనేవున్నవి. మేము అనుకునేమాటలు మీరు వినివుండ

వచ్చు. ఇద్దరిమాటలు ఒకరివి ఒకరికి వినపడుతూనేవచ్చినవి. పంచాయితీబోర్డులకు యిదివరకు వచ్చేఆదాయములో కొంత జిల్లాబోర్డులకు యిచ్చివేయడంవల్ల, పంచాయితీల ఆదాయాన్ని తగ్గించివేశారు. అంతటితో ఊరుకున్నారా అంటే, అదేమి లేదు. పైగా రెండు కొత్తక్లాజులు తీసుకొనివచ్చి పెట్టారు. ఈ క్లాజులు దేన్ని గురించి అంటే, పంచాయితీబోర్డుల Accounts audit చేయించాలట. Audit చేయించందుకు, దానికి అయ్యే ఖర్చు పంచాయితీబోర్డు వారే భరించాలట. Audit చేయాలని అంటున్నప్పుడు, పంచాయితీలకు అసలే ఆదాయములేని పరిస్థితి వుంటున్నప్పుడు యీ ఖర్చు పంచాయితీ బోర్డులు ఏ విధంగా భరించగలవు? ప్రభుత్వము audit చేయాలని అంటున్నప్పుడు, ప్రభుత్వముయొక్క audit staff చేతనే చేయించండి. ఇప్పుడు పంచాయితీలకు ఖర్చు తప్పి పోతుందిగదా? ఆ విధంగా ఎందుకు చేయించరాదు? పంచాయితీబోర్డులకు డబ్బులేక, ప్రభుత్వము యిచ్చేది, యిస్తానన్నది యివ్వక, యీ విధమైన పరిస్థితిఉంటే, పైగా యీ అదనపు ఖర్చు పంచాయితీబోర్డుల నెత్తిమీద వేయడము ఎందుకు? ప్రభుత్వముయొక్క Audit staff చేత Audit చేయించటానికి మాకేమి అభ్యంతరములేదు. పంచాయితీబోర్డులు యీ Audit ఖర్చు ఎక్కడినుంచి పెట్టుకుంటుంది? ప్రభుత్వము యిస్తానన్న ఆదాయముయిస్తే, పరవాలేదు. ఇచ్చేది యివ్వకపోగా, యీ Audit ఖర్చుకూడా పంచాయితీబోర్డులే పెట్టుకోవలసివస్తున్నది. పోనీయండి Audit ఖర్చులు ఏ నాలుగువందలో అవుతుందని అనుకుంటే, యిదిగాక యింకొక క్లాజును తెచ్చిపెట్టారు. అది పదియవక్లాజు. ఈ క్లాజులో ఏమిఉన్నదంటే" "And any person other than the executive officer who is not appointed, may, if the government so direct, receive payments for his services, from the panchayat" అని వున్నది.

దీన్నిబట్టి పంచాయితీబోర్డులను Supersede చేసో, లేక కొత్తగా ఎన్నికలు పెట్టో, ఒక Executive officer నో, లేకపోతే, యింకొక Special officerనో ప్రభుత్వంవేస్తే, యిక ఆయనయొక్క జీతభత్యాలన్నికూడా యీ పంచాయితీబోర్డు డబ్బులోనుంచే యివ్వవలసివుంటుంది. అందుచేత పంచాయితీబోర్డులు పెట్టడమంటే యిక యీ పంచాయితీబోర్డుల డబ్బుఅంతా ఉద్యోగస్థుల జీతభత్యాలు యివ్వటానికేనా? అటువంటప్పుడు యీ పంచాయితీ బోర్డులు ఎందుకు? ఈ బోర్డుకు ఎన్నికలు ఎందుకు? ఏకముగా, ఒకేసారి ప్రభుత్వోద్యోగస్థులనేవేసి, వీటి పరిపాలన చూడమని చెప్పవచ్చును గదా! (Interruption by Hon. Minister) క్లాజుల విషయమును గురించి చర్చించేటప్పుడు, అవి అన్నీ వివరంగా మాట్లాడుతాను. అంతేకాకుండా Special officer ను కొత్తగా

పంచాయితీబోర్డులకు ఏర్పాటుచేసేటప్పుడు యిదివరకు యాక్టులోవున్న 122 వ సెక్షనుక్రింద మరల ఒక కొత్తసెక్షను తీసుకొచ్చి పెట్టారు. ఆ కొత్త సెక్షనుక్రింద Special officers ను వేయడములో, ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యమేమిటి? కొత్తగా పంచాయితీబోర్డులను ఏర్పాటుచేస్తామనిచెప్పి గెజటునోటిఫికేషను చేయడము, అయిపోయినతరువాత యిక ఎన్నికలు జరపవలసివుంటుందిగదా! సభ్యుల ఎన్నికలుజరిపి, అటుతరువాత అధ్యక్షుని ఎన్నికజరిపి, పంచాయితీబోర్డును Constitute చేయటానికి మేము Special officerను మాత్రము వేస్తాముఅని అంటున్నారు. అది చాలా బాగానేవున్నది. అయితే పంచాయితీ సభ్యుల ఎన్నికలు జరపటానికి, తరువాత అధ్యక్షుణ్ణి ఎన్నుకోటానికి Special officer ను వేస్తే, యిక యీ అధ్యక్షుని తరఫున పనిచేయటానికి, పంచాయితీబోర్డు తరఫున పనిచేయటానికి, అప్పుడు పంచాయితీబోర్డు అధ్యక్షుని హక్కులుఅన్నీ ఆ Special officer కు సంక్రమింపచేయటానికి, బిల్లులో యీ క్లాజులయొక్క అవసరము ఏమివచ్చింది? పంచాయితీబోర్డులను కొత్తగా నిర్మించటానికి Special officer ను వేసినప్పుడు ఎన్నికలు జరపటానికిమాత్రమే ఆయన బాధ్యుడు అవుతాడు. అంతటితో ఆయనయొక్క బాధ్యత తీరిపోతుందిగదా! కానిహక్కులుఅన్నీ ఆయనకు వస్తాయనిఅంటే అవి ఎట్లావస్తాయి? ఎన్నికలు జరపబోయేముందు ఫలానాగ్రామానికి చెందినపంచాయితీబోర్డు ఎన్నికలు జరుగుతాయని Gazette notification చేసి, తరువాత ఎన్నికలుజరిపేవరకు ఎన్నికలుజరిపే హక్కు పంచాయితీబోర్డుకు వుండవు. పంచాయితీ అధ్యక్షునికి వుండవు. Special Officer ను వేసి, ఆయనకు ఎన్నికలు జరిపే హక్కు యిచ్చి ఎన్నికలు జరుపుతారు. హక్కు యివ్వకపోతే, పంచాయితీ బోర్డు డబ్బు ఆయన ఖర్చుపెట్టటానికి వీలు లేదు. పంచాయితీ యాక్టులో యిప్పుడు తెచ్చిన క్లాజు ప్రకారము Special Officer కు పంచాయితీ బోర్డు హక్కులు బోర్డు ప్రెసిడెంటు హక్కులు రెండూ కూడ వుండ, అసలు యీ లోపల ఎన్నికలు జరిగినా, జరపకపోయినా, ఎన్నికలు, జరపకుండా తన యిష్టము వచ్చినట్లుగా వాయిదా వేయటానికిగూడ హక్కువుండీ కూడా తన యిష్టము వచ్చినట్లు పంచాయితీబోర్డు తరఫున సర్వ వ్యవహారాలు ఆయన యిష్టం వచ్చినట్లు సాగించటానికి యీ క్లాజుద్వారా హక్కు ఏర్పడుతున్నది. అసలు ఆయన వాయిదావేస్తాడు, వేయడు అదికాదు విషయము యిక్కడ. ఈ రకమైన క్లాజును బిల్లులో చేర్చడములో ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యమేమిటి? కేవలము పంచాయితీ బోర్డుల ఎన్నికలు మాత్రము జరపటానికా యీ Special Officer ను వేయడం? అయితే కేవలము ఎన్నికలు జరిపేహక్కు మాత్రమే కాకుండా పంచాయితీ బోర్డుయొక్క హక్కు, అధ్యక్షునిహక్కు యీ రెండు

Sri P. Sundarayya] [6th December 1955

హక్కులు Special Officer కు సంక్రమించేటట్లు చేయటానికే యీ క్లాజును తీసుకొనివచ్చి పెట్టారా ? (Interruption). నేను కొన్ని మంచి సలహాలు ప్రభుత్వానికి యిచ్చినప్పటికినీ, అవి మంచి సలహాలేనని ప్రభుత్వపక్షములోవున్న కాంగ్రెసు సభ్యులు మనస్సులోపల అనుకొన్నప్పటికి అవి మంచి సలహాలని బైటికి వారు చెప్పకుండావున్నా, మేము చేసేది యేమీలేదు. నిజానికి నేనుచేసే సూచనలు మంచివని అంగీకరిస్తే, అవి ప్రజలకు వుపయోగపడేవే. అంగీకరించకపోతే, నా సలహాలన్నీ నిరుపయోగమే అవుతాయి. అందుచేత యీ క్లాజులు యీరకంగా వున్నవి. తరువాత మిగిలినవి Consequential clauses వున్నవి. వాటి వివరాలలోకి నేను యిప్పుడు దిగదలచుకోలేదు. అందులో ప్రజలను వలలో పడవేయటానికి యింకా ఎన్నో మర్మాలు, రహస్యాలువున్నవి. ఇప్పుడు నేను వాటిలోతుకు పోయి యిక్కడ చర్చించదలచలేదు. ఆఖరుకు నేను చెప్పేది యేమిటంటే యీ సవరణలు అన్నీ pass చేయడానికి వీలుగా కాంగ్రెసు సభ్యులు మొత్తము 178 మంది మెజారిటీతో వున్నారు. అందరూ యిక్కడ సభలో యిప్పుడు లేకపోయినా అందులో యిప్పుడు ఏ ఇరవైమందో వున్నప్పటికినీ, ప్రభుత్వానికి యీ సవరణలు పాస్సుచేయడానికి మెజారిటీవున్నది. పాస్సుచేయవచ్చును. దానికి నేను బాధపడడములేదు. ఎంతమందివున్ననూ, నేను చేసే సూచనలు విని అర్థము చేసుకుని అవి అంగీకరించి పాస్సుచేస్తే మంచిదే.

THE HON. SRI N. SANJEEVA REDDI:—సరిగా అర్థము చేసికొని అంగీకరించదలిస్తే, యిక్కడ అందరూ వుండేవారేగదా !

SRI P. SUNDARAYYA :—అట్లాకాదు. వారు యిక్కడ లేని కారణమువేరు. "ప్రతిపక్షమువారు మంచి సలహాలు ఎన్నిచేసినా, అవి మేము విని, అర్థము చేసుకొని, అంగీకరించటానికి ఎట్లాగా వీలుకాదుకదా ! మనకు కాంగ్రెసు పార్టీ మన వెనుకవున్నదే. అది ఎట్లా చేతులెత్తమంటే, అట్లాచేతులెత్తవలసిందే గదా ! ఈ opposition వారు ఎన్ని మంచి సలహాలు యిచ్చినా, అవి మనము ఎట్లాగూ అంగీకరించటానికి వీలుకాదుగదా అని, యిక్కడ వారులేకుండా పోయారు. అందుచేత మేము ఎన్ని మంచి సలహాలు యిస్తూ ఉపన్యాసాలుచేసినా అవి అన్నీ నిరుపయోగమే వాటిని ఆదరించేవారే లేరు. ఇక మంత్రులు మాత్రము అనుకునేది ఏమిటంటే యిది ప్రజాస్వామ్యము గనుక యిక్కడ మేముచేసే సూచనలు తమ పార్టీ ఎదుట పెట్టి వారి అంగీకారము తీసుకుంటే బాగుంటుందని అనుకుంటూ వుండవచ్చు. కాంగ్రెసు పార్టీలోగూడా అందరూ ఒకే అభిప్రాయముతో వుండరు. అందులో కూడ భేదాభిప్రాయాలు వున్నవారు లేకపోలేదు. కాబట్టి ఏ చిన్నచిన్న విషయాలైనను కాంగ్రెసు పార్టీలోగూడా దెబ్బలాడటానికి చాలామంది వుంటారు. అందరూ

ఒకే అభిప్రాయముతో వున్నారా, అంటే అది నాకు నమ్మకములేదు. ఇక్కడ కమ్యూనిస్టులు చెప్పారనికాదు. కాంగ్రెసు పార్టీవారైనా, రేపు మరల ఎన్నికలు వచ్చినప్పుడు, మరలవారు ప్రజలవద్దకు ఎట్లాగైనా పోవలసివుంటుంది. ఆ వుద్దేశ్యముతో నైనా, కాంగ్రెసు పార్టీలోని వారు దెబ్బలాడే వారు చాలా మంది వుంటారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—కమ్యూనిస్టు పార్టీలో మాత్రము లేదా ! అక్కడ మాత్రము జరగడములేదా ! నాకు తెలుసును.

SRI P. SUNDARAYYA :—మా కమ్యూనిస్టు పార్టీలో ఏ రకంగా వున్నదో అది మాకు తెలుసునుగాని, సంజీవ రెడ్డిగారికి సరీగా తెలియదు. వారు మా పార్టీలో లేరు కాబట్టి, బహుశ మా పార్టీలో ఏమి జరుగుతున్నదనీ వారికి తెలియదు. మా పార్టీలో జరిగేది మాకు తెలుసును. అందుచేత ఈ బిల్లులోని విషయాలు అన్నీ చూచినప్పుడు, ఈ బిల్లు సమర్థనీయముకాదనే చెప్పుతాను. ఈ బిల్లు ప్రజలకేమాత్రము ఉపయోగించదు. దీనిలో ఎన్నో విషయాలు పరిశీలించవలసియున్నది. ఇప్పటికైనా మునిగిపోయిందియేమిలేదు. దీన్ని Select Committee కి పంపించి అక్కడ దీన్ని బాగుగ చర్చించి తగిన మార్పులు చేయడం మంచిది. Select Committeeకి పంపితే మరి రెండు మాసాలు ఆలస్యమైతే కావచ్చు. ఆ తరువాతనే ఎన్నికలు పెట్టుకోవచ్చు. ఈ రెండు నెలలో మునిగిపోయేది యేమీ లేదు. కాబట్టి దీన్ని తొందరపడి ఇక్కడ ప్యాసు చేయడం అంత మంచిపనికాదు. రెండు నెలలు ఆలస్యమవుతుందని, దీన్ని తొందరపడి ప్యాసు చేయడం సమంజసముగా లేదు. ఈ బిల్లు చాలాముఖ్యమైనది. 1350 గ్రామాలకు సంబంధించినది ఈ బిల్లు. అనేకమంది సభ్యులు చెప్పినట్లు దీనిలో చాలా విషయాలు ఆలోచించి తగినవివున్నవి. ప్రభుత్వానికి మెజారిటీ వున్నదని దీన్ని తొందరపడి ప్యాసు చేయడము ప్రజలకు శ్రేయస్కరముకాదు. ఒక వేళ తొందరపడి దీన్ని ప్యాసు చేస్తే, మరల ఇంకా కొన్ని సవరణలతో ఈబిల్లు శాసనసభముందుకు తప్పకుండా రావలసిన అగత్యము కలుగుతుంది. కనుక సభ్యులు చెప్పినట్లు దీన్ని ప్యాసు చేయకూడదని నా అభిప్రాయము. పదేపదే ఈ బిల్లును మరలకొన్ని సవరణలతో శాసనసభముందుకు తీసుకొనిరావటం ఎట్లావుంటుందంటే, ఎదో సామెత చెప్పినట్లు "పనిలేని మంగలివాడు పిల్లి తలకాయి గొరిగినట్లు" గా వుంటుంది. ఒక సారి తొందరపడి ప్యాసు చేయడము మరల సవరణలలో ఇక్కడకి ఇంకొక సవరణ బిల్లు రావడం, అంత మంచిపనికాదు. ఇందాక ఒక సభ్యుడు మాట్లాడుతూ, మంత్రి నాగేశ్వర రావుగారు స్థానిక సంస్థల మంత్రిగా వచ్చిన తరువాత దురదృష్టవశాత్తు ఆయనకు వుండవలసిన departments

ఆయన క్రింద లేకుండా తల ఒక మంత్రికి పంచి పెట్టటం జరిగిందని చెప్పారు. Entertainment Taxes ఆయన స్వాధీనంలో లేదు. Public Health ఆయన క్రింద ఉండవలసింది, అది ఇంకొక మంత్రి క్రిందకు పోయిందని చెప్పారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :- ఈ విధంగా జరగడము, నాగేశ్వరరావుగారు మంత్రిగా రాకముందుకుంచే జరిగింది. ఆయన వచ్చిన తరువాత జరగలేదు.

SRI P. SUNDARAYYA :—మీయొక్క పరిపాలన అట్లువున్నదన్న మాట. దీనికి నేను ఏమి చేయలేను.

THE HON. SRI N. SANJEEVA REDDI :— మా పార్టీలోనూ విబేధాలు కలిగించడానికి ప్రయత్నము చేస్తున్నారు. మంత్రివర్గములో విభేధాలు కలిగించడానికి ప్రయత్నము చేస్తున్నారు. అదిఅంతాఫలించదు. ఎందుకు కాలము వృధా చేసుకొంటారు.

SRI P. SUNDARAYYA :— నేను అంత అమాయకుడిని కాను. కేవలం నా ఉపన్యాసంతోనే మంత్రివర్గము లో అశాంతి చీలికలు వచ్చినట్లయితే పార్టీలో అశాంతి చీలికలు వచ్చినట్లయితే ఈ రోజు ఇది ఒక పనిగా గట్టుకొని 4, 5, గంటలు ఉపన్యాసము ఇచ్చే వాడిని. అయినా మీ పార్టీలో చీలికలు నేను పెట్టాల్సిన అవసరం లేదు: మీచీలికలు మీకే ఉన్నాయి. అందువల్ల నా ఉపన్యాసం ద్వారా ఇంకా చీలికలు ఎక్కువ అవుతాయియనుకోవడము లేదు.

బడ్జటు ఉపన్యాసంలోనే స్థానిక పరిపాలనా డిపార్టుమెంటు అర్థము లేనటువంటి రీతిగా ఉన్నదని నేను చెప్పాను. దానికి కావలసిన department అంతా మంత్రిగారి చేతికి ఇవ్వకుండా దానికి కావలసిన డబ్బు మీరుకూడా ఆయనకు పెత్తనము ఇవ్వకుండా మంత్రిగారి డిపార్టుమెంటులన్ని చీల్చివేసి కేవలం ఎన్నికలు పెట్టే పద్ధతి, రద్దుచేసే పద్ధతిమీద హక్కు మాత్రమే మంత్రిగారికి ఇచ్చినట్లు ఉన్నారు. అందుచేత ఈ పంచాయితీబోర్డులను రద్దుచేసే బిల్లులను, హక్కులను సంకుచితముచేసే బిల్లులను మాత్రము మంత్రిగారు దురదృష్టవశాత్తు శాసనసభ ముందుకు తీసుకురావడము, మీరు మాకేమి మంచిచేయడంలేదు. ఎన్నో పొరపాట్లు చేస్తున్నారని చెప్పాల్సినస్థితి మాకు రావడం జరుగుతోంది. ఇరిగేషన్ విషయంలో అయితే కొన్ని అభిప్రాయబేధాలు ఉండవచ్చును. నందికొండ వద్దని కొందరు, కావాలని కొందరు, అట్లానే తుంగబద్ర ఎగువకాలువ కావాలని కొందరు, వద్దని కొందరు అంటుంటారు. ఇవన్ని మంచి ఉద్దేశ్యాలే. ఆయన చేసిన మంచి ఏమీ

కనిపించడము లేదు. అన్నీ కూడ ఇటువంటి బిల్లులే వస్తున్నాయి. అయినా ఇప్పటికి కూడా మారిపోయినది ఏమీలేదు. మంత్రిగారు జాగ్రత్తగా ఆలోచించి దీనిని సెలక్టు కమిటీకి పంపించి అంగీకరిస్తే బాగుంటుందని, ఈ బిల్లును గురించి ఊరికే కల్పించి చర్చించేదానికంటె ఏ రీతిగా దీనిని మార్పులు చేసేదానికి వీలవుతుందో చూడాలి. మా మెజారిటీ మాకువుంది అంటే ఎమీ చేసేది లేదు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అధ్యక్షా. సుమారు 16 మంది గౌరవసభ్యులు ఈబిల్లుమీద మాట్లాడి చాలావిషయాలు చెప్పారు. అందులో ఇదివరకు ఆచరించనివి కొన్ని సూచనలుచేశారు. తప్పకుండా అవన్నీ ప్రభుత్వము ఆలోచిస్తుంది. ముఖ్యముగా సుందరయ్యగారికి, ప్రతిపక్ష సభ్యులకు పార్టీలో మెజారిటీ ఉన్నదిగదా, లేకపోతే ఈవాళ ఆఖరురోజుగదా, ఇది మీరంతా ఆలోచించుకొని వచ్చారుగదా అనే అభిప్రాయాలతో చేసిందికాదని మాత్రం నేను వినయ పూర్వకంగా మనవిచేస్తున్నాను. ఇదివరలో సుమారు 12 సంవత్సరములు కౌన్సిలు అనుభవముతో, 7½ సంవత్సరములు చైర్మను అనుభవముతో, ఈ 8 నెలలు స్థానిక సంస్థలు అన్ని తిరిగివచ్చి, accounts దగ్గరనుంచి అన్నీ చూచిన పరిస్థితుల్లో దినదినము వారి కార్యక్రమాల్లో ఉండే ఆటంకాలు అన్నీ తొలగించేందుకు ఈబిల్లు తీసుకురాబడింది కాని మాకు మెజారిటి ఉన్నదిగదా, లేకపోతే ఈ రాష్ట్రములో ఉన్న పంచాయితీలన్నీ తీసుకువెళ్లి ఒక పార్టీకి కట్టబెట్టాలన్న అభిప్రాయముతోకూడా కాదని మాత్రము నేను వారికి వినయపూర్వకంగా మనవిచేస్తున్నాను. 3 వ సెక్షను క్రింద Inspector General of Local Administration కు ఇదివరకు ఏమీ powers వుండడంఅంటే మామూలుగా 500 జనాభా కలిగిన ప్రతి గ్రామానికి ఒక పంచాయితీ ఏర్పాటు చేయాలని ఉన్నది. ఒక ప్రక్క ఈ liability ఉన్నదేమో అనే అభిప్రాయముతో ఇంతవరకు 1000 జనాభా ఉన్నవాటికి ప్రస్తుతం ఎన్నిక జరుగుతుంది. ఇంకా సుమారు 8000 గ్రామాలకు పంచాయితీలు ఏర్పాటు చేయవలసిఉన్నది. దానికి కార్యక్రమము ఏర్పాటు చేయడము కూడా జరిగింది. ముఖ్యంగా ఈ 8 నెలలోనూచూస్తే revenue accounts ప్రకారము ఒక revenue village ఉన్నది. Inspector-General of Local Administration కూడా కొన్ని గ్రామాలు కలిపి revenue village క్రింద పంచాయితీ act Purpose కోసం declare చేయడానికి powers ఉన్నా ముఖ్యమైన village ఉంటే దానికి శివార్లలో వున్నవి 2 మైళ్ళ ఉన్నది, 3 మైళ్ళ దూరాన ఉన్నప్పుడు అది దాంట్లోనుంచి separate చేయడానికి ఇదివరకు power వుండేది. అంటే దీని జనాభా 500 పైన ఉంటుంది. ఇది ముఖ్యమైన కారణము అనుకొన్నప్పుడు దానికికూడా ఒక పంచాయితీ ఏర్పాటు చేయవచ్చును. కాని ఒక

Sri A. B. Nageswara Rao] [6th December 1955

ముఖ్యమైన village కి శివారు 2,3 ఊళ్లలో ఉంటే దాని ప్రక్కన ½ మైలు, 2 ఫర్లాంగులు ఇంకో ముఖ్యమైన village ఉన్నప్పుడు జనాభా 500 కంటే ఎక్కువ ఉంటే ఆ రెండూ కలుపడానికి ఇదివరకు సావకాశములేదు. అందుచేత ప్రతిదినము వచ్చే అర్జీలు పట్టిచూస్తే రెండవ రెవిన్యూ village కి సంబంధించిన శివారు గ్రామాలు దాంట్లో కలుపడానికి ప్రస్తుతము ఉన్న act ప్రకారము వీల్లేదు కాబట్టి ఒక hamlet village తీసుకువెళ్లి ఇంకొక ప్రక్కన ఉన్న revenue village కి కలుపడానికి సావకాశము తీసుకోవడానికి మాత్రమే ఇది జరుగుతుంది. ఇప్పుడు సుందరయ్యగారు చెప్పినట్లు ఒక village లో ఉన్న 4 వీధులు తీసుకుపోయి, ఇంకొక ప్రక్క ఉన్న village లో కలిపి ఒక పంచాయితీని ఏర్పాటు చేస్తారా అన్నారు. Village నుంచి ఒక ఊరు విడదీస్తున్నప్పుడుకాని లేకపోతే ఇంకో పంచాయితీ గ్రామానికి కలుపుతున్నప్పుడు ఇప్పుడు ఉన్న act ప్రకారంగాకూడా ఆ పంచాయితీకి కలిపితే, ఆ పంచాయితీ దగ్గరనుంచి సమాధానమువచ్చిన తరువాతనే Inspector General of Local Administration చేస్తున్నారు. కాని వారు చెప్పినట్లు ప్రజాభిప్రాయము తీసుకోకుండా, పంచాయితీ బోర్డును consult చేయకుండా చేయడంలేదని మాత్రం వారికి మనవిచేస్తున్నాను. రోజు అధమం 12 అప్లికేషనులకు తక్కువ రావడములేదు "ఈ గ్రామాలు మాదాంట్లో నుంచి విడదీయండి లేకపోతే ఆ గ్రామాలు తీసుకువచ్చి వారికి కల్పించి, అవన్నీ అనుభవముమీద తీసుకున్నప్పుడుగాని ఏదో ఒక దురభిప్రాయముతో చేస్తున్నారని కాని లేకపోతే అన్నీ తీసుకువెళ్లి ట్రెజరీ బెంచీమీద కూర్చున్న మెంబర్లకు కట్టబెడుతున్నామనిగాని లేదని వారికి వినయపూర్వంగా మనవిచేస్తున్నాను. ఈ విషయంలో స్త్రీలకు co-options విషయంలో స్త్రీకి ఒక స్థానం ఇవ్వడానికి ప్రతిపక్షము సభ్యులుకూడా ఒప్పుకొన్నారు. ఇది ఇంతవరకు చర్చించిన తరువాత co-option ఈ బిల్లులో తీసుకురావడానికి సావకాశముఉన్నది. నాకు తెలిసిన రాజమండ్రి మునిసిపాలిటీ సంగతి చెబుతాను. అక్కడ స్త్రీలకు రిజర్వేషను. స్థానాలు ఉన్నాయి. దాంట్లో 2 కాంగ్రెసు, 1 స్వతంత్ర, 3 కమ్యూనిస్టు ladies వచ్చారు. రిజర్వేషను వున్నప్పుడు అక్కడ కమ్యూనిస్టు పార్టీ lady రాకుండా చేయడానికి సావకాశములేదు. మన గ్రామాలకు వెళ్లినప్పుడు సరాసరి స్త్రీలు ఎన్నికలకు నిలబడరు. ఇంకా వారు రాజకీయాలలోకి ముందుకు చొచ్చుకు రావడము ఆచారములేదు. కాబట్టి ఎన్నికలకు స్త్రీలు ఎవరూ నిలబడరేమో అనే అభిప్రాయముతో co-option తీసుకురాబడింది. కాని రిజర్వేషను పెట్టాలంటే ఈ అనుభవము చూచిన తరువాత ఒకవేళ అవసరము అయితే ఒక సంవత్సరము trial

అయిన తరువాత రిజర్వేషను తీసుకురావడానికికూడా ప్రభుత్వానికి ఏమీ అభ్యంతరము లేదని మనవిచేస్తున్నాను.

ప్రెసిడెంటు ఎన్నిక విషయములోకూడా వారు కొన్ని విషయాలు చెప్పారు. ఇది ప్రజాస్వామికంకాదు. వార్డులనుంచి మెంబర్లను ఎన్నుకున్నప్పటికి ధనికుడు వస్తాడు, లేకపోతే ఏ నాయకుడో పెత్తందారోవస్తాడు అని అన్నారు. ఒక పెత్తందారు ఉంటే ఆయనకు 51-49 అంకెలు అని చెప్పి ధనికుడు మెంబరు కావడానికి సావకాశం ఉన్నదన్నారు. అదికూడా ఒక ప్రజాస్వామికమే. ఇవతల మునిసిపాలిటీ ఎన్నికలు అట్లాగే జరుగుతున్నాయి. జిల్లా బోర్డుల ఎన్నికలు అట్లాగే జరుగుతున్నాయి. పంచాయితీ ఎన్నికలుకూడా అట్లా ఎందుకు జరుగకూడదో అర్థము కావడములేదు.

ఇప్పుడు అనుభవములో dead, locks ఎన్నోచోట్ల వున్నాయి. సుందరయ్యగారు గనుక ఒకరోజు నాతో కూర్చుంటే అన్ని గ్రామాల తరపున వచ్చిన అర్జీలన్నీ ఎవరెవరు పంపించారో dead locks ఎక్కడెక్కడ create అయ్యాయో వారికి మనవిచేస్తాను. అందుకని dead locks create అవడము మూలానా అధ్యక్షులు ఒక పార్టీ మెంబర్లు ఒక పార్టీ కావడము మూలానా యీ direct elections మార్చడానికి సంకల్పించి-యీ ఉద్దేశముతో ఇకమీదట పంచాయితీలు సరియైన కార్యక్రమము ఆచరించడానికి సక్రమముగా నడుపడానికి-ఆ అభిప్రాయముతో తెచ్చిందే కాని ప్రజాస్వామికములో ప్రజలంతా ఎన్నుకొన్న వాండ్లను కాకుండా చేయడానికి ఇవతల ఎవరినో ధనికుని తీసికొచ్చి అతనికి ఇవన్నీ కట్టబెట్టే అభిప్రాయముతోకాదు అని మనవిచేస్తున్నాను. తర్వాత Special Officer విషయములో చెప్పారు. Special Officers ను రెండుగా విభజించినారు-Section 48 క్రింద ఒకటి Section 122 క్రింద ఇంకొకటి. Section 48 లో, పంచాయితీలు రద్దు చేసినప్పుడు కాని మళ్ళీ తిరిగి పునర్నించేలోపుగా Executive Officer వున్నప్పటికీ పంచాయితీ బోర్డుకును అధ్యక్షులకును వున్న అన్ని powers Execute చేయడముకోసము ఒక Special Officer ను వేస్తున్నారు. ఆ Special Officers కు I.G. అన్ని powers యివ్వాలని ఏమిలేదు. గవర్నమెంటు అనుమతితో కొన్ని powers అది అయినా ఒకవేళ Deputy Panchayat Officer ను Special Officer గా వేస్తే ఆ జీతమేమి యివ్వనక్కరలేదు. ఒక honorary man ను గనుకవేస్తే కొంత జీతము యివ్వవచ్చును అని వుంది. ఇంకాక విశ్వేశ్వరరావుగారు కంకిపాడు విషయము చెప్పారు. అక్కడి

Sri A. B. Nageswara Rao] [6th December 1955

పంచాయితీని supersede చేశారు. అక్కడ ఒక honorary Special Officer ను వేశారు. అతనికి జీతము ఇచ్చారోలేదో నాకు తెలియదు కాని అతను elections జరిగేవరకు Honarary Officer గా వున్నాడు. ఆయనే తర్వాత కంకిపాడులో President అయ్యాడు. వారు చెప్పిన డబ్బు తినివేసిన President కాడు. ఇప్పుడున్న President కాదు అనుకుంటాను. అంతకు ముందున్న President అనుకుంటాను. తర్వాత 122 Section క్రింద Special Officer ను appoint చేయడానికి క్రొత్తగా పంచాయితీలు ఏర్పాటు చేస్తున్నారు. మొత్తములో పంచాయితీలు ఏర్పాటుచేస్తున్నా రంటూ notify చేస్తాము ముందు. Notify చేసి Election పెట్టడానికి తగినంత వ్యవధిలేకుంటే కొంత మధ్య కాలవ్యవధివస్తుంది. యీ వ్యవధిలో ఒక Special Officer ను appoint చేస్తున్నారు. ఆయనను ఎందుకు appoint చేస్తున్నారు. పన్నులు వేయడానికేనా అని సుందరయ్యగారు అన్నారు. పన్నులు వేయాలో ఏమి వేయాలనేది గవర్నమెంటు, వారికి తగిన వుత్తరువులు ఇస్తుంది. ముఖ్యంగా ఏమిటంటే పంచాయితీలను form చేసి ఒక Special Officer ను అంటూ వేస్తే automatic గా ఆ పంచాయితీకి కొన్ని రుసుములు వస్తాయి. మామూలుగా land cess వస్తుంది. Transfer of Property లో surcharge కూడా వస్తుంది. తర్వాత గవర్నమెంటు, I.G. కనుక ఒప్పుకొన్నట్లయితే మామూలుగా ఇతర పన్నులు వేయడానికి వీలువుంటుంది. లేకపోతే అధమము యీరెండు తరగతుల క్రిందనైనా ఆ పంచాయితీలకు కొంత ఆదాయము వస్తుంది. ఆ ఆదాయముపెట్టి Election అయ్యేలోపుగా కొంత కార్యక్రమము జరుపడానికి కూడా వీలుబోతుంది. తరువాత విశ్వేశ్వరరావుగారు మాట్లాడుతూ ఆ Special Officers Elections నడుపడానికంటూ కాలము గడుపవచ్చునన్నారు. ఆ అధికారము Special Officer కు లేదు. Inspector of Local Boards కే వుంది అధికారము, Inspector of Local Boards తగినంత కారణాలు చూపించి దానికి అవసరమైతే election మొట్టమొదట fix చేసిన తేదీలోవుగా జరుపకపోతే notify చేసి మళ్ళీ ఇంకొక తారీకు fix చేసి elections జరుపమని ఉన్నది. అంతేకాని Special Officer కు మాత్రము ఆ powers లేవని మనవిచేస్తున్నాను విశ్వేశ్వరరావు గారికి. తర్వాత యీ 12½% విషయములో వావిలాల గోపాలక్రిష్ణయ్యగారు ఒక చీటి చదివారు. వారు చీటిలో చదివినదంతా నిజమే. పంచాయితీలు 1951 సంవత్సరములో Act లో పెట్టినపుడు ఆర్థిక పరిస్థితి బాగుంటుంది అనే అభిప్రాయముతో అది ఐనా Land Revenue 12½% II Class పంచాయితీలకు ఇవ్వడానికే వున్నది. దీనికి అసలు డబ్బు యిచ్చిందిలేదు. మళ్ళీ తిరిగి తీసుకొన్నదిలేదు. ఇదంతకూ పుస్తకములో

వున్నంతవరకేగాని వారికివచ్చే రాబడి మాత్రము యీరోజు తీసివేయడము లేదు. ఇవ్వాలన్నమాట ఒక్కటేకాని ఇంతవరకూ ఇవ్వలేదు. ఇకముందు ఇవ్వకోవడమనే question ఒకటే వున్నదికాని ఇంతవరకూ యీ 3-4 సంవత్సరాలనుంచీ వస్తున్న surcharge of Transfer of Property లో ఇస్తున్నారు. శిస్తు ఒక్కటే తగ్గించారు ఒక పర్సెంటు. కాని ఇది ఇచ్చిందిలేదు. పూరికే పుస్తకాలలో ఒక section క్రిందవుంది. ప్రతిపక్ష సభ్యులు ఊరకే చెప్పుతున్నారేకాని గవర్నమెంటు పరిస్థితిచూస్తే తమకందరికీ తెలుసు 3½ లక్షలనుంచి 5½ లక్షలదాకా deficit లోకి వెళ్లిందని. ఈ వేళ 12½% ఇవ్వాలంటే సుమారు 75 లక్షలదాకా ఇవ్వవలసి వుంటుంది. 75 లక్షలు యిస్తే క్రమేపి ఈ Deficit ఇంకా ఎక్కువ పోతుందనే అభిప్రాయముతో ఇవ్వడములేదు. ఏరోజున ఆర్థిక పరిస్థితి ప్రభుత్వానికి కొంచెము బాగుపడుతుందో ఆ రోజున section మళ్లీ include చేయడానికి ప్రభుత్వానికి అభ్యంతరము లేదు. ఈ రోజున ఆ section గనుక వున్నట్లయితే ఏ పంచాయితీ అయినా దావా వేస్తే 5 సంవత్సరాల నుంచి with retrospective effectతో డబ్బు వారికి ఇచ్చికోవలసిన పరిస్థితివుంది. కాబట్టి ఈ రోజున ఆ Secion ను repeal చేయుబడుతుందని మాత్రము మనవి చేస్తున్నాను. తర్వాత Markets విషయము చెప్పారు. మామూలుగా Act లో 81—82 Sections వున్నాయి. ఆ 81—82 sections ఇందులో Private Markets ను Prohibits చేస్తున్నాయి. మామూలుగా ఈ Private Markets ఇప్పుడువున్న Act ప్రకారం అయ్యేటట్లయితే ఆ Private Markets వల్ల వచ్చే ఆదాయాన్ని కనుక దేవాలయాలకో చదువుకో దేనికైనా సత్క్రమమార్గములో ఖర్చు పెట్టుతారని తోస్తే వాటికేవో certificates ఇవ్వమని అటుల గనుక వాటినినడుపక పోతే Penalties వున్నాయి. కాని High Court వారు ఒక దావాలో వీటినన్నిటిని invalid చేశారు. ఈ section ను invalid చేశారు. అందుచేత మునిసిపాలిటీ Act లో 261—262 sections క్రింద ఈ Private Markets ను regularise చేసి వాటిని Licensing చేయడముకోసము ఈ క్రొత్త sections తీసుకొనిరాబడినాయే కాని వావిలాల గోపాలక్రిష్ణయ్యగారు చెప్పినట్లు ఆ వూర్లలోవుండే ప్రజలను మార్కెట్టులో వుండేవారిని కొట్లలో వుండే వారిని బాధపెట్టడానికికాదు. Regularise చేసి ఆ Markets ను కలిపితే దానివల్ల మార్కెట్లమీద వచ్చే ఆదాయములో 100.కి 15 వంతున Licensing క్రింద పుచ్చుకోడానికి ఇదివరకువున్న section ను తీసివేసి క్రొత్త section ఏర్పాటు చేయబడ్డదికాని ప్రజలను బాధపెట్టడముకోసముకాదని మాత్రము నేను మనవి చేస్తున్నాను. తరువాత ఇదివరకు మొట్టమొదట Act పెట్టినపుడు Class I, Class II పంచాయితీలకుకూడా బండ్ల

పన్ను వుండేది. క్రిందటి ప్రభుత్వములో కొన్ని ప్రాంతాలనుంచి బండ్ల పన్ను వేసుకోడానికి మాకు సావకాశము ఇవ్వాలని అర్జీలు ఇచ్చినమీదట Class I పంచాయితీకి option ఇచ్చి Class II కు పూర్తిగా రద్దు చేశారు. కాని నేను తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి కృష్ణా జిల్లాలలో తిరిగినపుడు Class II పంచాయితీలవారు మేముకూడా బండ్లపన్ను వేసుకొంటామని చెప్పారు. Class I పంచాయితీలకు option ఏలావుంచారో మాకుకూడా option ఇవ్వమని కోరిన మీదటే Class II పంచాయితీలకుకూడ option ఇవ్వడానికి బిల్లు తేబడినది. తర్వాత విశ్వేశ్వరరావుగారు మాట్లాడుతూ తోట్లవల్లూరు సంగతి చెప్పారు. తోట్లవల్లూరులో 13—14 సంవత్సరాలనుంచి Election జరుపలేదన్నారు. దీనికి కారణము దానికి అధ్యక్షుడైనటువంటి కమ్యూనిస్టు సభ్యుడే అని నేనుతమకు మనవి చేస్తున్నాను. ఆ ప్రక్కనవున్న పాములలంక అని చెప్పారే ఆ పాములలంకను ఈ పంచాయితీలో కలుపమని మొట్టమొదట Election పెట్టినపుడు ఒకరిట్ వేశారు. ఆ రిట్ మూలాన ఇంతవరకు జరిగింది. High Court వారు ఆ రిట్ లో ఆ పాములలంకను కలుపనక్కరలేదని తీర్పు ఇచ్చారు. అందుకని కలుపలేదని మాత్రము మనవి చేస్తున్నాను. నేను ఈ మధ్యనే ఆ వూరు వెళ్లివచ్చాను. తిరిగి మళ్ళీ ఆ పంచాయితీని Reconstitute చేయడానికికూడా ప్రయత్నము జరుగుతుందని మాత్రము వారికి మనవి చేస్తున్నాను.

తరువాత block ల విషయం చెప్పారు. బ్లాకులన్నీ అన్యాయంగా కలిపేస్తున్నారు. వారియిష్టంవచ్చినట్టు కలిపేస్తున్నారు అని. అసలు Block లనేవి Revenue department census కోసం ఏర్పాటుచేసినవి. అంతే గాని యివ్వేళ పంచాయితీలకోసం Inspector general of local administration గాని Panchayat officers గాని పెట్టిన Blocks కావు. ఒక్కొక్క Block ఒక Ward కావచ్చు. కొన్ని Blocks కలిపి ఆ Seat reservation కావచ్చు. ఏమయినా notify చేసినతరువాత అక్రమం అనితోస్తే Governmentకు appeal చేసుకోడానికి ఎప్పుడూ power వున్నది. Government కు cancel చేయడానికికూడా Power వున్నది. అక్రమంగా న్యాయం చేయడంలేదని అటువంటి అర్జీలు వస్తున్నాయి. వాటిమీద ప్రభుత్వం చర్యతీసుకొని అవసరమైతే మార్పుచేస్తుందని గౌరవసభ్యులకు మనవిచేస్తున్నాను. తరువాత కొందరు సభ్యులు Panchayat Board member లకు అధ్యక్షులకు చదువురానందువల్ల maintain చేయడంలో Classes పెట్టాలనే దాన్నిగురించికూడా క్రిందటినెల 3 వ తారీఖున Local Self government ministers Meeting అయినది. రాజకుమారి అమృతకౌర్ తప్పకుండా యీ సందర్భంలో పంచాయితీ

అభివృద్ధికోసం చాలా ప్రయత్నంచేస్తున్నారు కేంద్రప్రభుత్వంలో. దీనికోసం Training classes పెట్టడానికి అయ్యేఖర్చులో 75% ఖర్చు Central Government యివ్వడానికి తక్కింది రాష్ట్రప్రభుత్వం పెట్టుకుని Second Five Year Plan లో చేయడానికి ప్రభుత్వంయొక్క ఆలోచనలోవున్నదని గౌరవసభ్యులకు మనవిచేస్తున్నాను. తరువాత షేకుమౌలా సాహేబుగారు Executive Officer విషయంలో చెప్పారు. పంచాయితీబోర్డు అధ్యక్షుడు తప్పుచేసినప్పుడు ఎలాగయితే తీసేస్తున్నారో Executive officers తప్పుచేసినప్పుడు వారిని శిక్షింపడానికి ప్రభుత్వం వెనుకతీయడంలేదని, వారుచెప్పిన Executive officer పై కూడా విచారణజరుగుతున్నదని మనవిచేస్తున్నాను. విశ్వేశ్వరరావుగారు కొటూరు వ్యవహారం చెప్పారు. Executive officer మీద విచారణ జరుగుతుందనికూడా మనవిచేస్తున్నాను. పాలకొండ విషయంలో అప్పారావుగారు చెప్పారు. దానికి వీలయినంతవరకు యిప్పుడే సమాధానం చెప్పాలని చూచాను. కాని Secretariat లో కాగితాలు దొంకలేదు అనిచెప్పారు. ఆ విషయంలో తప్పకుండా చర్యతీసుకుంటాననికూడా మనవి చేస్తున్నాను.

షేకుమౌలాగారు Executive officer పన్నులేదో హెచ్చువేశారు. Appellate powers board కున్నప్పటికేకూడా డబ్బుకడితేనేగాని Appeal కు వీలులేదన్నారు. ఆ విషయంలో వారు నాతో చెప్పినప్పుడు నాకు అధికారంలేదని చెప్పలేదు. అది పొరపాటువిన్నారు. ప్రభుత్వానికి సర్వఅధికారాలూవున్నాయి. కాని వారు అడిగిందేమిటంటేవేసిన Demand కు stay యిమ్మన్నారు. ప్రస్తుతం వున్న చట్టప్రకారం stay యివ్వడానికి సావకాశంలేదు. వారు కావాలంటే కబురంపించి మాట్లాడాక సక్రమంగా చట్టంప్రకారం చేస్తాం అని చెప్పానులోని Minister కు అధికారమే లేదనిచెప్పలేదు.

తరువాత Auditors విషయం. గత 8 నెలలలో నా కున్న అనుభవాన్నిబట్టి Audit పని వీలయినంతవరకు నేనే చేస్తున్నాను: చూస్తే లెక్కలు తప్పులు వ్రాస్తున్నారు. Cheque ఒకరోజున Draw చేసి ఒకరోజున జమకడుతున్నారు. Executive officers, President కూడా ఈవిధంగా చేస్తున్నట్టు కనపడింది. District panchayat officer లకు యితర కార్యక్రమం కాకుండా Auditory కూడా పెడితే సక్రమంగా నడవదని Auditory staff ను పెట్టి వారికయ్యే ఖర్చు యిప్పించడానికి చూస్తున్నాం. అయ్యేఖర్చు ఎంతవుతుందంటే ఒక పంచాయితీబోర్డు ఆదాయం వెయ్యిరూపాయలుంటే పది, పన్నెండురూపాయలకన్న ఎక్కువకాదు. మా

మూలుగా జిలాబోర్డులకు మునిసిపాలిటీలకు Audit ఏరకంగా జరుగుతుందో పరిశీలించి పంచాయితీబోర్డు డబ్బు దుర్వినియోగం కాకుండా Audit తేవాలని మనవి చేస్తున్నాను. ఇంతవరకు Auditors ను Appoint చేయలేదు. Appoint చేసే అభిప్రాయంతోనే యీ బిల్లు తీసుకురాబడింది.

తరువాత Check measurements కు supervisors ను వేయమన్నారు. supervisors ఖర్చు వారే వేసుకుంటున్నారు. దానికి Legislation అవసరం లేదు. ఆదాయం వృద్ధిఅయిన తరువాత Technical staff ఎవరయినా వారికితే వేయాలనే అభిప్రాయంవున్నది.

ఆఖరుకు తమకొకటి మనవి చేస్తున్నాను. ఇది select committee కి పంపించడానికి వీలులేదని పాత పంచాయితీలు 2-1-56 లో అవుతున్నాయి, 4 వేల పంచాయితీలకు త్వరలో ఎన్నికలు జరుపాల్సివుంటుంది. కాబట్టి యీ Bill select-committee కి పంపించనవసరం లేకుండా వెంటనే ఏకగ్రీవంగా అంగీకరించాలని వినయపూర్వకంగా అందరు గౌరవసభ్యులను కోరుతున్నాను.

MR. SPEAKER : The question is :

"That the Bill be referred to a Select Committee of this House."

The amendment was lost.

MR. SPEAKER : The question is :

"That the Madras Village Panchayats (Andhra Second Amendment) Bill, 1955, be taken into consideration at once."

The motion was carried and the Bill was taken into consideration.

Clause 2 was put and carried.

MR. SPEAKER : The motion is :

"That clause 3 do stand part of the Bill."

SRI P. SUNDARAYYA :—Sir, I move :

"Add the following new explanations II and III :

'Explanation II : When any area is included in any village for the purpose of this Act the total population should be about 1000 and such areas should not be at more than one mile from the village in which they are being included.

Explanation III : When any area is excluded from the village, no area which is one mile from the centre of the village be excluded from it'."

కొన్ని గ్రామాలు కలిపినపుడు వేయిమంది జనాభాకు మించి వుండకూడదు. ఆ కలిపేటటువంటి ప్రాంతము మైలుకు మించిన దూరంలో వుండకూడదు. రెండోది ఒకవేళ గ్రామంనుంచి ఏప్రాంతమునైనా తొలగించదలచుకొంటె గ్రామంమధ్యనుంచి ఒక మైలుకు మించి వుండకూడదు. యీ రెండు సవరణలు ప్రతిపాదిస్తున్నాను. మంత్రిగారు ఎంతో ఉపన్యాసం చేశారు. తొట్ల వెల్లూరులో కమ్యూనిస్టు President Writ వేశారు High Court లో పాములలంక దీంట్లోనుంచి తొలగించేశారు కాబట్టి దీంట్లో కలిపి ఎన్నికలు పెట్టాలని దాంతోపాటు పాముల్లంక తొట్ల వల్లూరు Revenue Village లో ఒక భాగమని తొట్ల వల్లూరు గ్రామానికి అది 4 ఫర్లాంగుల దూరంలో మాత్రమే వున్నదని, అంతవరకు పంచాయితీతో పాముల్లంక కూడా ఉండిందని ఈమూడు వివరాలు చెప్పి ఏ కారణంచేత I.G of Local Administration పంచాయుతీనుంచి తొలగించారు ? తొలగించినప్పుడు మంత్రివర్గానికి వచ్చి చెప్పుకుంటే దిక్కులేదు. Inspector General of Local Administration కు చెబితే దిక్కులేకుంటే High Court కు పోయాం. దీనిమీద Supreme Court కు పోవాలా ? High Court తీర్మానం చేసింది ఒప్పుకోవాలంటే ఒప్పుకోము. High Court తీర్మానం వేదవాక్యం అని నమ్మేదానికి ఇక్కడ ఎవరూ లేరు. High Court ఇటువంటి తీర్మానం ఇవ్వకుండా పొరపాటుకు వీలులేకుండా సవరణ పెట్టాలి. ఒక గ్రామంలో ఒక భాగాన్ని తీసివేయదలచుకుంటే మైలు లోపలవుంటే తీసివేయకూడదని, కలపాలంటే మైలు దూరంకు మించి వుంటే కలుపకూడదని వేయినుండి జనాభా ఐతే వుండాలని చెప్పాము. నిజంగా మంత్రిగారు అటువంటి అవకతవకలు జరుగకుండా ఈ explanation అంగీకరిస్తే న్యాయంగా వుంటుంది. అంగీకరిస్తారో లేదో దానినిబట్టి తెలుస్తుంది.

The amendment was duly seconded.

MR. SPEAKER : Amendment moved—

" Add the following new explanations II and III :

'Explanation II. When any area is included in any village for the purpose of this Act the total population should be about 1000 and such areas should not be at more than one mile from the village in which they are being included.

Explanation III : When any area is excluded from the village, no area which is one mile from the centre of the village be excluded from it '."

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అధ్యక్షా, ఈ సవరణను నేను అంగీకరించడంలేదు, ఎందుచేతనంటే వెయ్యి జనాభా వున్న ఇదివరకున్న పంచాయతీలు ఏర్పాటుచేసినప్పటికికూడా కలిపే చేస్తున్నాం. ఊరి మధ్యనుంచిగాని వీధులనుగాని పంచే అభిప్రాయం ప్రభుత్వానికిలేదు. కాబట్టి 500 మందింటె ఎక్కువ వుంటే ఆ అధికారంకూడా తీసుకుని వేయి జనాభాకు కలుపుతున్నారు. దానికి administrative convenience ఒకటుంది. ఇదంతా ఆలోచించాలి ఇవాళ యీ explanation పెట్టి bind లో చేస్తే సక్రమంగా పంచాయతీలు ఏర్పాటు చేయడానికి సావకాశం వుండదు. అందుకనే free latitude ఇచ్చి సక్రమంగా Panchayat Board లు ఏర్పాటు చేయడానికే యీ బిల్లు తీసుకురాబడింది అని మనవిచేస్తున్నాను. ఈ explanation మాత్రం నేను అంగీకరించడం లేదు.

SRI P. SUNDARAYYA :—15 వందలు అంగీకస్తారా ? రెండు వేలు అంగీకరిస్తారా ? ఏదో ఒకటి చెప్పండి మీరు. ఏమి చెప్పకుండా మా ఇష్టం వచ్చినట్లు చేస్తామని బిల్లుతెస్తే న్యాయంకాదు. సవ్యంకాదు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఏ పంచాయితీ బోర్డులోనుంచి అది exclude చేయబడుతుందో, ఆ పంచాయితీబోర్డుకు తెలిపే చేస్తున్నారని గౌరవ సభ్యులకు మనవి చేస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :— తెలిపే చేస్తున్నారు. బాగానే ఉంది, అంతకంటె ప్రజాస్వామికంకూడలేదు. గాని

ఇపుడు దాంట్లో ఏమంటే, రివిన్యూ Villages ని split చేయడానికికూడ అవకాశం ఉంది. ఒక గ్రామంలోనుంచి కొంత భాగాన్ని చీల్చి ఇంకొక గ్రామంలో కలిపే టటువంటి అవకాశం ఉంది. మీరు తెచ్చిన సవరణలో ఆ గ్రామాన్ని చీల్చవలసిన అవసరాలు ఎప్పుడెప్పుడు వస్తాయో అది ఎందుకు పెట్టారో చెప్పుతారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అసలు గ్రామానికి శివారు గ్రామానికి ఉన్న దూరాన్నిబట్టి.

"Revenue village includes hamlets also. Hamlets may be three miles from the village. Therefore it can be separated and added on to another revenue village which is very near to the hamlet".

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, I want to make a statement. ఈ బిల్లును Select Committee కి పంపమంటే పంపించలేదు. ఎంత న్యాయమైన సవరణను పెట్టినాకూడ దానినికూడ అంగీకరించడానికి తయారు కానపుడు మేము ఈ బిల్లుమీద ఈ శాసనసభలో కూర్చొని చర్చించడం అనవసరం. అందుచేత మేము ఈ శాసనసభనుంచి విరమిస్తున్నాము. వాండ్లు త్వరగా ప్యాసు చేసుకొని ఇష్టమునచ్చినట్లు చేసుకోవచ్చును.

(Then the Members of the Communist Party led by Sri P. Sundarayya walked out of the Assembly.)

MR. SPEAKER : The question is :

" Add the following new Explanations II and III :—

'Explanation II : When any area is included in any village for the purpose of this Act the total population should be about 1000 and such areas should not be at more than one mile from the village in which they are being included.

Explanation III : When any area is excluded from the village, no area which is one mile from the centre of the village be excluded from it '."

The amendment was lost.

Clause 3 was put and carried.

Clauses 4 to 22 were put and carried.

Clause 1 was put and carried.

The Preamble was put and carried.

(At this stage, Sri M. Satyanarayana Raju withdrew from the House.)

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Sir, I move :

"That the Madras Village Panchayats (Andhra Second Amendment) Bill, 1955, be passed into law.

MR. SPEAKER : The question is :

"That the Madras Village Panchayats (Andhra Second Amendment) Bill, 1955, be passed into law."

The motion was carried, and the Bill was passed into law.

ANNOUNCEMENT re :

*Message from the Governor.*

MR. SPEAKER : I have to announce to the House that the following message, dated 25th November, 1955 has been received from the Governor of Andhra :

"In pursuance of Article 207, clause (1) of the Constitution of India, I, Sri C. M. Trivedi, Governor of Andhra, hereby give my recommendation to the introduction in the Legislative Assembly of the Andhra Court Fees and Suits Valuation Bill, 1955."

## (2) THE ANDHRA COURT FEES AND SUITS VALUATION BILL, 1955.

SRI AYYAPU REDDI :—Sir, Permit me to say a few words on this Bill. This Bill has not received enough publicity. None of the dailies published it in extenso. This is of course a very important piece of legislation and most of the members of the Bar have not yet read this Bill. I suggest that a copy of the Bill be sent to the

Secretary of every Bar Association and their opinions are also obtained before the Select Committee finalises the Bill.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ బిల్లును public opinion కు circulate చేయమని శ్రీ అయ్యప రెడ్డిగారు ప్రతిపాదన చేస్తున్నారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అధ్యక్షా, ఈ బిల్లును Select Committee కి పంపవలసినదిగ ఈ సభవారిని కోరుతూ ఉన్నాను. దానిని గురించి పెద్ద ఉపన్యాసం చేయవలసిన అవసరంలేదు అనుకొంటాను. 80 ఏండ్ల క్రిందట చేయబడినటువంటి ఈ చట్టం ఏమి మార్పులేకుండా అట్లే ఉంది. అయితే ఇపుడు ఉన్న దేశకాల పరిస్థితిని అనుసరించి, ఇపుడు ఉన్న నోట్లను అనుసరించి మార్పు చేయవలసిన అవసరం ఉంది అని భావిస్తున్నాము. అదేకాకుండా ఈ మార్పుద్వారా, ప్రభుత్వానికి కొద్దిగ అదనపు ఆదాయంకూడ వచ్చే అవకాశాలు ఉన్నాయి. 1937 వ సంవత్సరంలో High Court వారు ఒక ప్రత్యేక ఉద్యోగిని నియమించి, ఈ విషయాన్ని గురించి పరిశీలన జరిపించారు. మద్రాసు ప్రభుత్వం కూడా ఆ పరిశీలన ఫలితంగానే ఈ మధ్య Court Fees కు సంబంధించిన చట్టం చేసుకొన్నారు. ఆ చట్టాన్ని అనుసరించి మనముకూడా వెనుకటి చట్టానికి సవరణ చేస్తున్నాము. అయితే మన రాష్ట్రంలోని ప్రత్యేక పరిస్థితులు గమనించి కొద్ది మార్పులతో ఈ సవరణ బిల్లు ఈ సభముందు పెట్టబడింది. దీనికన్న హెచ్చుగా చెప్పి సభ్యులను విసిగించడం నాకు ఇష్టంలేదు. ఇంతక్రితం శ్రీ సుందరయ్యగారు చెప్తూతూ "మేము ఏ బిల్లును Select Committee కి పంపించడంలేదని, వారు చెప్పేది ఏదీ వినడంలేదని" అన్నారు. కాబట్టి ఇక్కడనే ప్యాసు చేయదలచుకొన్న ఈ బిల్లును Select Committee కి పంపించాలి అని వారు సూచించిన సూచనను మేము అంగీకరించాం. వారి అందరి సలహాకూడ మాకు అవసరం. కాని వారు చెప్పినవన్నీ ఒప్పుకోమని కోరితే మాత్రం దానిని మేము అంగీకరించలేము. కాని Select Committee లో వారు చేసే సూచనలు ఎంతవరకు ఉపయోగపడుతాయో ఆలోచిస్తాం. అక్కడైనా అవి అంగీకరిస్తామనికాదు. కొంతవరకు వారి సలహాను కూడ, వారిసలహాలేకాదు, ఇతర పార్టీల సలహాలనుకూడ పాటించి రాష్ట్రానికి శ్రేయస్కరంగా ఉండే విధంగా చట్టాలు చేయాలనే మా ఆశయం. Court fees హెచ్చించేటప్పుడుకూడ తక్కువ విలువగల నోట్లకు

Sri N. Sanjeeva Reddi] [6th December 1955

హెచ్చించకుండా ఉండే విధంగానే, పెద్ద సూట్లకు మాత్రం హెచ్చించేవిధంగాను, మార్పుచేస్తున్నాను. అంటే 5 వందలు, వెయ్యి, రెండువేలు ఇలాంటి సూట్లకు ఎక్కువ పెంచకుండా,-సుందరయ్యగారు పలుమారు అదే చెప్పుతూ ఉంటారు-చిన్నవారిపైన భారంపడకుండా పెద్దవారిమీదనే హెచ్చు పన్ను విధించేటట్లుగా సవరణలు చేయదలచుకున్నాను. అదే అందరి ఆశయంకూడ. కాబట్టి వారి ఆశయ అనుసరణమీదనే చిన్నసూట్లపై Court fees హెచ్చించలేదు. 1,000, 2,000 రూపాయలకు సూట్లకు మామూలుగా ఉన్న fees ను అట్లే ఉంచి, పెద్దవాటికే హెచ్చించాము. హెచ్చింపు పన్ను పేదవారికి అన్వయించకుండా చూచాము. కాబట్టి ప్రతిపక్షాల వారు మమ్ములను దీనికి అభినందిస్తారని ఆశిస్తున్నాను. ఇంకా కొన్ని ముఖ్యమైన సవరణలు ఇందులో ఉన్నాయి. ఆ ముఖ్యమైన సవరణలు అన్ని, అన్ని పార్టీలవారి అంగీకారం బడయగలవని నా విశ్వాసము. ఇది ఏదో కాంగ్రెసు పార్టీకి సంబంధించిన విషయంకాదు. పంచాయితీ బోర్డులకు ఎలక్షనులు వచ్చి, ఏ పార్టీ జయిస్తుంది? ఎవరు మెంబర్లు అవుతారు? ఎవరు ప్రెసిడెంటు అవుతారు? అని అనుకొనే విషయంకాదు ఇది. ఒకేపార్టీవారు కోర్టుకువెళ్లి ఇంకొక పార్టీవారుపోరుఅనే విషయంకాదు ఇది. ఇదిరాష్ట్రం మొత్తంపైన ఉన్న ప్రజానీకానికి సంబంధించినది. రాజకీయాలకు అతీతము అయినది కాబట్టి మనం అందరముకలిసి ఇప్పుడున్న శాసనాన్ని బాగా సవరించి, తరువాత అసెంబ్లీలో ఏకగ్రీవ ఆమోదమును పొందేరకంగా చూచుకోగలమని ఆశిస్తున్నాను. ఆ విశ్వాసంతోనే ఈ Bill ను Select Committee కి పంపితే బాగా ఉంటుంది. అయితే ఈ బిల్లును శాసనసభలోనే ప్యాసుచేద్దామనుకొన్నాను. కాని మిత్రులయొక్క సలహాను పాటించి నేను ఈ బిల్లును Select Committee కి పంపించవలసినదిగ ఈ శాసనసభను కోరుచున్నాను. దానిపైన ఇప్పుడు చర్చ అవసరంలేదు. select Committee నుంచి వచ్చినతర్వాత చర్చ చేసుకోవచ్చును. కాబట్టి మీరందరు దీనిని ఏకగ్రీవంగా ఆమోదించి select committee కి పంపించవలసిందని కోరుతున్నాను.

SIR, I move—

"That the Andhra Court Fees and Suits Valuation Bill, 1955, be referred to a Select Committee.

MR. SPEAKER: Motion moved—

"That the Andhra Court Fees and Suits Valuation Bill 1955 be referred to Select Committee."

MR. SPEAKER: The question is:—

"That the Andhra Court Fees and Suits Valuation Bill, 1955 be referred to a Select Committee."

The motion was carried.

The following are the Hon. Members that will serve on the Select Committee as agreed to by the House;

1. Sri N. Sanjeeva Reddi, Deputy Chief Minister. (Chairman.)
2. Sri D. Sanjeevaiah, Minister for Co-operation.
3. Sri E. Ayyapu Reddi.
4. Sri T. Veeraraghavulu.
5. Sri P. Basi Reddi.
6. Sri G. Venkata Reddi Naidu.
7. Sri D. Kondaiah.
8. Sri Lakshminarayana Reddi.
9. Sri A. Bhagavanta Rao.
10. Sri D. V. Subbarao.
11. Sri Putsala Satyanarayana.
12. Sri S. Ranganatha Mudaliar.
13. Sri B. V. Subba Reddi.
14. Sri Gottumukkala Jagannatha Raju.
15. Sri M. Satyanarayana Raju.

The report of the Select Committee shall be submitted before 25th January 1956.

MR. SPEAKER: I adjourn the House *Sine Die.*

(The House then adjourned *Sine Die.*)

# APPENDIX

INDUSTRIES, CO-OPERATION AND LABOUR

## STATEMENT PLACED ON THE TABLE OF THE HOUSE.

[*VIDE*—ANSWER TO CLAUSE (b) OF LEGISLATIVE ASSEMBLY QUESTION No. 303].

(Vide page 554 supra—S. N. Q. 140)

| *Serial number and name of industrial concern from whom Loan is due.* | *Amount of loan due.* | | |
|---|---|---|---|
| (1) | (2) | | |
| | Rs. | A. | P. |
| 1. Sri Venkateswara Paper and Straw Board Mills, Ltd., (in liquidation), Tirupati. | 2,50,000 | 0 | 0 |
| 2. The Mohan Industries, Ltd., (liquidation), Tenali. | 92,049 | 0 | 0 |
| 3. Sree Radhakrishna Vegetable Oil Product, Ltd., Pamidi | 1,04,113 | 0 | 0 |
| 4. Messrs. The Vegetols, Ltd., Chittoor ... | 5,00,000 | 0 | 0 |
| 5. Messrs. K. V. Brahmam & Sons, Fountain Pen Manufacturers, Bhimavaram. | 3,662 | 10 | 0 |
| 6. Messrs. The Rayalaseema Mills, Ltd., Adoni. | 6,52,238 | 0 | 0 |
| 7. Messrs. Sree Swarna Industrial Engineering Company, Ltd., Vijayawada. | 17,381 | 4 | 0 |
| 8. Messrs. Pakanadu Oil Mills, Ltd., Nathamkandiga Nagari, Chittoor District. | 31,916 | 0 | 0 |
| 9. Srimati Gajalaxmi Amma, Messrs. Thanigai Murugan Metal Works, Satrawada, Chittoor. | 21,768 | 0 | 0 |
| 10. Messrs. Visakhapatnam Vegetable Oil Products Ltd., Bobbili. | 4,50,000 | 0 | 0 |
| 11. Messrs. Hindupur Vegetable Oil Refineries, Ltd., Hindupur. | 1,93,951 | 0 | 0 |

| (1) | (2) | | |
|---|---|---|---|
| | Rs. | A. | P. |
| 12. Messrs. The Hemalatha Textiles, Ltd., No. 320, Linghi Chetty Street, Madras-1. | 3,94,394 | 0 | 0 |
| 13. Messrs. The Guntur Vegetable Oil Industries, Ltd., Guntur. | 1,23,975 | 0 | 0 |
| 14. Messrs. The Guntur Tobacco, Ltd., Guntur. | 1,73,929 | 0 | 0 |
| 15. Messrs. The Chemicals, Ltd., Nidadavolu. | 67,851 | 0 | 0 |
| 16. Messrs. The Vasanta Soap Works, Vijayawada. | 1,15,220 | 0 | 0 |
| 17. The National Lime Works, Ltd., Panyam. | 9,205 | 0 | 0 |
| 18. Messrs. A. S. Krishna & Co., Guntur ... | 1,30,449 | 0 | 0 |
| 19. The Andhra Pharmaceutical Works, Ltd., Vijayawada. | 50,000 | 0 | 0 |
| 20. Sri K. Sambasiva Rao, Proprietor, Messrs. Kasinatha Potteries, Katrenipadu, Krishna District. | 77,000 | 0 | 0 |
| 21. Messrs. The South India Salt Refineries, Kamparti, Guntur. | 35,500 | 0 | 0 |
| 22. Sri V. Thimmaiah Clay Works, Agraharam, Chittoor. | 4,000 | 0 | 0 |
| 23. Sri The Bezwada Metal Industries, Ltd., Vijayawada. | 37,500 | 0 | 0 |
| 24. Sri V. Krishnamurthy Sri Gowri Automobile Engineering Works, Anantapur. | 31,000 | 0 | 0 |
| 25. Sri Choday Apparao Engineering, Works, Kakinada. | 48,000 | 0 | 0 |

# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

---

## FIRST SESSION OF THE SECOND ANDHRA LEGISLATIVE ASSEMBLY UNDER THE CONSTITUTION OF INDIA

VOLUME XII (NOS. 1 TO 5)

*1st to 3rd, 5th and 6th December*, 1955.

TABLE OF CONTENTS

*Thursday, the 1st December*, 1955.



*Friday, the 2nd December* 1955.



*Saturday, the 3rd December* 1955.





1

*Monday, the 5th December* 1955.



*Tuesday, the 6th December* 1955.

## INDEX

### A

APPA RAO, SHRI B.—contd.

B—(contd.) PAGES.



C

C—(contd.) PAGES.

E—(contd.)

G—(contd.) Pages

## H



## I

K—(contd.) PAGES.

## M



## N

N—(contd ) PAGES.

N—(contd.) PAGES.



## O.



## P.

P—(contd.) PAGES



## Q.

**Questions and Answers**

Q—(contd.) PAGES.

Q—(contd.)

PAGES.

Q—(contd.) PAGES.

PAGES.

R—(contd.) PAGES.

R—(contd.) PAGES.

S—(contd.)

S—(contd.)

S—(contd.) PAGES.

T—(contd.) PAGES.

V—(contd.) PAGES.

V—(contd.) **PAGES**



---